విక్టరీ

అందరూ గెలిచేదే అసలు గెలుపు !



జస్టిస్ శ్రీ కృష్ణ కమిటి నివేదిక

# ఏం చెప్పింది ?
# ఎందుకు చెప్పింది ?

డా॥ జి. వి. పూర్ణ చందు







## అందరూ గెలిచేదే అసలు గెలుపు !



జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ నివేదిక

# ఏం చెప్పింది ? ఎందుకు చెప్పింది ?



డా ॥ జి.వి. పూర్ణచందు

**VICTORY PUBLISHERS**
# 11-16-32, Singarajuvari Street, Kothapet,
 VIJAYAWADA - 520 001. Ph : 6465533 

విక్టరీ

జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ నివేదిక

# ఏం చెప్పింది ? ఎందుకు చెప్పింది ?

- జి.వి. పూర్ణచందు
బకింగ్‌హాంపేట, పోస్టాఫీస్ ఎదురుగా,
గవర్నర్‌పేట, విజయవాడ - 520 002.



ప్రథమ ముద్రణ : 2011

వెల : ₹ 40/-

***Sole Distributors :***

**SRI VENKATESWARA BOOK DEPOT**
Singarajuvari St., Kothapet, Vijayawada - 1.
Ph : (0866) 6663733, 2565038.

★ ★ ★

**SRI VENKATESWARA BOOK DEPOT**
Plot No.3, 103, # 2-4-1085, Sai Lakshmi Niketan,
Opp. Street of Ramakrishna Hospital,
Near Kachiguda Kumar Theatre, Nimboli Adda,
Hyderabad - 500 027.
Ph : (040) 65528228, 24653879
Fax : 24745257. Cell : 9346771314

# ఆంధ్రప్రదేశ్‌లో నెలకొన్న పరిస్థితిమీద సంప్రదింపుల కమిటీ
# Committee for consultations on the situation in Andhra Pradesh

**నివేదిక - డిసెంబర్ 2010**

**చైర్మన్**

జస్టిస్ బి.యన్. శ్రీకృష్ణ

**సభ్యులు**

ఆచార్య రణబీర్ సింగ్

డా॥ అబుసలే షరీఫ్

ఆచార్య రవీందర్ కౌర్

**సభ్యులు, కార్యదర్శి**

వినోద్ కుమార్ దుగ్గల్ ఐ.ఎ.ఎస్ (విశ్రాంత)

జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ సభ్యులు ఈ ఐదుగురూ రూపొందించిన ఈ నివేదికపై డిసెంబర్ 30, 2010న సంతకంచేసి డిసెంబర్ 31న కేంద్ర హోం శాఖామాత్యులకు అందచేయడం జరిగింది. ఈ నివేదికని యథాతథంగా, జనవరి 6, 2011 సాయంత్రం రాజకీయ పక్షాలతో సంప్రదింపుల అనంతరం ఇంటర్నెట్‌లో ప్రజలకు అందుబాటులోకి తీసుకురావడం జరిగింది.

# నివేదికాంశాల వరుస

# "అందరూ గెలిచేదే అసలు గెలుపు"

**గౌతమబుద్ధుని సూక్తి**

పండితనెహ్రూ అక్టోబర్ 3, 1960న ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీలో "Disputes and discord" అనే అంశం మీద ప్రసంగించినప్పుడు ఈ సూక్తిని ఉదహరించాడు.

జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ తన నివేదికని కూడా సందర్భోచితంగా ఈ సూక్తితోనే ప్రారంభించింది.

రెండు ప్రాంతాలవారు ప్రతిష్ఠాత్మకంగా తీసుకొని, విభేదాలు, విద్వేషాలు, ఆవేశ కావేషాలు పెంచుకున్నప్పుడు, కత్తిమీద సాములాంటి బాధ్యత నిర్వహించిన జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ ఈ యుద్ధంలో అందరూ విజేతలేననీ, ఎవరూ ఓటమి చెందలేదనీ, చివరికి గెలిచేది, గెలిచిందీ ప్రజలేననే అర్థాన్ని స్ఫురింపచేయటానికి ఈ సూక్తిని ఉపయోగించుకున్నారు.

సామాజిక సమస్యల మీద ఏ విశ్వవిద్యాలయమూ చెయ్యని మహత్తర పరిశోధనని ఒక సంవత్సర కాలంలోనే కమిటీ బాధ్యతాయుతంగా పూర్తి చేయగలిగింది. ఇచ్చినమాట నిలబెట్టుకొని చెప్పిన తేదీకే నివేదికని హోంమంత్రి చిదంబరంగారికి అందించింది.

రాజకీయ పార్టీలతోను, అలాగే చారిత్రక, రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక రంగ నిపుణులతోనూ నిరంతరంగా జరిపిన చర్చల సారాంశం ఈ నివేదికలో బహిర్గతమౌతోంది.

విజయవాడలో ఈ కమిటీ ప్రజా సమావేశాన్ని నిర్వహించినప్పుడు కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన నాకు మాట్లాడే అవకాశం ఇచ్చారు. తెలుగు భాషా సంస్కృతుల

ప్రాచీనత గురించి, రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలోని మాండలిక భాషా భేదాల గురించి, ఒక ప్రాంతం వారి మాండలికాన్ని ఇంకొక ప్రాంతం వారు హేళన చేయడం గురించి, మాండలిక వ్యత్యాసాన్ని ప్రత్యేక భాషగా చూపించే ప్రయత్నాల గురించి నేను ప్రస్తావించాను. కమిటీవారు ప్రజాభిప్రాయ సేకరణ చేసిన విధానాన్ని సన్నిహితంగా గమనించే అవకాశం ఆ విధంగా నాకు కలిగింది.

మూడు ప్రాంతాల ఆర్థిక సమతుల్యతనీ, సామాజిక సమతుల్యతనీ, సాంస్కృతిక సమతుల్యతనీ పరిరక్షించాల్సిన అవసరాన్ని జస్టిస్ శ్రీ కృష్ణ కమిటీకి అందించిన విజ్ఞాపనలో కృష్ణాజిల్లా రచయితల సంఘం తరఫున మేము గట్టిగా నొక్కి చెప్పడం జరిగింది. తెలుగువారికి కేంద్రస్థాయిలో జరుగుతున్న అన్యాయాల్ని ఎత్తి చూపించాము. భగత్‌సింగ్‌కు దక్కిన ఖ్యాతి సీతారామరాజుకు, కన్నెగంటి హనుమంతుకు, కొమరంభీముకీ, సర్వాపాపడికీ జాతీయస్థాయిలో దక్కలేదు. తెలుగుతేజాన్ని నిలబెట్టిన యన్టీఆర్, పీవీలకు సముచిత గౌరవం దక్కలేదు. మన ఎంపీల బలంతో కేంద్రంలో అధికారంలోకి వస్తున్నా ఏ రాజకీయ కూటమీ తెలుగువారికి తగిన ప్రాధాన్యత నీయడంలేదని వివరించాము.

జస్టిస్ శ్రీకృష్ణ తెలుగు తెలిసిన మేధావి. ప్రజలు తెలుగులో చెప్పిన విషయాలను కూడా శ్రద్ధగా విన్నారు. సమైక్యాంధ్రప్రదేశ్, తెలంగాణా ఉద్యమాల నేపథ్యంలో రాష్ట్రంలో నెలకొన్న పరిస్థితులపై సమగ్ర అధ్యయనం చేసి ఆచరణ యోగ్యమైన పరిష్కారాలు సూచించేందుకు కావలసిన సమాచారాన్ని రాబట్టేందుకు ఆయన అనేక ప్రశ్నలడిగారు. కొత్త విషయం ఏదైనా ఉంటే చెప్పమన్నారు.

సమాచారం సేకరిస్తున్న కొద్దీ కమిటికి లోతైన అధ్యయనం అవసరం అవుతూ వచ్చింది. ఒకవైపు దగ్గరపడుతున్న గడువు, ఇంకొకవైపు జటిలమైన సమస్యలకు మూలాల అన్వేషణ. అయినప్పటికి గడువులోపు అనితర సాధ్యమైన రీతిలో ఒక గొప్ప నివేదిక వెలుగు చూసింది.

ఈ నివేదికకు డాక్టరేటివ్వగలిగేటంత విశ్వవిద్యాలయం మనకి లేదు. మామూలు పరిశోధకులు ఇంత అధ్యయనం చేయగలిగేంత వనరులు కూడా మనకు లేవు. కేంద్ర ప్రభుత్వం వారు తలచుకొన్నారు. తగిన వ్యక్తులను ఎంచుకొన్నారు. వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని కమిటీవారు చిరస్మరణీయమైన నివేదికని అందించారు.

**కమిటీ ముందుంచిన పరిశీలనాంశాలివి :** కేంద్ర ప్రభుత్వ నోటిఫికేషన్ లెటర్ నెం. 12012/1/2009 తేదీ ఫిబ్రవరి 12, 2010 ప్రకారం కేంద్ర హోంశాఖ ప్రత్యేక

**కార్యదర్శి కమిటీ ముందుంచిన పరిశీలనాంశాలివి :**

1) సమైక్యాంధ్రప్రదేశ్, ప్రత్యేక తెలంగాణా వాదవివాదాల నేపథ్యంలో రాష్ట్రంలో నెలకొన్న పరిస్థితిని పరిశీలించటం.

2) ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన నాటి నుంచి, మూడు ప్రాంతాలలో జరిగిన అభివృద్ధిని సమీక్షించటం.

3) రాష్ట్రంలో ఇటీవలి పరిస్థితుల ప్రభావం వివిధ వర్గాల ప్రజలు, పిల్లలు, విద్యార్థులు, మైనారిటీలు, ఇతర వెనుకబడిన తరగతులు, షెడ్యూల్డ్ కులాలు, జాతుల మీద ఎలా వుందో పరిశీలించడం.

4) పైన చెప్పిన అంశాలలో కీలకమైన వాటిని గుర్తించటం.

5) అన్ని వర్గాల ప్రజలు - ముఖ్యంగా రాజకీయ పార్టీలను సంప్రదించి వారి అభిప్రాయాలను, ఆ సమస్యలకు తగిన పరిష్కార సూచనలను, ప్రజలందరి సంక్షేమాన్ని పెంపొందించే సలహాలను స్వీకరించటం, పరిష్కారాలను అన్వేషించటం, ఒక కార్యాచరణను, ఒక మార్గ నిర్దేశ ప్రణాళికను రూపొందించడం.

6) పారిశ్రామిక, వాణిజ్య, శ్రామిక, రైతు సంఘాలవారిని, మహిళా సంఘాలను, విద్యార్థి సంఘాలను సంప్రదించి వారి అభిప్రాయాలు, సలహాలు, సూచనలు స్వీకరించడం ద్వారా రాష్ట్రంలో అన్ని రంగాలలో అభివృద్ధి గురించి పరిశీలించటం.

7) ఇతర అంశాలు ఈ కమిటీ అవసరంగా భావించిన పక్షంలో వాటినికూడా పరిశీలించటం.

ఈ కమిటీని డిసెంబర్ 31, 2010 లోపుగా నివేదిక అందిచవలసిందని ఆదేశించటం అయ్యింది. ఫిబ్రవరి 13, 2010న కమిటీ మొదటి సమావేశం జరిగింది. విధివిధానాలు రూపొందించుకొని, ఆనాటి నుంచి నిరంతరంగా ఇదే పనిగా శ్రమించింది కమిటీ !

నిజానికి ప్రత్యేక రాష్ట్రం ఇవ్వాలా వద్దా అనే అంశాన్ని ఈ కమిటీ తేల్చేస్తుందని చాలామంది ఆశపడ్డారు. కానీ, ప్రాంతీయ అసమాతలకు మూలకారణాలను అన్వేషించి అధ్యయనం చేసే బాధ్యత ఈ కమిటీకి అప్పగించబడిందని తెలిసిన విజ్ఞులు కమిటీ చేసిన సూచనలలోని "పస"ని పసిగట్టే పనిలో పడ్డారు. రాష్ట్రంలోని ప్రతి ఒక్కరినీ ఈ నివేదిక ఆలోచింపచేసింది. అయితే, అందులోని లోతైన విషయాల సారాంశం సామాన్యుడికి చేరవేయాల్సిన బాధ్యత విజ్ఞులకు ఉంది.

**స్వంతంగా రూపొందించుకున్న విధానాలు :** ప్రజల నుంచి సలహాల స్వీకరణ కోసం పబ్లిక్ నోటీస్ ఇవ్వడం, అన్ని రాజకీయ పార్టీలలో సంప్రదించడం, విషయ నిపుణులు, పరిశోధనా సంస్థల ద్వారా కమిటీ విశ్లేషణ, అధ్యయనాలు జరపటం, క్షేత్రస్థాయి పరిశీలన చేయటం, జిల్లాలలో తిరిగి అట్టడుగు స్థాయిన వున్న సమస్యల్ని అర్థం చేసుకోవటం, మేథావులు, సీనియర్ రాజకీయవేత్తలు, రిటైరయిన పాలనాధికారులు, న్యాయ నిపుణులు మొదలైన వారితో సంప్రదింపులు కొనసాగించటం, అన్ని ప్రభుత్వ మంత్రిత్వ శాఖల నుంచి కావలసిన సమాచారాన్ని తెప్పించటం, తెచ్చిన సమాచారాన్ని విశ్లేషించి, ఒక క్రమంలో కూర్చేందుకు తగిన యంత్రాంగాన్ని ఏర్పరచుకోవటం, చివరి 2–3 నెలలు కేవలం నివేదిక పైనే దృష్టిని పెట్టటం. ఇలా స్వంతంగా ఒక ప్రణాళికను కమిటీ రూపొందించుకొని కార్యరంగంలోకి దుమికింది.

మొదటిదశలో సమాచార సేకరణ, రెండవదశలో దాని విశ్లేషణచేసి, నివేదిక రూపొందించటం ఇలా రెండు దశలలో పని పూర్తిచేయాలని సంకల్పించింది.

**సమాచార అధ్యయనం :** జల వనరులు, సాగునీటి రంగం గురించి, విద్యుత్ రంగం గురించి, ఉద్యోగ సదుపాయాల రంగం గురించి గ్రేటర్ హైదరాబాద్‌కు సంబంధించిన విషయాల గురించి అవసరమైన సమాచారాన్ని కమిటీ సంబంధిత ఉన్నతాధి కారులతో సంప్రదించి సేకరించుకుంది. విస్తృతమైన చర్చలు జరిపింది. వాటికి సంబం ధించిన అన్ని అంచనాలను లోతుగా అధ్యయనం చేసి ఎప్పటికప్పుడు విశ్లేషణ చేసుకొంది. సంబంధిత రంగాలలోని నిపుణులకు ప్రత్యేకంగా అధ్యాయనం చేసేందుకు జాతీయ స్థాయిలో ఎంపిక చేసుకుని నియమించి వారి సలహాలు, సూచనలు స్వీకరించింది.

**జిల్లాలలో పర్యటనలు**

రాష్ట్రంలో 23 జిల్లాల్లోనూ కమిటీ పర్యటించింది. ప్రాథమిక సమాచారాన్నంతా క్రోడీకరించుకొంది. జిల్లాలలో కమిటీ పర్యటనలకు రాజకీయ పార్టీలు, ఇతర సంఘాల వాళ్ళు, ప్రజలూ సహకరించారు.

మొత్తం 34 సార్లు కమిటీ సమావేశం అయ్యింది. ఇవికాక కమిటీలోని అందరితో కమిటీ (సభ్యుడైన) సెక్రటరీ శ్రీ వినోద్‌కుమార్ దుగ్గల్ నిరంతరం సమావేశం అవుతూ సమాచారం క్రోడీకరించగలిగారు. పదేపదే చర్చలు జరపడం ద్వారా లోతైన అధ్యయనానికి ఎక్కువ అవకాశం కల్గింది. వారికి అందిన సమాచారం, అందుకున్న అంశాలు, అందించిన సలహాలు, సూచనల ఆధారంగా ఈ నివేదికని రూపొందించడం జరిగింది.

కీలెరిగి వాత పెట్టడం, రోగమెరిగి చికిత్స చేయటం అనే పదాలతో ఈ నివేదికని సరిపోల్చవచ్చు. అయితే "అనుపానం పులి పాలు" అనే పద్ధతిలో దొరకని మందులు రాసిన వైద్యుడితో శ్రీకృష్ణ కమిటీని పోల్చడానికి వీల్లేదు. సుసాధ్యమైన చికిత్సనే సూచించడానికి శ్రీకృష్ణ కమిటీ మంచి ప్రయత్నం చేసింది.

చిరకాలంగా తెలంగాణా ప్రజలు అధికశాతం కోరుకొంటున్న ప్రత్యేక రాష్ట్ర వాంఛని గౌరవిస్తూనే, రాజ్యాంగపరమైన సాధికారికమైన చర్యలను సూచించడం ద్వారా జరిగిన అన్యాయాన్ని సరిచేసే ప్రయత్నం ఈ నివేదికలో జరిగింది. సామాజిక ఆర్థిక ప్రగతి, రాజకీయ లాభం, పాలనాధికారం అనే అంశాలను కమిటీ పరిగణనలోకి తీసుకొంటూనే అనేక ప్రత్యామ్నాయాలను వెదికింది. వాటిని "కాదు..." "కాదు..." అంటూ, చివరికి సమైక్య రాష్ట్రమే మేలని తేల్చి, సమైక్య రాష్ట్రంలో తెలంగాణా అభివృద్ధికి సాధికారిక అభివృద్ధి సంస్థని నెలకొల్పే సూచన చేసింది.

"ఇదొక్కటే పరిష్కారం" అంటూ చేసిన ఆరవది, ఆఖరిదీ అయిన ప్రతిపాదననే కమిటీ తీర్పుగా పరిగణించవలసి వుంది. మిగిలిన ఐదింటినీ కమిటీయే తోసి పుచ్చింది. అవి ఆచరణ సాధ్యం కాదని తేల్చి చెప్పింది! ఐదవ సూచన (ప్రత్యేక తెలంగాణారాష్ట్రం ఏర్పాటు)కి రెండవ ప్రాధాన్యత ఇస్తున్నట్లు పేర్కొంది.

ఈ నివేదికలో మొత్తం 9 అధ్యాయాలున్నాయి. స్థూలంగా ఒక్కో అధ్యాయాన్ని పరిశీలన చేద్దాం.



# ఒకటవ అధ్యాయం

## ఆంధ్రప్రదేశ్‌లో పరిణామాలు - చారిత్రక నేపథ్యం
## DEVELOPMENTS IN ANDHRA PRADESH - A HISTORICAL BACKGROUND

నవంబర్ 1, 1956 పూర్వపు హైదరాబాద్ రాజ్యంలోని తెలుగు ప్రాంతాలు, అప్పటికే ఆంధ్ర రాష్ట్రంగా వున్న తెలుగు ప్రాంతాలూ కలిసి ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. ఆనాటి చారిత్రక పరిస్థితులన్నీ కమిటీ ఒక్కటొక్కటే అధ్యయనం చేసింది. ఫజల్ ఆలీ కమిషన్ ఏర్పాటు, తర్వాతి పరిణామాలను కూడా తన నివేదికలో పొందుపరిచింది. ఏ పరిస్థితులలో విశాలాంధ్ర రాష్ట్ర ఏర్పాటు జరిగిందో అర్థం చేసుకునే ప్రయత్నం ఈ నివేదికలో స్పష్టంగా కన్పించింది. పెద్ద మనుషుల ఒప్పందంలోని అంశాలను కూడా నమోదు చేసింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడేటప్పుడు హైదరాబాద్ రాష్ట్రం, ఆంధ్రరాష్ట్రాల మధ్య జరిగిన సర్దుబాట్లు, ఉర్దూ భాషా సంరక్షణ, అధికంగా ఉన్న ఉద్యోగులకు ఉద్వాసన, తెలంగాణా ఆంధ్ర ప్రాంతాల మధ్య ఖర్చుల విభజన, అన్నింటిని కమిటీ పరిగణనలోకి తీసుకొంది.

భౌగోళికంగా ఆంధ్రప్రదేశ్ (1956-1973) ఏర్పడినప్పటికీ, అది రెండు పెద్ద రాజ్యాలు తెలంగాణా, ఆంధ్రరాష్ట్రాల రాజకీయాల మిశ్రమ రాష్ట్రం. తెలంగాణా, కోస్తా, రాయలసీమ ప్రాంతాల మిశ్రమ రాష్ట్రంగా ఏర్పడింది. ఈ మిశ్రమం 50 ఏళ్లయినా మిశ్రమంగానే ఉండిపోయింది. ఈ మిశ్రమంలో అనేకసార్లు అనేక ఉపద్రవాలు చోటుచేసుకున్నాయి. 1969 జై తెలంగాణా, 1972 జై ఆంధ్ర ఉద్యమాలు రాష్ట్రాన్ని కుదిపేశాయి. పెద్ద మనుషుల ఒప్పందానికి అది ఒక పరీక్షా కాలం అయ్యింది. తెలంగాణా

వారికి అధికారంలో పెద్ద పీటని కల్పించే పెద్ద మనుషుల ఒప్పందానికి తూట్లు పొడవడంతో ప్రత్యేక తెలంగాణా వాదం మిశ్రమ ఆంధ్రరాష్ట్రంలో ఆనాటి నుంచి ఒక భాగంగా నడుస్తూ వస్తూనే వుంది. ఇస్తానన్న ఉపముఖ్యమంత్రి పదవిని ఆరో వేలుగా, నిరుపయోగమైనదిగా చిత్రించి ఆ పదవిని తీసుకోనీయకుండా చేశారు. 1960 జనవరి 11న సంజీవరెడ్డి మాత్రం కె.వి. రంగారెడ్డి గారికి ఉపముఖ్యమంత్రి పదవి ఇచ్చాడు. ఇటువైపు బీ.వీ.సుబ్బారెడ్డి మరొక సమయంలో ఉపముఖ్యమంత్రి అయ్యారు. 'జై తెలంగాణా' సమయంలో ఆ పదవి మళ్లీ తెరమీదకొచ్చింది.

1958లో ఏర్పాటు చేసిన రీజియనల్ కమిటీ, వివిధ ప్రాంతాల ఆకాంక్షలను నెరవేర్చేదనీ, బ్రిటిష్ హౌస్ ఆఫ్ కామన్స్‌లో స్కాటిష్ స్టాండింగ్ కమిటీ లాంటిదనీ అభివర్ణించి ఎంతో ఆర్భాటంగా ప్రారంభించినా చివరికి అది గాలిబుడగ అయ్యింది.

1957లో పంజాబ్ రాష్ట్రంలో హిందీ మాట్లాడే హిందువులు, పంజాబి మాట్లాడే సిక్కుల మధ్య సమన్వయం కోసం పండితనెహ్రూ అకాలీదళ్‌తో ఒక ఒప్పందం కుదుర్చుకుని మొదటిసారిగా రీజియనల్ కమిటీ ఏర్పాటు చేశాడు. అటువంటిదే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనూ ఏర్పాటయ్యింది. "ఆంధ్రప్రదేశ్ రీజియనల్ కమిటీ ఆర్డర్ 1958" కేంద్ర హోంశాఖ మార్చి 13, 1958న గెజిట్ నోటిఫికేషన్ ఇచ్చింది. ఇది నిజానికి మూడు ప్రాంతాల ఆకాంక్షల్ని నెరవేర్చే గొప్ప సంస్థగా ఒక వెలుగు వెలిగి ఉండాల్సింది. అలా జరగలేదు. అప్పటినుంచే తెలంగాణా ప్రజలలో అపనమ్మకం ప్రారంభం అయ్యిందని జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ గుర్తించింది.

ముఖ్యమైన ప్రభుత్వోద్యోగాల విషయాన్ని దీని పరిధిలో లేకుండా చేశారు. ధనవ్యయం లేని ప్రణాళికాంశాలకే "అభివృద్ధి"ని పరిమితం చేశారు. ఉన్నత విద్య విషయంలో తెలంగాణా ప్రత్యేకత గురించి ప్రస్తావన లేకుండా చేశారు. ఇవన్ని ఈ రీజియనల్ కమిటీని నిరుపయోగం చేశాయంటుంది శ్రీకృష్ణ కమిటీ! ఇలాంటి కష్టాలే 50 ఏళ్లపాటు ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర ఆకాంక్ష సజీవంగా వుండేలా చేశాయన్నది కమిటీ గుర్తించిన అంశం. తెలంగాణా మిగులు నిధుల్ని తెలంగాణాకే ఖర్చు చేసే విషయంలో ఏర్పడ్డ విభేదాలు 1968 జై తెలంగాణా ఉద్యమం అంటుకోవటానికి భూమికలు ఏర్పరిచాయి! ఏప్రియల్ 11, 1969న పార్లమెంట్‌లో శ్రీమతి ఇందిరాగాంధీ ఒక ప్రకటన చేస్తూ, రాష్ట్ర ప్రభుత్వానికీ, తెలంగాణా రీజినల్ కమిటీకి మధ్య సమన్వయ లోపం వలన ఈ అపార్థాలు తలెత్తినట్లు పేర్కొన్నది. తెలంగాణా మిగుల నిధుల వినియోగం పై అధ్యయ నానికి ఆర్థిక నిపుణులతో ఒక కమిటీని ఏర్పాటు చేస్తున్నట్లు ఆమె ప్రకటించింది. ఏప్రియల్ 22, 1969న జస్టిస్ భార్గవ కమిటీ నియామకం జరిగింది. ఈలోగా ఆనాటి రాష్ట్ర హోంమంత్రి జలగం వెంగళరావు తెలంగాణా రీజినల్ కమిటీ

పరిధిని విస్తరిస్తున్నట్లు అసెంబ్లీలో ఒక ప్రకటన చేశారు. తెలంగాణాలో ఉద్యోగావకాశాల విషయాన్ని కమిటీ పరిధిలోకి తెచ్చారు. ఈ తెలంగాణా రీజినల్ కమిటీ అధికారాలను కూడా విస్తృత పరిచారు. ఇంకా అనేక విధి విధానాలను నిర్ణయించారు. దాన్ని పర్యవేక్షించి, కేంద్ర ప్రభుత్వానికి నివేదిక ఇచ్చే బాధ్యతని రాష్ట్ర గవర్నర్‌కు అప్పగించారు.

అయితే, ఈ రీజియన్ కమిటీ చైర్మన్‌లుగా వ్యవహరించిన వ్యక్తులు రాజకీయ పరిస్థితులు తమకు వ్యతిరేకంగా వున్నప్పుడు తెలంగాణాకు అన్యాయం అంటూ గొంతెత్తి అరవటం, అనుకూల మైనప్పుడు మౌనం దాల్చటం లాంటివి చేయటం ద్వారా రాజకీయ ప్రయోజనాలు పొందే సంస్థగా వీటిని మార్చివేశారని కమిటీ అధ్యయనంలో తేలింది.

అయితే, చివరి అధ్యాయంలో తెలంగాణా సమస్యకు పరిష్కారంగా 'ప్రాంతీయ అభివృద్ధి మండలి'ని ఏర్పాటు చేయాలనే అంశాన్ని జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ సూచించినప్పుడు గతంలో ఈ తెలంగాణా రీజినల్ కమిటీ లాంటి సంస్థల అనుభవాన్ని కూడా పరిగణనలోకి తీసుకొనే ఆ సూచన చేసిందని అర్థం చేసుకోవాలి.

**జై తెలంగాణ ఉద్యమం**

రాజకీయ నాయకులకు చిత్తశుద్ధి లేనప్పుడు ఎంత ఉన్నత వ్యవస్థని అప్పగించినా అది భ్రష్టు పట్టకుండా ఉండదు! ప్రజలే అప్రమత్తంగా ఉండాలి. ఇలాంటి అనేక సంఘటనలు గతంలో జరిగిన వాటిని అధారాలతో సహా కమిటీ ఈ మొదటి అధ్యాయంలో పొందుపరిచింది.

15 ఏళ్లుగా తెలంగాణా ప్రాంతంలో నివసిస్తున్న వారిని తెలంగాణా వారిగా గుర్తించడం, ముల్కీ నిబంధనల్లాంటి అంశాలను కూడా కమిటీ అధ్యయనం చేసింది.

1969లో రాష్ట్ర విద్యుత్ బోర్డులో ఉద్యోగ నియామకాలు పబ్లిక్ ఎంప్లాయిమెంట్ పరిధిలోకి రావని హైకోర్టు తీర్పు వెలువడిన నేపథ్యంలో పూర్తి రక్షణ కావాలని ఒక వర్గం, ప్రత్యేక రాష్ట్రం కావాలని ఒక వర్గం తెలంగాణాలో ఉద్యమాలను లేవదీశాయి. తెలంగాణా భూభాగంలో 6 వేలమంది కోస్తా, రాయలసీమ ప్రాంతాల వారు ఉద్యోగాలు చేస్తున్నారని, వాళ్లందరినీ వెనక్కి పంపి తెలంగాణా వారికే ఉద్యోగాలు ఇవ్వాలంటూ తెలంగాణా ఎన్జీవోలు కూడా ఈ ఉద్యమంలో చేరడంతో జై తెలంగాణా ఉద్యమం రాజుకుంది. రాష్ట్రప్రభుత్వం 1969 జనవరి 18-19 తేదీలలో అఖిలపక్షం సమావేశానికి పిలవగా కోస్తా, సీమ వారిని వెనక్కి పంపి కొత్తగా కోస్తా, సీమలలో ఉద్యోగాలు కల్పించేందుకు మౌలికంగా నిర్ణయం తీసుకున్నారు. అంతలో జనవరి 20న పోలీస్ ఫైరింగ్ జరిగి విధ్వంస రూపాన్ని తీసుకొంది. ఒక సంవత్సరం పాటు సాగిన ఈ విధ్వంస కాండలో తెలంగాణాలో చాలా ఆస్తులు ధ్వంసం అయ్యాయి.

ఆంధ్ర ఉద్యోగుల్ని బదిలీ చేయటం, ముల్కీ నిబంధనలను అమలు చేయటం, విద్యుత్ బోర్డులో ముల్కీ రూల్స్ ప్రకారం ఉద్యోగ నియామకాలు చేయటం లాంటి చర్యలేవీ ఉద్యమాన్ని చల్లార్చలేకపోయాయి. అయితే, కోస్తా, రాయలసీమ ఉద్యోగులపట్ల కక్షతో వ్యవహరించారన్న ఆరోపణలతో కోస్తా, సీమ ప్రాంతాలవైపు కూడా ఆందోళనలు ఉధృతం అయ్యాయి.

తెలంగాణా వైపు కె.వి.రంగారెడ్డి విద్యార్థులతో చేరి ఉద్యమానికి ఆజ్యంపోశాడు. ప్రాంతం అంతా అగ్నిగుండం అయ్యింది. సుప్రీంకోర్టు ఈ దశలో జోక్యం చేసుకొని నాన్ ముల్కీ ఉద్యోగులపై చర్చలమీద ఆంక్షలు విధించింది. 28 ఫిబ్రవరి, 1969న ఈ తీర్పు వెలువడింది. దాని ఫలితంగా ప్రత్యేక రాష్ట్ర ఉద్యమగా "జై తెలంగాణా" ఉవ్వెత్తున ఎగిసింది.

తెలంగాణా ప్రజాసమితి రూపుదిద్దుకొంది. ఇందిరాగాంధీ 8 సూత్రాల ప్రణాళికను ప్రకటించినప్పటికీ  అది తెలంగాణా ఉద్యమాన్ని చల్లార్చలేదు. కానీ, గట్టి వ్యతిరేక చర్యలు తీసుకోవడంతోనూ, తెలంగాణా ప్రజాసమితిలో చీలికలు రావడంతోనూ నెమ్మదిగా జై తెలంగాణా ఉద్యమం ఊపు చల్లారింది. ఈ ఉద్యమం వలన (1) తెలంగాణా ప్రాంతీయ కమిటీ తిరిగిబలపడింది. (2) తెలంగాణా మిగుల నిధులమీద కాకి లెక్కలకు స్వస్తి పలికారు. (3) తెలంగాణాలో అనేక కొత్త విద్యాలయాలు ఏర్పడ్డాయి. (4) తెలంగాణా జిల్లాల్లో పరిశ్రమల స్థాపనకు ప్రత్యేక ప్యాకేజీలు సబ్సిడీలు లభించాయి. ముఖ్యమంత్రిని మార్చి తెలంగాణాకు చెందిన పి.వి.నరసింహారావును అధికారంలోకి తీసుకువచ్చారు. ముఖ్యంగా ఇక్కడ గమనించవలసిన అంశం ఏమంటే, తెలంగాణాలో ఏ చిన్న ప్రయోజనాన్ని సాధించాలన్నా పెద్ద పెట్టున అలజడి ఆందోళన జరపవలసి వచ్చింది, ప్రభుత్వ యంత్రాంగం స్పందిచని స్థితి ఆనాడే కాదు, నేటికీ కొనసాగుతోంది.

## ముల్కి నిబంధనలు - జై ఆంధ్ర ఉద్యమం

1956లో హైదరాబాద్ రాష్ట్రం మూడు భాగాలయి హైదరాబాద్ సహా తెలుగు జిల్లాలు ఆంధ్రరాష్ట్రంతో కలిసి ఆంధ్రప్రదేశ్ ఏర్పడినా పూర్వపు ముల్కి నిబంధనలు అమలులోనే ఉండేవి. స్థానికులైన తెలంగాణా ముస్లింలకు ప్రభుత్వ ఉద్యోగాలు కల్పించడం కోసం 90 ఏళ్ళ క్రితం నిజాం ఏర్పరచిన ప్రత్యేక హక్కు  ఈ ముల్కీ ! ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత కూడా, దీని వలన తమ రాజధాని నగరంలో ఉద్యోగాలు పొందడానికి కోస్తా, సీమ విద్యార్థులకు అవకాశాలు లేని స్థితి ఉండేది. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఈ విషయం మీద ప్రజావ్యాజ్యాన్ని విచారించి, 5 మంది జడ్జిలతో కూడిన పూర్తి బెంచీ ఫిబ్రవరి 14, 1972న 4-1 మెజార్టీతో ఇచ్చిన తీర్పు మేరకు, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత ఇంక ముల్కి నిబంధనలు అర్థంలేనివని, అవి చెల్లవనీ తీర్పు ఇచ్చింది. ఈ

నిబంధనలకు 1919లో నిజాం ప్రభువు ఫర్మానా ద్వారా, ముల్కీలు (స్థానికులు) మాత్రమే ప్రభుత్వోద్యోగాలకు అర్హులని ఆదేశించాడు. ఆ నిబంధన ఆంధ్రప్రదేశ్ ఏర్పడి, నిజాం రాజ్యం పోయిన తర్వాత కూడా కొనసాగరాదనేది హైకోర్టు తీర్పు సారాంశం. మరింతగా ముల్కీని అమలు చేయాలని కోరుతున్న తెలంగాణా వాదులకు ఈ తీర్పు అశనీపాతం అయ్యింది. ప్రభుత్వం తెలంగాణాకు అనుకూలంగా సుప్రీంకోర్టుకు వెళ్లేందుకు నిశ్చయించింది. ప్రభుత్వ ఉద్యోగాలను ప్రాంతీయీకరించడానికి ప్రభుత్వం సంసిద్ధతను వ్యక్తపరిచింది. అక్టోబర్ 3, 1972న సుప్రీంకోర్టు వారు హైకోర్టు తీర్పుని నిలువరించారు. ముల్కీ రూల్స్ చెల్లుతాయన్నారు. ఈ తీర్పుతో కోస్తా, సీమ ప్రాంతంలోని ప్రజలు తాము సొంత రాష్ట్రంలోనే ద్వితీయ శ్రేణి పౌరులుగా జీవించాల్సిన స్థితి ఏర్పడినట్లు బాధపడ్డారు. అది క్రమేణా 'జై ఆంధ్ర' ఉద్యమానికి దారి తీసింది. ఒకరికి అనుకూలంగా మేలు జరిగితే వేరొకవైపు వ్యతిరేక ఉద్యమాలు రావడం ఆంధ్రప్రదేశ్ చరిత్రలో ఒక దురదృష్టకర అంశం.

ప్రభుత్వం సుప్రీంకోర్టు తీర్పు ఆసరాగా ముల్కీని అమలు చేయడానికి నిశ్చయించుకొంది. కేంద్ర ప్రభుత్వం జోక్యం చేసుకొని, హైదరాబాద్‌లో 1977 వరకూ 5 ఏళ్లపాటు, మిగిలిన తెలంగాణాలో 1980 వరకూ 8 ఏళ్లపాటు మాత్రమే ముల్కీ ఉండాలని ఒక మధ్యేమార్గాన్ని ప్రతిపాదించింది. డిసెంబర్ 31, 1972న ఈ మేరకు ఒక బిల్లును ఇందిరాగాంధి పార్లమెంట్‌లో పెట్టి ఆమోదింపచేశారు.

ఇది సహజంగానే కోస్తా, సీమ ప్రాంతాల ప్రజలను ఉద్రేకుల్ని చేసింది. డిసెంబర్ 31, 1972న తిరుపతిలో జరిగిన పెద్ద సమావేశంలో వివిధ స్థాయిల్లోని కాంగ్రెస్ నేతలంతా హాజరయ్యారు. బి.వి.సుబ్బారెడ్డి అధ్యక్షత వహించారు. ఆయన అప్పుడు ఉపముఖ్యమంత్రిగా ఉన్నారు. ప్రభుత్వ యంత్రాంగాన్ని స్తంభింపచేయాలని నిర్ణయం చేశారు. రెండు నెలలు విధ్వంసం కొనసాగింది. జనవరి 1973లో రాష్ట్రపతిపాలన విధించారు.

ఇది ఇలా ఉండగా, ఫిబ్రవరి 13, 1973న రాష్ట్ర హైకోర్టు తెలంగాణాలో పుట్టి, పెరిగి, స్థిరపడిన బైటవారు కూడా ముల్కీలేనని మరొకతీర్పు చెప్పింది. దాంతో ముల్కీ వలన కలిగే అదనపు ప్రయోజనాలను తెలంగాణా వారు కోల్పోయారు. జులై 11, 1973న మొదటి నియామకాలకే ముల్కీ నిబంధనలనీ, తర్వాత జరిగే ప్రమోషన్లు, సీనియారిటీ, రివర్షన్లు, రిట్రెంచ్‌మెంట్లకు ఈ నిబంధనలు వర్తించవనీ తీర్పునిచ్చింది.

ఈ పరిణామాలన్నీ రెండువైపుల కాంగ్రెస్ నాయకులలోనూ విడిపోవడం తప్పనిసరి అనే భావనని పెంచాయి.

ఆ దశలో రాష్ట్రాన్ని సమైక్యంగా వుంచడంకోసం దృఢచిత్తంతో వ్యవహరించిన శ్రీమతి ఇందిరాగాంధీ ఆరు సూత్రాల ఫార్ములాని ప్రతిపాదించింది. 32వ రాజ్యాంగ సవరణ (1973) ద్వారా ఈ షట్సూత్ర పథకానికి చట్టబద్ధత కల్పించారు.

రాష్ట్ర ప్రణాళికా సంఘం ఏర్పాటు, విద్యాలయాలలో స్థానికులకు ప్రాధాన్యం, హైదరాబాద్‌లో సెంట్రల్ యూనివర్సిటీ ఏర్పాటు, ఎడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్ ఏర్పాటు, ముల్కీ నిబంధనల రద్దులాంటి అంశాలు కల్పించారు ఈ పథకంలో!

కోస్తాలో హైకోర్టు బెంచ్ ఏర్పాటు నిర్ణయం కూడా ఈ దశలోనే తీసుకున్నారు. అయితే అది ఈనాటివరకూ అమలు జరగలేదు. మొత్తంమీద ఆరు సూత్రాల పథకం అనే తాయిలంతో రెండువైపులా ఉద్యమాలను చల్లార్చి రాష్ట్రాన్ని సమైక్యంగా నిలబెట్టింది ఇందిరాగాంధి.

జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ తెలంగాణా ఉద్యమ నేపథ్యంలో ఈ చరిత్రనంతా తవ్వి లోతుగా అధ్యయనం చేసింది. తుది తీర్పులో ఈ అంశాలన్నింటినీ పరిగణనలోకి తీసుకుంది.

## ఆంధ్రప్రదేశ్ 1973 - 2000

ఫిబ్రవరి 20, 1975న ఆరు సూత్రాల పథకం అమలు ప్రారంభం అయ్యింది. సెప్టెంబర్ 1973లో ఈ పథకం గురించి నిర్ణయం తీసుకోవటానికి, అది అమలులోకి రావటానికి మధ్య రెండేళ్ల కాలంలో రెండు ముఖ్య పరిణామాలు జరిగాయి. ముల్కీ నిబంధనలను చట్టం ద్వారా రద్దుచేశారు. తొలుత ఏర్పరచిన తెలంగాణా రీజియనల్ కమిటీని కూడా రద్దు చేశారు.

311 మంది పార్లమెంట్‌లో అనుకూలంగా ఓటుచేయగా 8 మందే ఇందుకు వ్యతిరేకంగా ఓటు వేశారంటే, తెలంగాణా రీజినల్ కమిటీ నిర్వీర్యమై నిరర్థకంగా మిగిలిందని అర్థం అవుతుంది. రాజకీయ ప్రయోజనాలు పొందుతున్న తెలంగాణా రాజకీయ వేత్తలు ఈ విషయంలో మౌనం దాల్చారు. ప్రజలు నిస్సహాయంగా చూస్తూండి పోయారు.

జలగం వెంగళరావుని ముఖ్యమంత్రిని చేశారు. రాష్ట్రపతి-పాలనను రద్దు చేశారు. ఆయన కాలంలో రాష్ట్రం మూడు భాగాలలోనూ సాధించిన అభివృద్ధి స్పష్టంగా కన్పించింది. ఆ ఊపు 2009 దాకా కొనసాగిందని జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ నివేదిక పేర్కొంది. (The growth momentum of this Period, by and Large, continued till the recent agitation (2009–10) (పేజీ 38).

ఆ తర్వాత ఎమెర్జెన్సీ, జనతా ప్రభుత్వం, రాష్ట్రంలో ఇందిర కాంగ్రెస్ హవా, చెన్నారెడ్డి ముఖ్యమంత్రి కావడంతో మార్చి 6, 1978 తర్వాత ప్రత్యేక తెలంగాణా అనేది ఒక సమస్యగా కన్పించకుండా పోయింది – అని వ్యాఖ్యానించింది కమిటీ.

అయితే ఇందిరాగాంధీ ఆరు సూత్రాల పథకం తెలంగాణా కోసమో, కోస్తా సీమల కోసమో ఏర్పరచింది కాదు. అది మొత్తం రాష్ట్రానికి వర్తించేది. పనికొచ్చినా, పనికిరాక

పోయినా అప్పటివరకూ ఉన్న తెలంగాణ రీజినల్ కమిటీ రద్దయి పోవడంతో తెలంగాణాలో పెద్దమనుషుల ఒప్పందం స్ఫూర్తి మాత్రం కొనసాగలేదనేది వాస్తవం. (పేజీ 40) అయినా రాష్ట్రంలో ఆరుసూత్రాల పథకం రాజకీయ స్థిరత్వాన్ని, ఆర్థికాభివృద్ధినీ 50 ఏళ్లపాటు నిలబెట్టగలిగిందనేది కూడా వాస్తవం (పేజీ 41) అని వ్యాఖ్యానించింది తన నివేదికలో శ్రీకృష్ణ కమిటీ.

క్రమేణా దేశవ్యాప్తంగా కాంగ్రెస్ బలహీనపడి, రాష్ట్రంలో కూడా తన ప్రాభవాన్ని కోల్పోవడంతో యన్టీ రామారావు తెలుగుదేశం అతి స్వల్పకాలంలోనే రాష్ట్ర పాలనాధికారాన్ని చేపట్టే పరిస్థితులు వచ్చాయి. ఆ తర్వాత ఆ ఒరవడిని 9 ఏళ్లపాటు చంద్రబాబునాయుడు కూడా కొనసాగించగలిగారు. ఈ ఇద్దరిని మరిపించేలా రాజశేఖరరెడ్డి పాలించారు. పటిష్టమైన పాలనా యంత్రాంగం తెలుగు ప్రజల ఐక్యత నినాదాల ముందు తెలంగాణా వాదం మసకబారిపోయింది.

నిజానికి ఈ ముగ్గురూ తెలంగాణాకు చెందిన వారు కాదు. అలాగే, 1982 నుంచి ప్రభుత్వ విధానాలు కూడా తెలంగాణాకు అనుకూలమైనవిగా లేవు. ఈ దశలోనే తెలంగాణా భూముల మీద, కన్నేసిన బైటవారు కారుచౌకగా ఇక్కడి భూముల్ని కొనుగోలుచేసి దురాక్రమణ చేశారని కమిటీ దృష్టికి తెలంగాణావాదులు కొన్ని వాస్తవాలను తీసుకువచ్చారు. ఈ భూములను ఉపయోగించి పరిశ్రమల స్థాపన చేయడంవలన తెలంగాణాలో ఆర్థిక పరిస్థితి బలపడినప్పటికీ, ఉన్నతమైన ఉద్యోగాలు, ఇతర లాభాలను మాత్రం బైటవారే దక్కించుకున్నారు. చిన్నస్థాయి ఉద్యోగాలు చిన్న ప్రయోజనాలు మాత్రం స్థానికులకు దక్కాయని తెలంగాణా వాదులు కమిటీ దృష్టికి తెచ్చినట్లు కమిటీ తన నివేదికలో పేర్కొంది.

1975 తర్వాత హైదరాబాద్ నగరం అమితంగా అభివృద్ధి చెందినప్పటికి, బైటవారి అవసరాలకు తగ్గట్టుగానే ఈ అభివృద్ధి జరిగిందనీ, సామాజిక, ఆర్థిక సమానత్వం జరగలేదనీ తెలంగాణా వాదులు అంటున్నారు. నిధులు, పెట్టుబడులు, ఉద్యోగావకాశాలన్ని హైదరాబాద్‌లో బైటవారికే దక్కాయి, తెలంగాణాకి ఒరిగిందేమీ లేదనేది వారి వాదన. 1956తో పోలిస్తే హైదరాబాద్ జనాభా 3 రెట్లు పెరిగింది. మౌలిక సదుపాయాలు మాత్రం అదే స్థాయిలో పెరగలేదు. రవాణా వ్యవస్థ పెరుగుదల ఉన్నత వర్గాలకే లాభించింది. పరిశ్రమదారులు వలస వచ్చిన వారినే ఉద్యోగులుగా నియమించుకున్నారు. దక్షిణ హైదరాబాద్‌లో స్థానికులు ఎక్కువగా నివసిస్తున్నారు. అక్కడ ఎలాంటి అభివృద్ధి కన్పించకపోవడాన్ని వారు వేలెత్తి చూపిస్తున్నారు. హైదరాబాద్ నగరాభివృద్ధి ఒక క్రమ పద్ధతిలో సమతుల్యంగా జరగలేదు. పట్టణ పాలనాయంత్రంగా కూడా బైటవారి అవసరాలు తీర్చడానికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చింది - అనేవి తెలంగాణావాదులు కమిటీ దృష్టికి తెచ్చిన వాటిలో ముఖ్య అంశాలు.

సమైక్య ఆంధ్రప్రదేశ్‌ను కోరుతున్నవారు హైదరాబాద్ తెలంగాణా నగరంగా మాత్రమే ఉండగలదని భయపడ్డారు. అది జాతీయస్థాయిలో నాల్గవ మహానగరంగా ఎదిగిందనీ, పెద్దస్థాయిలో పెట్టుబడులు ఇక్కడకు తరలివచ్చాయని, కోస్తా, సీమలలోని నిరుద్యోగులకు ఉద్యోగ అవకాశాల కేంద్రంగా అది ఎదిగిందనీ, కాస్మోపోలిటన్ రూపురేఖలను ఈ నగరం సంతరించు కొందనీ వాదించారు. విడిపోతే ఆ అవకాశాలు పోతాయని ఆందోళన పడ్డారు.

ఈ వాద ప్రతివాదాల్లోంచి భవిష్యత్‌లో 'హైదరాబాద్' అనేది ఒక ప్రత్యేకమైన రాష్ట్రంగా వుండాలనే కొత్తవాదన పుట్టుకొచ్చింది.

నిజానికి, హైదరాబాద్‌కు బైటనుంచి ప్రజలు తరలిరావడం అనేది కొత్త అంశం ఏమీ కాదు. 1920లలో నిజాం ప్రభువు ఆహ్వానం మీదే కోస్తా ఆంధ్ర నుంచి రైతులు తరలివచ్చి నిజాం భూములలో వ్యవసాయం చేశారు. 1930 నాటికి ఇలా వచ్చిన రైతుల సంఖ్య 20 లక్షల వరకూ వుంటుందనీ, 10 లక్షల ఎకరాల భూమిని వాళ్లు సాగుచేశారని గణాంక వివరాలు తెలుపుతున్నాయి. వాళ్లంతా నిజాం ఆహ్వానం మీద వచ్చిన వాళ్లే! వాళ్లని 'సెటిలర్స్' అన్నారు. ఇలా వచ్చిన వారిలో కోస్తా రైతులతో పాటు కర్నాటక, మహారాష్ట్ర, బీహారు, బెంగాల్, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్, గుజరాత్ రైతులు కూడా వున్నారు. ఆనాడు 'నిజాం' వేరే రాజ్యం. కోస్తా ప్రాంతం బ్రిటిష్ వారి ఏలుబడిలో వుంది. కోస్తావారు ఆనాడు వేరే దేశానికి వలస వచ్చినట్టే అయ్యింది.

దేశంలోని వివిధ ప్రాంతాల ప్రజలు హైదరాబాద్‌లో నివసించటంతో "కాస్మో పోలిటన్" రూపాన్ని అది ఆనాడే సంతరించుకొంది. తెలంగాణాలో బొగ్గు నిక్షేపాల కారణంగా పరిశ్రమల స్థాపనకు బైట వారు ఇక్కడ ఎక్కువ ఆసక్తి చూపించారు. ఇప్పుడు IT, దాని సంబంధిత సాఫ్ట్‌వేర్ సంస్థలు అత్యధిక సంఖ్యలో తమ కార్యలయాలను ఇక్కడ ఏర్పాటు చేసుకొన్నాయి.

ఇదంతా "6 సూత్రాల పథకం" సాధించిన విజయం. అయితే, ఈ "అభివృద్ధి" చెందిన మూడు దశాబ్దాల కాలంలోనూ అసంతృప్తులను వెళ్ళగ్రక్కుతూ ప్రదర్శనలు, నిరసనలు, నిరశనలూ అడపాదడపా జరగకుండా పోలేదు. కానీ, కళ్లముందు స్వర్ణయుగం లాంటి పరిస్థితి కన్పిస్తున్నప్పుడు ఈ చిన్నచిన్న నిరసనలు తాటాకు చప్పుళ్ళే అయ్యాయి.

1984లో తెలంగాణా ఉద్యోగుల ఉద్యమం తర్వాత, పూర్వపు ప్రభుత్వ కార్యదర్శి కె.జయభారత్‌రెడ్డి నేతృత్వంలో "ఆఫీసర్స్ కమిటీ"ని నియమించారు. ఈ కమిటీ తెలంగాణాలో 1975-1985 ఉద్యోగ నియామకాలలో వివక్షతని గుర్తించింది. అందుకు తగిన నివారణలను సూచించింది. దరిమిలా వి.సుందరేశన్ కమిటీని నియమించి,

ఆరు సూత్రాల పథకాన్ని సమర్థవంతంగా అమలు చేసేందుకు. సూచనలను ప్రభుత్వం కోరింది. ఈ రెండు కమిటీల నివేదికలను ఆధారం చేసుకొని 7-12-1985న ప్రభుత్వం తెలంగాణా యన్.జి.వోలతో కుదుర్చుకున్న ఒప్పందాన్ని అమలులోకి తెచ్చారు.

18-10-1975 తర్వాత తెలంగాణా జోన్ (జోన్ 5, జోన్ 6)లో ప్రభుత్వ ఉద్యోగాలలో చేరిన వారిలో స్థానికులు కానివారిని తిరిగి వారి వారి సొంత జోన్‌లకు పంపించేయాలని, అవసరం అయితే అక్కడ కొత్త పోస్టులు కల్పించి పంపించాలనేది ఈ ఒప్పందంలోని సారాంశం. ఇదే GOMS No.610 లోని ముఖ్య విషయం.

తరువాత 15 సంవత్సరాలలో, ప్రభుత్వ ఉద్యోగాలలో, ఈ జోనల్ విధానానికి వ్యతిరేకంగా జరిగిన నియామకాల విషయమై వివాదం తలెత్తినప్పుడు 15-6-2001న ఆనాటి చంద్రబాబు ప్రభుత్వం అఖిలపక్ష సమావేశం ఏర్పాటు చేసి చర్చించిన దరిమిలా, J.M.గిర్‌గ్లానీతో ఒక కమిటీని నియమించింది. 30-9-2004న ఈ కమిటీ తన నివేదిక సమర్పించింది. 126 అంశాల మీద 35 పరిష్కార సూత్రాలను ఈ కమిటీ సూచించింది. ఈ నివేదికని అధ్యయనం చేయటానికి రాజశేఖరరెడ్డి ప్రభుత్వం ఒక మంత్రుల కమిటీని నియమించగా, 16-2-2006న రాష్ట్ర కేబినేట్ ఈ మంత్రుల కమిటీ నివేదిక మీద చర్చించింది. ఫలితంగా 610 జీవో అమలు విషయంలో తెలంగాణా ఉద్యోగులకు సంతృప్తి కలిగే చర్యలు తీసుకున్నారు. అయితే 1985-2005 మధ్య కాలంలో ఏర్పడిన అసంతృప్తుల సెగల ముందు ఈ ఉపశమన చర్యలు విలువ లేకుండా పోయాయి. ఉద్యమ ఉధృతిని నివారించలేక పోయాయి.

తెలుగుదేశం హయాంలో ఉద్యోగుల రిటైర్‌మెంట్ వయసు తగ్గింపు, కరణాలు - పట్వారీల వ్యవస్థ రద్దు, సారా వ్యతిరేక ఉద్యమం, దళిత ఉద్యమాల ఆవిర్భావం ఇవన్నీ ఆ పదేళ్ల కాలంలో అగ్నికి అంతో ఇంతో ఆజ్యం పోసిన అంశాలుగా కమిటీ గుర్తించింది.

## పెచ్చుమీరిన నక్సలిజం

ఆంధ్రప్రదేశ్‌లో నక్సలిజానికి అనేక కారణాలున్నాయి. తెలంగాణాలో జమీందారీ, భూస్వామ్య వ్యవస్థకు వ్యతిరేకంగా ప్రారంభమైన పోరాటం 1968-69 నక్సల్‌బరీ ఉద్యమ స్ఫూర్తితో తెలంగాణాలో ప్రముఖంగా "నక్సలిజం" పేరుతో బలంగా వ్రేళ్ళూనుకొంది. ప్రభుత్వాలు దానిని కేవలం శాంతిభద్రల సమస్యగానే భావించాయి. తెలంగాణాలో నక్సలైట్‌లు ప్రత్యక్ష రాజకీయాలలో జోక్యం చేసుకోవడం మొదలుపెట్టడంతో వివిధ రాజకీయ పక్షాలు నక్సలైట్ల మద్దతు కోసం వెంపర్లాడిన పరిస్థితి ఈ పదేళ్లలోనూ వుందని కమిటీ అభిప్రాయపడింది.

## బీజేపీ ప్రత్యేక తెలంగాణా వాదం

1997 కాకినాడ జాతీయ సభల్లో భారతీయ జనతాపార్టీ ప్రత్యేక తెలంగాణా రాష్ట్రానికి మద్దతు ప్రకటిస్తూ తీర్మానం చేసింది. 1998 లోక్‌సభ ఎన్నికల్లో "ఒక ఓటు – రెండు రాష్ట్రాలు" నినాదంతో ఎన్నికల్లో పోటీ చేసింది. ఆమేరకు బీజేపీ కోస్తా, సీమలలో నష్టపోయినప్పటికీ తెలంగాణాలో లాభించింది కూడా! ఈ పరిస్థితుల్లో తెలుగుదేశ ప్రభుత్వం ఆర్థిక సంస్కరణలు ప్రారంభించి వామపక్షాలతో దోస్తీని వదిలేసి, బీజేపీతో మిత్రపక్షంగా వ్యవహరించింది. 1999 లోక్‌సభ, శాసనసభలకు జరిగిన ఎన్నికల్లో బీజేపీ 7, టీడీపీ 29 స్థానాలను గెల్చుకున్నాయి. రాష్ట్రంలో టీడీపీ తిరిగి అధికారంలోకి వచ్చింది. బీ.జే.పీ. తాత్కాలికంగా తెలంగాణా వాదాన్ని పక్కనపెట్టింది. కాగా తెలంగాణా కాంగ్రెస్ ఎంఎల్ఎలు తెలంగాణా కాంగ్రెస్ ఫోరమ్ ఏర్పడ్డారు. రాష్ట్ర కాంగ్రెస్ నాయకత్వం ఈ ఫోరానికి అనుమతినిచ్చింది. "జై కాంగ్రెస్ – జై తెలంగాణా" నినాదాన్ని అందుకున్నారు.

ఆ విధంగా ప్రత్యేక తెలంగాణా వాదానికి శ్రీకారం చుట్టిన సంవత్సరంగా 2001ని భావించవచ్చు.

## ఆంధ్రప్రదేశ్ 2001-09

పంచాయితీ ఎన్నికలలో తెలంగాణా రాష్ట్ర సమితి తన సత్తా చాటుకొంది. అప్పటికి ఈ సంస్థ ఏర్పడి కేవలం ఒక సంవత్సరం మాత్రమే! ప్రత్యేక తెలంగాణా వాదాన్ని సజీవంగా ఉంచడంలో తెలంగాణా రాష్ట్ర సమితి తన ప్రత్యేకతని చాటుకుంది. రాష్ట్రాలలోనూ, కేంద్రంలో కూడా తన ప్రభను చాటడంలో తె.రా.స. ప్రత్యేకతని కనబరచింది.

## ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి

1969 తెలంగాణా ఉద్యమాన్ని విద్యార్థులు, యన్జీవోలు, ఇతర సామాజిక వర్గాలు ప్రారంభించారు, అసంతృప్త కాంగ్రెస్ వాదులు అందులో చేరి అగ్గిరాజేశారు. కానీ, 2001 తెలంగాణా ఉద్యమాన్ని తొలుత రాజకీయ శక్తులే ప్రారంభించాయి. కాంగ్రెస్‌కీ, రెండు ప్రాంతీయ పార్టీలు తెలుగుదేశం, తె.రా.సలకూ మధ్య రాజకీయ సమీకరణాలు, స్వంత లాభనష్టాల అంశాలే ప్రధానమైనవిగా ఈ ఉద్యమానికి బీజావాసన చేశాయని, రాజకీయ ప్రయోజనాలే ముఖ్య అంశంగా ఇది ప్రారంభం అయ్యిందని ఈ కమిటీ నివేదిక చదివిన వారికి అర్థం అవుతుంది.

పంచాయితీ ఎన్నికల్లో తెలంగాణాని తెచ్చే విషయంలో తెరాసపైన పైచేయి సాధించడానికి తెలంగాణా కాంగ్రెస్ లేజిస్లేచర్ ఫోరమ్ చాలా శ్రమించింది. 2002 డిసెంబర్‌లో నల్గొండలో కాంగ్రెస్ ఎజెండాలో తెలంగాణా రాష్ట్ర ఏర్పాటు ముఖ్య అంశంగా

వుందని ఈ ఫోరమ్ ప్రకటించింది కూడా ! కాంగ్రెస్ హైకమాండ్ ఆమోదం లేకుండా ఇదంతా జరిగే అవకాశం లేదు కదా ! అధిష్ఠానం ద్వంద్వ వైఖరిని అవలంభించిందని తేలికగా గుర్తించవచ్చు.

ఆ తర్వాత 2004 లోక్‌సభ, శాసనసభ ఎన్నికల్లో తెరాస, కాంగ్రెస్ జంటకట్టాయి. ఆనాటి కాంగ్రెస్ మానిఫెస్టోలో తెలంగాణా ప్రజల మనోభావాలను కాంగ్రెస్ గుర్తించిందనీ, విదర్భ, తెలంగాణా, రాష్ట్రాల ఏర్పాటుకు గల కారణాలను అర్థం చేసుకొందని పేర్కొంది. ఇంకొక "రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం" ఏర్పాటుకు ఆ పార్టీ మొగ్గుచూపుతున్నట్లు ఈ మేనిఫెస్టోలో పేర్కొంది.

కాంగ్రెస్ కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ అధికారంలోకి వచ్చింది. తెరాస కూడా రెండు చోట్లా మంత్రివర్గంలో చేరింది. ఆనాటి యు.పి.ఏ కనీస కార్యక్రమంలో (NCMP) తెలంగాణా రాష్ట్ర ఏర్పాటు విషయాన్ని ఏకాభిప్రాయం మీద పరిశీలించగలమని పేర్కొంది. ఆ మేరకు, ఉభయ సభలను ఉద్దేశించి రాష్ట్రపతి చేసిన ప్రసంగంలో కూడా సరి అయిన సమయంలో అందరితో సంప్రదించి తెలంగాణా రాష్ట్ర ఏర్పాటు గురించి పరిశీలించగలమని ప్రకటించారు. అయితే, ఈ వాగ్దానాలు వేటికీ కాల పరిమితి లేదు. ముఖ్యమంత్రి డా॥రాజశేఖరరెడ్డికి, తెరాస నాయకుడు కేసిఆర్ కి మధ్య ఏర్పడిన మనస్పర్థలు కూడా తోడవడంతో కేంద్రం, రాష్ట్రాలలో తెరాస మంత్రులు తమ పదవులకు రాజీనామాలు చేశారు. 16 మంది ఎం.ఎల్.ఏ.లు తమ పదవులకు రాజీనామాలు చేయగా జరిగిన ఉపఎన్నికలు తెలంగాణాకు రిఫరెండం అని తెరాస వాదించింది.

కాంగ్రెస్, తెలుగుదేశం తాము తెలంగాణాకు వ్యతిరేకులం కాదు కాబట్టి రిఫరెండం అనడానికి వీల్లేదని వాదించాయి. ఈ ఎన్నికలో తెరాస కేవలం 7 సీట్లు మాత్రమే తిరిగి గెలుచుకో గలిగింది. నలుగురు ఎంపీలలో ఇద్దరు మాత్రమే తెరాస పక్షాన గెలిచారు. ఆ పార్టీ రాజీనామాల పర్వంలో తీవ్రంగా నష్టపోయి, తెలంగాణావాదానికి తెలంగాణా ప్రజల మద్దతు లేదనే అభిప్రాయం కలగడానికి కారణం అయ్యింది. కాంగ్రెస్, తెలుగుదేశం, తాము తెలంగాణాకు వ్యతిరేకం కాదు అన్నయేగాని, అనుకూలం అని ప్రకటించటంలో కప్పదాట్లు వేసి, రెండువైపుల ప్రజల్ని మభ్యపెట్టే ప్రయత్నం చేశాయి.

2009 ఎన్నికల సమయంలో తెరాస మహా కూటమిలో చేరి కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా పోరాడింది. కాంగ్రెస్ పార్టీ తెలంగాణా విషయంలో గట్టి నిర్ణయం తీసుకో లేదని ఆరోపిస్తూ ఈ కూటమి ప్రచారం చేసింది. 1997లో తెలంగాణా అనుకూల ప్రకటన చేసినా, 2004 వరకూ అధికారంలో వున్న బీజేపీ ఎలాంటి నిర్ణయమూ తీసుకోలేకపోయినప్పటికీ ఈ ఎన్నికల్లో తన "జై తెలంగాణా" పాటనే పాడింది. కానీ బీజేపీ తెలంగాణా ప్రజల విశ్వాసాన్ని కూడా పెంపొందించుకోలేక పోయింది.

ఈ దశలో ఆనాటి ఆర్థిక మంత్రి రోశయ్యగారితో శాసనసభ్యుల జాయింట్ కమిటీని ఏర్పాటు చేయగా, BJP, CPI(M), CPI, TRS పార్టీలు ఏవీ అందులో చేరడానికి సుముఖత చూపలేదు. తెలుగుదేశం కూడా అందుకు సానుకూలంగా స్పందించలేదు. దాంతో మూడు ప్రాంతాలనుంచి ఆరుగురు కాంగ్రెస్ ఎం.ఎల్.ఎ.లనీ ఒకరు మజ్లీస్ ఎం.ఎల్.ఎ.నీ సభ్యులుగా రోశయ్య కమిటీని నిర్మించారు. అది ఈనాటికీ ఎలాంటి నిర్ణయమూ తీసుకోలేదు.

2010 ఎన్నికల్లో తెరాస కేవలం 10 సీట్లు మాత్రమే గెలిచింది. పూర్వంకన్నా దాని ప్రాభవం తగ్గిపోయింది. రెండు పార్లమెంట్ సీట్లు మాత్రమే గెలిచింది. కేంద్రంలో రెండవసారి అధికారంలోకి వచ్చిన యూపీఏ ఈసారి కామన్ మినిమమ్ ప్రోగ్రాంలో తెలంగాణా ప్రస్తావన ఏదీ చెయ్యకపోవడం గమనార్హం.

గ్రేటర్ హైదరాబాద్ ఎన్నికల్లో తెరాస అసలు పోటీచేయనేలేదు. తెలంగాణా రాష్ట్రం సాధించడం అనే బృహత్కార్యం ముందు గ్రేటర్ ఎన్నికలు చాలా చిన్నవని తెరాస ప్రకటించింది. దానికి బదులుగా, 2009 నవంబర్ చివరి వారంలో తెరాస అధ్యక్షులు కె.చంద్రశేఖరరావు ఆమరణ దీక్షకు కూర్చున్నాడు.

సెప్టెంబర్ 2న రాజశేఖరరెడ్డి ఈ భూమిమీద నుంచి ఆకస్మికంగా అదృశ్యం కావడంతో ఏర్పడిన రాజకీయ శూన్య వాతావరణంలో తెరాస అధ్యక్షుడి ఆమరణ దీక్ష ఒక సంచలనమే అయ్యింది. తెరాస తిరిగి ఉత్తేజితం అయ్యింది. తెలంగాణావాదం అపూర్వ స్థాయిని సంతరించుకొంది. ఉద్యమనాయకత్వం పూర్తిగా తెరాస హస్తగతం అయ్యింది !

**కేసీఆర్ దీక్ష - తదనంతర పరిణామాలు**

29 నవంబర్, 2009 నాటి సంఘటనలు అందరి స్మృతి పథంలోనూ ఇంకా మెదుల్తూనే వుంటాయి. పార్లమెంట్‌లో వెంటనే బిల్లు పెట్టాలని కోరుతూ దీక్ష ప్రారంభించడానికి ముందు కేసీఆర్ విద్యార్థుల్నీ సంఘాల్ని, ఉద్యోగ సంఘాల్ని, ఇతర యన్‌జీవో సంఘాల్ని ఈ ఉద్యమంలో చేరవలసిందిగా పిలుపునిచ్చాడు.

దీక్ష మొదటిరోజే కె.సి.ఆర్‌ని అరెస్ట్ చేసి ఖమ్మం ప్రభుత్వం ఆసుపత్రికి తరలించారు. నవంబర్ 30, 2009న కె.సి.ఆర్. దీక్ష విరమించాడు. కానీ, తెలంగాణా వాదుల వత్తిడి మేరకు దీక్షని తిరిగి కొనసాగించాడు. ఈ దీక్ష జరుగుతున్నంత కాలం తెలంగాణాలో చాలాచోట్ల హింసాత్మక సంఘటనలు చోటు చేసుకున్నాయి.

2009 డిసెంబర్ 6, 7 తేదీలలో పెద్ద ఎత్తున విధ్వంసాలు జరిగాయి. అనేకమంది ఆత్మహత్యలు కూడా చేసుకొన్నారు. అదే సమయంలో ఐక్యకార్యాచరణ సమితి (JAC)

ఉస్మానియా, కాకతీయ విశ్వవిద్యాలయాలలో విద్యార్థులతో ఏర్పడింది. తెలంగాణా రాష్ట్రం ఏర్పడుతుందనే హామీని కోరుతూ ఉద్యమాన్ని మరింత ఉధృతం చేసేందుకు నిర్ణయించారు. తెలంగాణాలో అన్ని విద్యాసంస్థలు మూతపడ్డాయి. రవాణా వ్యవస్థ స్తంభించింది. 5000 మందిని ముందు జాగ్రత్త చర్యగా అరెస్టు చేశారు.

ముఖ్యమంత్రి రోశయ్య శాసనసభలో రాజకీయ పక్షాల నాయకులతో డిసెంబర్ 7, 2009న సమావేశం ఏర్పాటు చేశారు. ఆ సమావేశంలో CPI(M) తప్ప అన్ని పక్షాలూ తెలంగాణా రాష్ట్రం ఏర్పాటు చేయాల్సిందేనన్నాయి. మార్క్సిస్ట్ పార్టీ మాత్రం తన పూర్వపు నిర్ణయాన్నే పునరుద్ఘాటించి, సమైక్యవాదానికి కట్టుబడింది. మజ్లిస్ వారు తెలంగాణా విషయం చర్చించడానికి అసెంబ్లీయే సరైన వేదిక అన్నారు.

9 డిసెంబర్, 2009న చిదంబరంగారు ఈ అఖిల పక్ష సమావేశం నిర్ణయాన్ని ఆధారం చేసుకొని తెలంగాణా రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ ప్రారంభిస్తున్నట్టు, రాష్ట్ర అసెంబ్లీలో అందుకు సంబంధించిన తీర్మానాన్ని త్వరలోనే ప్రవేశపెట్టనున్నట్లు ప్రకటించారు. తెరాస అధ్యక్షులు చంద్రశేఖరరావు తన ఆమరణ దీక్ష విరమించారు.

చిదంబరంగారి ప్రకటన కోస్తా, సీమ జిల్లాల్లో తీవ్రమైన కలకలం రేపింది. విద్యార్థులు వీధుల్లోకి వచ్చారు. అనేక జిల్లాల్లో అల్లర్లు చెలరేగాయి. రాజకీయపక్షాలు బందు పిలుపులు ఇచ్చాయి. డిసెంబర్ 11, 2009న రెండు ప్రాంతాలూ పూర్తి బందును పాటించాయి. డిసెంబర్ 2, 3 వారాలు పూర్తిగా అల్లర్లతోనే గడిచాయి. 9 మంది ఎంపీలు, 143 మంది శాసనసభ్యులు, ఒక శాసనమండలి సభ్యుడు రాజీనామాలు చేశారు.

2009 డిసెంబర్ 23న కేంద్ర హోంమంత్రి చిదంబరం మరొక ప్రకటన చేస్తూ పెద్ద ఎత్తున చర్చలు జరిపి, అన్ని పక్షాల వారిని సంప్రదించి, అందరి భాగస్వామ్యంతోనే ఈ ప్రక్రియ జరగవలసిన అవసరం ఉందన్నారు. దాని ఫలితంగా కోస్తా, సీమ ప్రాంతాల్లో అలజడులు ఆగాయి. కానీ, ప్రభుత్వ నిర్ణయంలో మార్పు వచ్చినందుకు నిరసనగా తిరిగి తెలంగాణాలో అలజడులు ఏర్పడ్డాయి. అన్ని పార్టీలకు చెందిన 63 మంది తెలంగాణా శాసనసభ్యులు తమ రాజీనామాలను డిసెంబర్ 30, 2009న సమర్పించారు. ఆరోజు బందు పిలుపునిచ్చారు.

ఈ మొత్తం అలజడులలో 8000 మంది మీద 1600 కేసులు నమోదు చేయబడ్డాయి. చిన్ననేతల నుంచి పెద్ద నేతల దాకా అనేక సెక్షన్లలో ఈ కేసులు పెట్టారు. రాష్ట్ర ప్రభుత్వం ఇటీవల (ఈ నివేదిక ఇవ్వడానికి ముందు) 565 కేసుల్ని యువకుల భవిష్యత్తు రీత్యా ఉపసంహరించుకొంది. తెలంగాణాలో 440, కోస్తాలో 58, సీమలో 67 కేసులు ఉపసంహరించబడ్డాయి.

జనవరి 5, 2010న హోంమంత్రి చిదంబరం 8 పార్టీల ప్రతినిధులతో తన అధ్యక్షతన ఒక సమావేశాన్ని నిర్వహించారు. తెరాస, బీజేపీ, సిపిఐ లు మాత్రం ఏ సంప్రదింపులూ అవసరం లేకుండానే తెలంగాణా ప్రకటించాలని కోరగా, ప్రజారాజ్యం, మజ్లిస్ పార్టీలు విస్తృతంగా సంప్రదింపులు జరగాలని అన్నాయి. తెలుగుదేశం, కాంగ్రెస్‌ల పక్షాన వచ్చిన ఇద్దరు ప్రతినిధులు చెరొక మార్గాన్ని అనుసరించారు. మొదట రాష్ట్రంలో ప్రశాంతత ఏర్పడాలని ఈ సమావేశం పిలుపునిచ్చింది.

2010 ఫిబ్రవరి 3వ తేదీన జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ నియామకం గురించి అధికారిక ప్రకటన వెలువడింది. ఫిబ్రవరి 13న కమిటీ తొలి సమావేశం నిర్వహించింది. వెంటనే క్షేత్రస్థాయి పరిశీలన కోసం రంగంలో దిగిన కమిటీ సభ్యులు, కాలయాపన లేకుండా వివిధ వర్గాల ప్రతినిధుల్ని కలవటం ప్రారంభించారు.

కమిటీ ఏర్పడిన తరువాత, తెలంగాణాలో తెరాస రాజీనామా చేసిన 12 అసెంబ్లీ స్థానాలకు ఉప ఎన్నికలు జరిగాయి. గ్రూప్ 1 పోస్టులకు 42% రిజర్వేషన్లు వర్తింప చేయాలనే ఉద్యమం జరిగింది. తెలంగాణా న్యాయవాదులు లా ఆఫీసర్ల పోస్టులలో రిజర్వేషన్ల కోసం ఉద్యమించారు.

ఉప ఎన్నికల ఫలితాలు తెరాసకు అనుకూలంగా రావడంలో వేర్పాటు వాదానికి మరింత ఊతం వచ్చింది! గ్రూప్ 1 పరీక్షల్ని వాయిదా వేయాలని కోరిన తెలంగాణా వాదుల కోరికకు భిన్నంగా ప్రభుత్వం పరీక్షలు నిర్వహించింది. సెప్టెంబర్ 14న తిరిగి అక్టోబర్ 25న ఈ పరీక్షలు జరిగాయి. మొదటిసారి రాయలేకపోయిన వారికోసం రెండవసారి నిర్వహించారు. లా ఆఫీసర్ల నియామకం కోసం ముగ్గురు మంత్రులతో ఒక కమిటీని రాష్ట్ర ప్రభుత్వం నియమించింది. మూడు ప్రాంతాల సమతుల్యత ఈ విషయంలో ఉండేలా చూడటం ఈ కమిటీ బాధ్యత.

తొలిదశలో కమిటీకి కొన్ని అవాంతరాలు, ఈసడింపులు, అసహాయతలు ఎదురైనప్పటికీ, బీజేపీ తప్ప తక్కిన రాజకీయ పక్షాలు తొలిదశలో స్పందించలేకపోయినప్పటికీ, క్రమేణా అందరూ ముందుకొచ్చారని కమిటీ నివేదికలో పేర్కొంది.

జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ తుదితీర్పు రూపొందించుకోవడంలో ఈ చారిత్రక నేపథ్యాన్ని బాగా అధ్యయనం చేయటాన్ని చాలా స్పష్టంగా మనం గమనించవచ్చు. ఈ అంశాల్ని విశ్లేషించినప్పుడు "తిలా పాపం తలాపిడికెడు" అనే సామెత నిజమేననిపిస్తుంది. రాష్ట్రం అగ్నిగుండం కావడంలోనూ, విద్యార్థులు సమిధలు కావడంలోనూ ఇరువైపులా రాజకీయ పక్షాలు చేయగలిగినంతా చేశాయని మనం గమనించవచ్చు.

తెలంగాణా పరిరక్షణ కోసం నియమించే యంత్రాంగాన్ని అనేకమంది ముఖ్య మంత్రులు నీరు కార్చిన మాట వాస్తవం. అదే సమయంలో తెలంగాణాకు చెందిన ఆ పరిరక్షణ యంత్రాంగ బాధ్యులు స్వార్థ రాజకీయ ప్రయోజనాలకు దానిని ఉపయోగించు కొన్న వాస్తవాన్ని కూడా ఈ కమిటీ నివేదికలో బహిర్గతం అయ్యింది. అందరూ బాధ్యులే! ఇప్పుడు ఒకరినొకరు దుమ్మెత్తి పోసుకొంటూ తెరముందు కొత్త ఆట ఆడుతున్నారు. ఈ కొత్త తెలంగాణా ఉద్యమం కేవలం రాజకీయ పక్షాల ప్రేరితమేననీ, దాని తర్వాత వచ్చిన సమైక్య ఉద్యమాలు కూడా రాజకీయ శక్తుల ప్రమేయంతోనే ఏర్పడ్డాయనీ కమిటీ భావించింది. 1969, 72 ప్రత్యేక రాష్ట్రాల ఉద్యమాలకు వీటికి గల తేడాని కమిటీ నివేదిక బహిర్గతం చేసింది. ఆనాటి ప్రజల ఉద్యమానికి అసంతృప్త కాంగ్రెస్ జీవులు చేరాయి. ఈనాటి అసంతృప్త రాజకీయ జీవుల ఉద్యమంలో ప్రజలు సమిధిలౌతున్నారు అనేది ఈ నివేదికలో అంతర్లీనంగా కన్పిస్తున్న ఒక అంశం !



# రెండవ అధ్యాయం

## ఆర్థిక ప్రగతి - అసమానతలు
## REGIONAL ECONOMIC AND EQUITY ANALYSIS

2,75,000 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం కలిగి 9 కోట్ల మంది ప్రజలతో ఆర్థికంగా దేశంలో నాల్గవ పెద్ద రాష్ట్రంగా ఉన్న ఆంధ్రప్రదేశ్ రూ. 3,26,547 కోట్ల GDP తో రూ. 35,600 తలసరి ఆదాయం కలిగి ఉన్నట్లు 2007-08 గణాంక వివరాలు చెప్తున్నాయి. 2003-04 నుంచి పోల్చినప్పుడు 10% అభివృద్ధి రేటుని నమోదు చేసుకుంది. GDP లో 26% ఆదాయం వ్యవసాయాధారితం కాగా, భారతదేశపు సగటు కన్నా ఎక్కువగా వ్యవసాయ ఉత్పత్తిని కల్గి వుంది.

60.5% అక్షరాస్యత, వెయ్యిలో 43 మంది శిశు మరణాలు ఈ రాష్ట్రాలలో ఉన్నట్లు వివరాలు చెప్తున్నాయి.

27% ప్రజలు పట్టణాలలోనూ, హైదరాబాద్ నగంలోనూ నివసిస్తున్నారు. హైదరాబాద్ 6వ అతిపెద్ద నగరంగా నిలిచింది. SC లు 16.27%, ST లు 6.6%, మైనారిటీలు 9% వున్నారు.

1993-94లో కోస్తా ఆంధ్ర తలసరి వార్షిక ఆదాయం 12,809 హైదరాబాద్ మినహా తెలంగాణాలో 11,391 వున్నాయి. అయితే 2007-08 తర్వాత హైదరాబాద్‌లో తలసరి ఆదాయం అమితంగా పెరిగి రూ.39,145కు చేరింది. మిగిలిన ప్రాంతాలు కూడా పెరుగుదలని నమోదు చేసాయి. కోస్తా రూ. 36,496 తెలంగాణా (హైదరాబాద్ మినహా) రూ. 33,771, రాయలసీమ 33,056గా వున్నట్లు గణాంకాలు చెప్తున్నాయి. మొత్తం ఆంధ్రప్రదేశ్ సగటు తలసరి ఆదాయం 35,600గా వుంది.

A Profile of Andhra Pradesh

| Region/District | Area ('000 Sq. km.) | Population (in Millions) 2001 | Population Density (Person/Sq .Km.) | Urbanization (in%) | Sex Ratio | IMR (Per 1000) | Literacy Rate | % of SCs & STs | Work Participation Rate | % Share of Agri. in Total Workers | Per Hectare Agri. Output (Rs. '000) | 2007-08 Per capita DDP ( in Rs. at Current Prices) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| Andhra Pradesh | 275 | 76.2 | 277 | 27.3 | 978 | 43 | 60.5 | 22.8 | 45.8 | 62.2 | 24.6 | 35600 |
| Tel inc Hyd | 114.8 | 30.9 | 270 | 31.8 | 971 | 40 | 58.0 | 24.7 | 45.4 | 58.3 | 20.2 | 36082 |
| Tel exc Hyd | 114.6 | 27.1 | 237 | 22.2 | 977 | 42 | 55.0 | 27.0 | 47.7 | 63.2 | 20.2 | 33771 |
| Adilabad | 16.1 | 2.5 | 155 | 26.5 | 989 | 44 | 52.7 | 35.3 | 45.1 | 61.0 | 12.7 | 29187 |
| Nizamabad | 8.0 | 2.3 | 293 | 18.1 | 1017 | 40 | 52.0 | 21.9 | 49.4 | 57.0 | 29.0 | 26241 |
| Karimnagar | 11.8 | 3.5 | 296 | 19.4 | 998 | 29 | 54.9 | 21.2 | 49.0 | 58.7 | 26.8 | 33844 |
| Medak | 9.7 | 2.7 | 275 | 14.4 | 974 | 40 | 51.6 | 22.6 | 48.4 | 67.7 | 19.5 | 42052 |
| Mahbubnagar | 18.4 | 3.5 | 191 | 10.6 | 972 | 58 | 44.4 | 25.0 | 51.9 | 73.2 | 11.0 | 27959 |
| Khammam | 16.0 | 2.6 | 161 | 19.8 | 975 | 40 | 56.9 | 43.0 | 48.3 | 72.1 | 27.2 | 37194 |
| Warangal | 12.9 | 3.2 | 252 | 19.2 | 973 | 41 | 57.1 | 31.1 | 48.3 | 68.1 | 25.3 | 26306 |
| Nalgonda | 14.2 | 3.2 | 229 | 13.3 | 966 | 48 | 57.2 | 28.3 | 49.1 | 67.6 | 15.9 | 34138 |
| Rangareddi | 7.5 | 3.6 | 477 | 54.2 | 944 | 38 | 66.2 | 18.6 | 40.2 | 40.5 | 14.6 | 43400 |
| Hyderabad | 0.2 | 3.8 | 19149 | 100 | 933 | 22 | 78.8 | 8.9 | 29.2 | 1.7 | | 51856 |
| **Rayalaseema** | **67.4** | **13.4** | **201** | **23.2** | **969** | **45** | **59.7** | **19.5** | 47.7 | **66.5** | **15.3** | **33056** |
| Kadapa | 15.4 | 2.6 | 169 | 22.6 | 974 | 39 | 62.8 | 18.1 | **44.8** | 63.3 | 12.9 | 46305 |
| Kurnool | 17.7 | 3.5 | 199 | 23.2 | 965 | 47 | 53.2 | 19.8 | 49.4 | 68.2 | 15.8 | 29362 |
| Anantapur | 19.1 | 3.6 | 191 | 25.3 | 958 | 54 | 56.1 | 17.6 | 48.8 | 67.5 | 9.1 | 32255 |
| Chittoor | 15.2 | 3.7 | 246 | 21.7 | 982 | 40 | 66.8 | 22.2 | 46.8 | 66.1 | 23.5 | 28147 |
| **Coastal Andhra** | **92.8** | **31.7** | **342** | **24.7** | **988** | **42** | **63.2** | **22.3** | 45.4 | **64.0** | **33.0** | **36496** |
| Visakhapatnam | 11.2 | 3.8 | 342 | 39.9 | 985 | 50 | 60.0 | 22.1 | **41.8** | 53.4 | 23.6 | 51146 |
| East Godavari | 10.8 | 4.9 | 454 | 23.5 | 993 | 37 | 65.5 | 21.9 | 39.6 | 62.1 | 50.9 | 36335 |
| West Godavari | 7.7 | 3.8 | 494 | 19.7 | 991 | 38 | 73.5 | 21.7 | 44.1 | 69.2 | 55.0 | 36898 |
| Krishna | 8.7 | 4.2 | 481 | 32.1 | 978 | 28 | 68.8 | 20.4 | 44.0 | 59.0 | 34.4 | 41139 |
| Guntur | 11.4 | 4.5 | 392 | 28.8 | 984 | 29 | 62.5 | 23.0 | 49.1 | 66.8 | 40.7 | 32277 |
| Prakasam | 17.6 | 3.1 | 174 | 15.3 | 971 | 40 | 57.4 | 25.2 | 50.3 | 68.4 | 21.3 | 35472 |
| Nellore | 13.1 | 2.7 | 204 | 22.4 | 984 | 39 | 65.1 | 31.1 | 45.4 | 62.3 | 28.1 | 34442 |
| Srikakulam | 5.8 | 2.5 | 438 | 11.0 | 1014 | 53 | 55.3 | 15.0 | 47.4 | 68.5 | 22.3 | 24298 |
| Vizianagaram | 6.5 | 2.2 | 346 | 18.3 | 1009 | 68 | 51.1 | 20.1 | 52.2 | 68.4 | 20.7 | 25498 |

Source : Census of India, 2001, CSO, Ministry of Statistics and Programme Implementation, GOI 2007-8.

రాయలసీమ వ్యవసాయం ద్వారా 25%, కోస్తా 24%, తెలంగాణా 22% వృద్ధిని సాధించినట్లు కమిటీ నివేదిక వెల్లడించింది. పట్టణీకరణ ప్రక్రియ తెలంగాణాలో 22%, కోస్తాలో 25%, రాయలసీమలో 23% మాత్రమే వున్నాయని కమిటీ పేర్కొంది.

మిగతా గణాంక వివరాలను అలా వుంచి ఆదాయ పంపిణీ మూడు ప్రాంతాల మధ్య ఎలా జరిగిందో కమిటీ నివేదికలో పరిశీలిద్దాం.

### మూడు ప్రాంతాల మధ్య ఆదాయ పంపిణి (Share of Income by Regions)

1993-94లో GDDP (GROSS DISTRICT LEVEL DOMESTIC PRODUCT) లోంచి తెలంగాణా వాటా 33% వుండగా 2007-08 నాటికి అది 35% వరకూ పెరిగింది. హైదరాబాద్‌కు 5-8% వాటా పెరిగింది. కానీ, కోస్తా ప్రాంతానికి ఈ వాటా 44% నుంచి 41%కి తగ్గింది. రాయలసీమ విషయంలో 18% నుంచి 16% తగ్గింది. మిగతా ప్రాంతాలలో ఆదాయం అభివృద్ధిని సూచిస్తుండగా కోస్తాలో అభివృద్ధి పెరుగుదల లేకుండా నిలిచే వుందని కమిటీ నివేదిక ద్వారా అర్థం అవుతోంది !




Source: GOI, Ministry of Statistics and Program Implementation.
Note: Telangana excludes Hyderabad

రాష్ట్రంలో జరిగిన మొత్తం ఉత్పత్తిలో అభివృద్ధిని ఈ క్రింది పట్టిక సూచిస్తోంది.




Source: GOI, Ministry of Statistics and Program Implementation. Note: Telangana excludes Hyderabad

హైదరాబాద్ మినహా మిగిలిన తెలంగాణాలో పారిశ్రామికాభివృద్ధి 30% పెరిగింది. ఉద్యోగావకాశాలు పెరిగాయి. హైదరాబాద్ ఆదాయంలో 82% పారిశ్రామిక రంగంనుంచే వస్తుందని కమిటీ నివేదించింది.

కోస్తా ఆంధ్రలో 1993-96తో పోల్చినప్పుడు 2005-06లో 43% నుంచి 47%కి, రాయలసీమలో 42% నుంచి 46%కి, హైదరాబాదు 65% నుంచి 82%కి, తెలంగాణాలో 43% నుంచి 46%కి ఈ పెరుగుదల కన్పిస్తోంది.

మార్చి 2009 లెక్కల ప్రకారం 2.29 లక్షల కోట్ల వ్యాపారం షెడ్యూల్డ్ బ్యాంక్‌లలో జరిగిందని ఈ నివేదిక చెప్తోంది. హైదరాబాద్ అత్యధికంగా ప్రతి వెయ్యి మందికి 211 మంది బ్యాంక్ ఖాతాదార్లతో వుండగా, 159 రాయలసీమ, 154 కోస్తా ప్రాంతం, 113 తెలంగాణా (హైదరాబాద్ మినహా) వున్నాయి. ఆర్థిక కార్యక్రమాల పరిమాణాన్ని చూసినప్పుడు రాయలసీమలో 7,000గానూ, తెలంగాణా 94,000గానూ, కోస్తాలో 1,19,000గానూ ఉంది. హైదరాబాద్‌తో కలిసిన, తెలంగాణా 3,34,000గా వుంటుంది. ప్రతి ఎకౌంట్‌కు 12 లక్షలు సగటున వుంటుందని ఈ లెక్కలు చెప్తున్నాయి.

వ్యవసాయ రుణాల విషయంలో 1998 నుంచి 2007 వరకూ లెక్కలు పరిశీలించినప్పుడు మూడు ప్రాంతాల్లోనూ ఉన్నతి కన్పిస్తుంది.

అభివృద్ధి కోసం రుణాలు, వ్యవసాయం, ఉత్పత్తులు, ఇంటి నిర్మాణం, వ్యక్తిగత అప్పులు, వ్యాపారపరమైన అప్పులు ఇవన్నీ చూస్తే మార్చి 2009 వరకూ హైదరాబాద్ అత్యధికంగాను, తర్వాత కోస్తా, తెలంగాణా, రాయలసీమలు వున్నాయి. రాయలసీమలో చాలా తక్కువగా కన్పిస్తుంది.

అమ్మకం పన్ను వసూలు విషయంలో హైదరాబాద్ మినహా తెలంగాణాలో 8%, రాయలసీమలో 3%, కోస్తా ఆంధ్రలో 15% వున్నాయి.

విదేశీ పెట్టుబడులు హైదరాబాద్ మినహా తెలంగాణాలో 1658, రాయలసీమలో 732, కోస్తాలో 5499 కోట్లలో వుండగా, హైదరాబాద్‌లో 6490 కోట్ల పెట్టుబడి పెట్టారు.

స్థానిక సంస్థల నుంచి ఆదాయంలో తెలంగాణా 58.9% రాయలసీమ 56.1%, కోస్తాఆంధ్ర కూడా 56% వున్నాయి.

చెప్పుకోదగిన గణాంకాలలో వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి నిధులు (BRUF) విషయానికొస్తే తెలంగాణాలో తీవ్రవాదం ఎక్కువగా వున్న ప్రాంతాలుగా గుర్తించిన చోట 46% BRUF వినియోగం జరిగింది.

వెనుకబడిన ప్రాంతాలుగా ప్లానింగ్ కమిషన్ గుర్తించిన ప్రాంతాలు రాయలసీమలో ఎక్కువగానూ, తెలంగాణాలో తక్కువగాను కోస్తాలో కొద్దిప్రాంతాలే వున్నట్లు వెల్లడైంది.

ఈ గణాంకాల ఆధారంగానే వెనుకబాటుతనం తెలంగాణాలోకన్నా రాయలసీమ ఎక్కువగా వుందనీ, కోస్తాలో కూడా కొన్ని ప్రాంతాలున్నాయనీ కమిటీ నివేదికలో తేల్చి చెప్పిం

కమిటీ ఇంకా అనేక ప్రభుత్వ పథకాలు అమలు తీరుపైన కూడా గణాం వివరాలందించింది. రోడ్లు, వాహనాల వివరాలు కూడా అందించింది.

ఒక కిలోమీటర్ దూరానికి రోడ్డు మీద నడిచే వాహనాల లెక్కలు చూసి నప్పుడ తెలంగాణాలో (హైదరాబాదు కలిసి) 528 వాహనాలు కాగా, కోస్తాలో 487, రాయ సీమలో 267 వాహనాలు ఉన్నట్లు అర్థం.

నేషనల్ హైవే రోడ్లు తెలంగా ణాలో (హైదరాబాద్ మినహా) 1542 కి.మీ. రాయల సీమలో 1243 కి.మీ., కోస్తాలో 1824 కి.మీ. వున్నాయి.

ప్రభుత్వ రహదారులు తెలంగా ణాలో (హైదరాబాద్ మినహా) 23135 కి.మీ. రాయలసీమ 15931 కి.మీ., కోస్తాలో 25162 కి.మీ. పొడవున వున్నాయి. పంచాయితీ రహదారులు తెలం గాణా (హైదరాబాద్ మినహా) 58612 కి.మీ., రాయలసీమ 25025 కి.మీ., కోస్తా 45685 కి.మీ. పొడవున వున్నాయి.













## వ్యవసాయాభివృద్ధి

ఆంధ్రప్రదేశ్‌లో రైతులు, రైతు కూలీలు, ఇంకా అనేక మంది సంబంధిత వృత్తుల వారు కేవలం వ్యవసాయరంగం మీదే ఆధారపడి జీవిస్తున్నారు.

గోదావరి, కృష్ణానదులు కోస్తా ప్రాంతాన్ని సస్యశ్యామలం చేశాయన్నది జగమెరిగిన సత్యం. పంట పండే విస్తీర్ణం (GCA) కోస్తాలో 5.3 హెక్టార్లుండగా 1950-60తో పోల్చినప్పుడు ఇది 20% పెరిగింది. ఆధునిక నాగరికత, రియల్ ఎస్టేట్ వ్యాపారాలు,

**Gross cropped area across regions of A.P**

(5 year moving averages / Million Hectares)

| Region | 1956-60 | 1961-65 | 1966-70 | 1971-75 | 1976-80 | 1981-85 | 1986-90 | 1991-95 | 1996-2000 | 2001-05 | 2006-09 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| Telangana | 4.8 | 4.8 | 5.0 | 5.3 | 5.0 | 5.1 | 4.8 | 4.7 | 4.8 | 4.7 | 5.0 |
| Rayalaseema | 3.2 | 3.2 | 3.0 | 3.1 | 2.9 | 2.8 | 2.7 | 3.0 | 3.0 | 2.9 | 3.0 |
| Coastal Andhra | 4.2 | 4.6 | 4.6 | 4.6 | 4.7 | 4.8 | 5.0 | 5.3 | 5.3 | 5.0 | 5.3 |

Source : Directorate of Economics & Statistics, Go AP. Definition : Gross Cropped Area - the total area sown once and / or more than once in a particular year, i.e., the area is counted as many times as there are sowings in a year

పరిశ్రమలు ఇవన్నీ పంట భూముల్ని ఎంత ఆక్రమించినా వ్యవసాయ యోగ్యత కలిగిన భూముల విస్తీర్ణం 20% పెరిగిందంటే గొప్ప విషయమే! తెలంగాణాలో 4.8 మిలియన్ల హెక్టార్ల నుంచి 5 మిలియన్ల హెక్టార్లకు స్వల్పాభివృద్ధి కన్పిస్తుంది. అయితే రాయలసీమలో పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉంది. 6% తగ్గి, 3 మిలియన్ల హెక్టార్లలో మాత్రమే వ్యవసాయం జరుగుతోంది. తెలంగాణాలో పంటభూములు కొత్తవి వినియోగంలోకి పెద్దగా రాలేదని, రాయలసీమలో తగ్గాయని, కోస్తాలోనే వ్యవసాయ భూములను బాగా వినియోగంలోకి తెచ్చారని అర్థం అవుతోంది.

కోస్తాలో కాలువలు, చెరువుల మీద ఆధారపడిన వ్యవసాయం 10శాతం తగ్గింది. అయితే బావుల వినియోగం 25 శాతం పెరిగినట్లు లెక్కలు చెప్తున్నాయి. భూ ఉపరితల జలాలు, భూగర్భజలాలు కూడా కోస్తాలో వ్యవసాయాభివృద్ధికి వినియోగపడినట్లు అర్థం అవుతోంది.

పంట భూములకు నీటిని అందించే విషయంలో తెలంగాణాలో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత 0.8 మిలియన్ల హెక్టార్ల సాగుభూమి రెట్టింపు అంటే, 1.7 మిలియన్ల హెక్టార్లు అయ్యింది. ఇది 113% అభివృద్ధి. అయితే, కోస్తాలో30% రాయలసీమలో 55% అభివృద్ధి మాత్రమే జరిగినట్లు కమిటీ నివేదికలోని గణాంకాలు చెప్తున్నాయి.

కోస్తాలో గోదావరి, కృష్ణా నదుల మధ్య ప్రదేశంలో కాలవల ద్వారా వ్యవసాయానికి వీలైన డెల్టా, కాలువలు ప్రవహించటానికి అనువైన ప్రాంతం కావటం ఒక సానుకూల అంశం. తెలంగాణా రాయలసీమల కన్నా కోస్తాకున్న అదనపు అవకాశం ఇది. పెద్ద చెరువుల ద్వారా సాగునీటిని పొందే ఆచారం తెలంగాణాలో ఎక్కువగానూ, కొద్దిగా తక్కువగా రాయలసీమలోనూ వుంది. సాగునీటి వినియోగం విషయంలో రాయలసీమ తెలంగాణా కన్నా వెనకబడే వుంది.

రాష్ట్రం ఏర్పడే నాటికి కోస్తాలో 2/3 వంతు భూమి కాలవల ద్వారా వ్యవసాయానికి నీటిని పొందుతుండగా, తెలంగాణాలో 16%, రాయలసీమలో 19% పొందుతున్నారు.

ఉపరితల జలాలతో వ్యవసాయం తెలంగాణాలో 64% నుంచి 12 శాతానికి గణనీయంగా తగ్గింది. రాయలసీమలో కూడా బాగానే తగ్గింది. వాటి కారణాలు వాటికున్నాయి. కోస్తా ఆంధ్రలో ఈ తగ్గుదల 10% వరకూ మాత్రమే ఉంది. బోరు బావుల ద్వారా వ్యవసాయం కోస్తాలో కన్నా తెలంగాణా - రాయలసీమల్లో ఎక్కువగా వుంది.

**వ్యవసాయ భూములు - ఉత్పాదకత**

వ్యవసాయరంగంలో ఉత్పత్తి విలువ పెరగడం అభివృద్ధి సూచకం. రాష్ట్రవ్యాప్తంగా ఈ అభివృద్ధి స్పష్టంగా కన్పిస్తుంది.




Source: Estimated from raw data accessed from G. S. Bhalla and Gurmail Singh. Refer also Bhalla and Singh (2009), Economic Liberalization and Indian Agriculture. A State wise Analysis, Economic and Political Weekly, Vol.XLIV/52

1962-65లో తెలంగాణాలో అతి తక్కువగా 3320 రూపాయలు వుండగా అది 2003-06 నాటికి 327% పెరిగింది. ఇదే లెక్కన, కోస్తా జిల్లాలలో 149%, రాయలసీమలో 84% మాత్రమే పెరిగాయి. "Thus, Telengana has shown large improvements in output per hectare duing the last 5 decades or so and it is consistent with growth in irrigation as well –" అని వ్యాఖ్యానించింది. ముఖ్యంగా వరి పంట విషయంలో తెలంగాణా ఈ అభివృద్ధిని గణనీయంగా సాధించింది. వరి పంట ఉత్పత్తి తెలంగాణాలో 70% పెరగగా కోస్తాలో 39%, సీమలో 29% మాత్రమే అభివృద్ధి సాధించింది. రాయలసీమ మిగిలిన రెండు ప్రాంతాల స్థాయిని అందుకోలేక పోయిందని గణాంకాలు చెప్తున్నాయి. వేరుశనగ, ప్రత్తి విషయంలో కూడా తెలంగాణా, సీమలోకన్న తెలంగాణాకే సానుకూలత ఎక్కువ కన్పించింది.

ఈ వివరాలు చెపుతూ కమిటీ నివేదికలో చాలా ముఖ్యమైన వ్యాఖ్య ఒకటి కన్పిస్తుంది - తెలంగాణా (హైదరాబాద్ మినహా) ప్రజల పరిస్థితిలో ఈ 50 ఏళ్లలో గణనీయమైన అభివృద్ధి కన్పిస్తోంది. అది కోస్తా ప్రాంతాన్ని అధిగమించి ఉంది. తులనాత్మకమైన అభివృద్ధి తెలంగాణాలో చాలా వేగంగా జరిగింది. కోస్తా, సీమలలో కన్నా ఇది ఎక్కువగా వుంది. అని! (పేజీ 92)

**Agriculture Operational Land Holdings across regions in AP (2005-06)**

| Region | Area (% share of all Size Classes) | | Holdings (%distribution) | | Avg Size (Hects) | % Irrigated |
|---|---|---|---|---|---|---|
| | < 2 Hects. | > 5 Hects. | < 2 Hects. | > 5 Hects. | | |
| Andhra Pradesh | 48.4 | 18.5 | 100.0 | 100.0 | 1.2 | 44.9 |
| Telangana | 46.1 | 20.2 | 39.2 | 46.6 | 1.3 | 45.9 |
| Rayalaseema | 40.9 | 22.2 | 17.0 | 29.1 | 1.6 | 24.5 |
| Coastal Andhra | 57.2 | 13.4 | 43.8 | 24.3 | 0.9 | 56.2 |

***Source :*** *Statistical Abstract 2009, Go AP. % irrigated is percentage of gross irrigated area to gross cropped area*

సాగు భూముల్లో సాగుబడి ఎంతమేర వుందనే విశ్లేషణ చేసినప్పుడు తెలంగాణాలో 45.9 శాతం, రాయలసీమలో 24.5 శాతం. కోస్తాలో 56.2 శాతం వుందని పై గణాంకాలలో వివరాలు చెప్తున్నాయి.

## విద్యుత్తు వినియోగం

వ్యవసాయం కోసం విద్యుత్తు వినియోగం 1974-75లో తెలంగాణాలో 260 kwh వుండగా, 2008-09లో 49306 గణనీయంగా పెరిగింది. భూగర్భ జలాల వినియోగం విషయంలో కోస్తా కన్నా తెలంగాణాలో ఎక్కువగా వుండటానికి కారణం మోటారు ద్వారా నీటిని తోడి వ్యవసాయంచేసే విధానాలకు రైతులు ప్రాధాన్యత నివ్వడమే నని అర్థం అవుతుంది. మొత్తం మీద హైదరాబాద్ తర్వాత అత్యధికంగా విద్యుత్తుని వినియోగిస్తున్నది తెలంగాణా ప్రాంతమేనని కూడా గణాంక వివరాలు సూచిస్తున్నాయి.

**Table 2.5: Electricity Consumption of Various Types by Regions in AP (Kwh)**

(a) Agriculture Power Consumption

| Region | 1974-75 | | 1984-85 | | 1994-95 | | 2004-05 | | 2008-09 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | Per hect. NIA | Per agri connection | Per hect. NIA | Per agri connection | Per hect. NIA | Per agri connection | Per hect. NIA | Per agri connection | Per hect. NIA | Per agri connection |
| Telangana | 260 | 1898 | 876 | 2531 | 5118 | 7132 | 5716 | 5193 | 4930 | 5920 |
| Rayalaseema | 350 | 2136 | 821 | 2741 | 4780 | 7159 | 5751 | 5889 | 5887 | 6346 |
| Coastal Andhra | 117 | 3323 | 141 | 2586 | 907 | 7139 | 1454 | 6781 | 1326 | 5797 |

(b) Per Capita Low Tension Electricity Consumption

| Region | 1971-72 | 1981-82 | 1991-92 | 2001-02 | 2008-09 |
|---|---|---|---|---|---|
| Telangana | 16 | 39 | 238 | 407 | 494 |
| Hyderabad | 52 | 103 | 180 | 234 | 758 |
| Rayalaseema | 31 | 46 | 183 | 299 | 409 |
| Coastal Andhra | 22 | 41 | 102 | 212 | 306 |

(c) Per Capita High Tension Electricity Consumption

| Region | 1971-72 | 1981-82 | 1991-92 | 2001-02 | 2008-09 |
|---|---|---|---|---|---|
| Telangana | 15 | 67 | 144 | 125 | 285 |
| Hyderabad | 77 | 222 | 100 | 75 | 331 |
| Rayalaseema | 17 | 47 | 73 | 65 | 163 |
| Coastal Andhra | 37 | 67 | 75 | 67 | 172 |

***Source :*** *Directorate of Economics and Statistics, GoAP.*
***Note :*** *Telangana excludes Hyderabad, NIA – Net Area Irrigated*

## మానవ శ్రమ (Work Participation Rate)

భారతదేశంలో మగవాళ్లు సంపాదించే వాళ్ళని ఒక నమ్మకం. అయితే, విద్యా సదుపాయాలు పొందిన మహిళలు, గృహపత్నులుగా ఉన్నవాళ్లు, వ్యవసాయం, రోజు కూలీలకు వెళ్ళే మహిళలు కూడా మానవశ్రమ భాగస్వాములే! 2001 మానవశ్రమకు సంబంధించిన గణాంక వివరాలు పరిశీలిస్తే, తెలంగాణాలో గ్రామీణ ప్రాంతాల్లో మహిళల శ్రమ ఎక్కువగా కన్పిస్తుంది. పురుషుల శ్రమ కోస్తాలో ఎక్కువ కన్పిస్తుంది. రాయలసీమలో కొంచెం తక్కువ కన్పిస్తుంది. కోస్తాలో పురుషులకీ, స్త్రీలకి శ్రమ విషయంలో వ్యత్యాసం ఎక్కువగా వుంది. స్త్రీలకన్నా పురుష శ్రామికులే ఎక్కువగా కన్పిస్తారు.

## తరలి వెళ్లటాలు Migrations

ఒక ప్రాంతం నుంచి వేరొక ప్రాంతానికి ప్రజలు తరలి వెడ్తున్నారంటే ఎక్కువ ఆదాయం కోసమో, పెద్ద చదువుల అవకాశం కోసమో, ఉన్నత జీవన ప్రమాణాల కోసమో వెడ్తున్నారని అర్థం. సాధారణంగా చిన్న పట్టణాలు, గ్రామాల నుంచి పెద్ద పట్టణాలకు ప్రజలు తరలి వెడ్తుంటారు.

**Table 2.7: Distribution of Out of District Migrants by Regions in AP 2007-08**

| REGION | OUT-MIGRATION | | REASONS OF OUT MIGRATION | | | | IN-MIGRATION | |
|---|---|---|---|---|---|---|---|---|
| | HHs Reporting Migration | Migrant perosn | Job search | Employment | Studies | Others | HHs reporting In-migration | Person In-migrants |
| Andhra Pradesh | 6.8 | 3.2 | 20.2 | 67.4 | 10.2 | 2.1 | 1.0 | 0.6 |
| Tel In Hyd | 6.7 | 2.9 | 23.2 | 66.8 | 9.1 | 2.7 | 1.7 | 0.7 |
| Tel exc Hyd | 7.1 | 3.1 | 21.5 | 66.8 | 9.3 | 2.5 | 0.4 | 0.3 |
| Hyderabad | 4.4 | 1.8 | 20.2 | 67.7 | 7.1 | 5.1. | 10.6 | 3.6 |
| Rayalaseema | 7.8 | 3.3 | 22.7 | 64.1 | 11 | 2.2 | 0.4 | 0.3 |
| Costal Andhra | 6.4 | 3.4 | 17.7 | 69.6 | 11.3 | 1.5 | 0.7 | 0.5 |

***Source** : Computed from NSSO 64th Round data. Note : Households. Marriage and family related migration is not considered inthis analysis*

పెళ్లిళ్లు, కుటుంబ కారణాలను తరలి వెళ్లడంగా పరిగణించలేదు. అలాగే, ఒకే జిల్లాలో ఒక ఊరు నుంచి మరొక ఊరుకు వెళ్లటం కూడా తరలి వెళ్లటం అవదు.

ప్రజలు తరలివెళ్లడం అనేది హైదరాబాద్‌కు 11%, తక్కిన తెలంగాణాకు 0.4%, రాయలసీమకు కూడా 0.4% వుండగా కోస్తాలో 0.7% వుంది.

పారిశ్రామిక ప్రగతి కారణంగా రంగారెడ్డి జిల్లాకు అన్ని జిల్లాలకన్నా ఎక్కువమంది (2.8%) తరలివెళ్లారు.

# రెండవ అధ్యాయం : రెండవ భాగం

## ఆర్థిక సమానత్వం - సామాజిక ఆర్థికాంశాలు

ఈ రెండవ అధ్యాయం రెండవ భాగంలో కమిటీ ఆర్థికాంశాలపైన ప్రత్యేక అధ్యయనం చేసింది. అందులో చెప్పిన కొన్ని ముఖ్యాంశాలు:

1993-94 అలాగే 2004-05లలో నేషనల్ కౌన్సిల్ ఆఫ్ అప్లయిడ్ ఎకనామిక్ రీసెర్చి సంస్థ నిర్వహించిన సర్వేలో తేలిన విషయాలివి.

### తరలి వెళ్లటాలు Migrations

ఒక ప్రాంతం నుంచి వేరొక ప్రాంతానికి ప్రజలు తరలి వెడ్తున్నారంటే ఎక్కువ ఆదాయం కోసమో, పెద్ద చదువుల అవకాశం కోసమో, ఉన్నత జీవన ప్రమాణాల కోసమో వెడ్తున్నారని అర్థం. సాధారణంగా చిన్న పట్టణాలు, గ్రామాల నుంచి పెద్ద పట్టణాలకు ప్రజలు తరలి వెడ్తుంటారు.

**Table 2.7: Distribution of Out of District Migrants by Regions in AP 2007-08**

| REGION | OUT-MIGRATION | | REASONS OF OUT MIGRATION | | | | IN-MIGRATION | |
|---|---|---|---|---|---|---|---|---|
| | HHs Reporting Migration | Migrant perosn | Job search | Employment | Studies | Others | HHs reporting In-migration | Person In-migrants |
| Andhra Pradesh | 6.8 | 3.2 | 20.2 | 67.4 | 10.2 | 2.1 | 1.0 | 0.6 |
| Tel In Hyd | 6.7 | 2.9 | 23.2 | 66.8 | 9.1 | 2.7 | 1.7 | 0.7 |
| Tel exc Hyd | 7.1 | 3.1 | 21.5 | 66.8 | 9.3 | 2.5 | 0.4 | 0.3 |
| Hyderabad | 4.4 | 1.8 | 20.2 | 67.7 | 7.1 | 5.1. | 10.6 | 3.6 |
| Rayalaseema | 7.8 | 3.3 | 22.7 | 64.1 | 11 | 2.2 | 0.4 | 0.3 |
| Costal Andhra | 6.4 | 3.4 | 17.7 | 69.6 | 11.3 | 1.5 | 0.7 | 0.5 |

***Source** : Computed from NSSO 64th Round data. Note : Households. Marriage and family related migration is not considered inthis analysis*

పెళ్లిళ్లు, కుటుంబ కారణాలను తరలి వెళ్లడంగా పరిగణించలేదు. అలాగే, ఒకే జిల్లాలో ఒక ఊరు నుంచి మరొక ఊరుకు వెళ్లటం కూడా తరలి వెళ్లటం అవదు.

ప్రజలు తరలివెళ్లడం అనేది హైదరాబాద్‌కు 11%, తక్కిన తెలంగాణాకు 0.4%, రాయలసీమకు కూడా 0.4% వుండగా కోస్తాలో 0.7% వుంది.

పారిశ్రామిక ప్రగతి కారణంగా రంగారెడ్డి జిల్లాకు అన్ని జిల్లాలకన్నా ఎక్కువమంది (2.8%) తరలివెళ్లారు.

## రెండవ అధ్యాయం : రెండవ భాగం

## ఆర్థిక సమానత్వం - సామాజిక ఆర్థికాంశాలు

ఈ రెండవ అధ్యాయం రెండవ భాగంలో కమిటీ ఆర్థికాంశాలపైన ప్రత్యేక అధ్యయనం చేసింది. అందులో చెప్పిన కొన్ని ముఖ్యాంశాలు:

1993-94 అలాగే 2004-05లలో నేషనల్ కౌన్సిల్ ఆఫ్ అప్లయిడ్ ఎకనామిక్ రీసెర్చి సంస్థ నిర్వహించిన సర్వేలో తేలిన విషయాలివి.

1) గ్రామీణ ఆదాయం కోస్తా జిల్లాలో గణనీయంగా పెరిగింది. ధనిక వర్గాన్ని మినహాయిస్తే తక్కిన అన్ని తరగతుల ప్రజల ఆర్థిక స్థితిలో పెరుగుదల కన్పిస్తుంది.
2) రాయలసీమలో బీదలు, అత్యంత బీదల ఆదాయంలో పెరుగుదల కన్పించగా ధనిక వర్గాలలో తరుగు వున్నట్లు తేలింది.
3) తెలంగాణాలో ధనిక వర్గాలు మరింత ధనికులయ్యారు. బీదలు, అత్యంత బీదల పరిస్థితిలో ఎదుగుదల లేదు. మరింత బీదలుగా ఉన్నారు.

కమిటీ అందించిన ఈ ఆర్థికపరమైన అంశాలను విశ్లేషించేటప్పుడు ఈ మూడు ముఖ్య అంశాల గురించి ముఖ్యంగా ప్రజలు ఆలోచించాల్సిన అవసరం తేటతెల్లమౌతుంది. ధనికులు మరింత ధనికులు కాగా, బీదలు మరింత బీదలు కావడానికి కారకులు ఎవరన్నది స్థానికంగా ప్రజలు గుర్తించటం అవసరం. రోగానికి తగ్గ చికిత్సను ఎంచుకోవాలి. అసలు కారణాన్ని గుర్తించకుండా ఆవేశాలు పెంచుకున్నందువలన సమస్య పునరావృత మౌతుందేగాని, ఫలితం వుండదని కమిటీ భావించినట్టు, ఈ వివరాలను విశ్లేషించిన తీరుని బట్టి అర్థం అవుతోంది. ఈ భావనే తుది తీర్పును ప్రభావితం చేసి ఉంటుందని కూడా అర్థం అవుతోంది.

తెలంగాణా ఆదాయంలో అభివృద్ధిని చూపించినందు వలన ఉపయోగం లేదు. ఈ అభివృద్ధి అన్ని వర్గాల వారికీ పంపకం జరిగిందా లేదా అనేది ముఖ్యం.

ఆర్థిక స్థూపంలో అట్టడుగు ప్రజల జీవన ప్రమాణంలో కోస్తా జిల్లాలు పెరుగుదలని సాధించాయి. కనీసం 80% గ్రామీణ దిగువ తరగతి వర్గాలలో అభివృద్ధిని కమిటీ గుర్తించింది. తెలంగాణాలో ఇందుకు భిన్నంగా జరిగింది.

తెలంగాణాలో ఆర్థికపరంగా మంచి అవకాశాలకోసం ప్రజలు ఉవ్వెత్తున ఉద్యమించడానికి తగిన కారణం వుంది. ధనికులు ఆర్థికాభివృద్ధి ఫలాలను అనుభవించి మరింత ధనికులుకావటం, భూస్వామ్య తరహా యాజమాన్యం పెచ్చుమీరటం తెలంగాణాలో జరిగింది. ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాలు, పథకాలను ఈ ధనికులు భోంచేసేశారని కూడా కమిటీ స్పష్టంగా తేల్చి చెప్పింది. అవి చేరవలసిన వారి దరిదాపులక్కూడా రాలేదు.

రాష్ట్రాన్ని విడదీసినందు వలన ఈ భోక్తల నుంచి తెలంగాణాలోని సామాన్య, అతి సామాన్య ప్రజలకు రక్షణ కలిగి, అది ఈ అట్టడుగు ప్రజల అభివృద్ధికి ఏ విధంగా దోహద పడ్తుందో వివరించవలసిన బాధ్యత వేర్పాటుకోరేవారి మీద వుంది. బహుశా కమిటీ ముందు ఇలాంటి పరిష్కార సూచనలు గట్టిగా విన్పించలేకపోవటం వలనే తెలంగాణా ఏర్పాటుని కమిటీ మొదటి ప్రాధాన్య అంశంగా చెప్పలేకపోయిందేమోనని ఈ విశ్లేషణ చదివితే అనిపిస్తుంది.

చర్చలు ఇలాంటి మౌలికమైన అంశాలపైన ఉండాలి. ప్రజలు తమ సమస్యలకు మూలకారణాల మీద దృష్టి సారించగలగాలి. రాజకీయ నాయకుల రాజకీయ ప్రయోజ నాలు వేరు. ప్రజా సమస్యలు వేరు. లాభం చేకూరవలసింది అట్టడుగు ప్రజలకే గాని, రాజకీయ శక్తులకు కాదు. మేధావులు రాజకీయవాదుల పక్షాన కాకుండా ప్రజల పక్షాన నిలవాలి.

1) తెలంగాణాలో వ్యవసాయ కూలీల చేతికి అందే వేతనాలు చాలా తక్కువ.
2) కోస్తాలో వ్యవసాయ కూలీల వేతనాలు పెరిగాయి. తెలంగాణాలో పెరగలేదు.
3) చిన్న చిన్న చేతి వృత్తుల వారి పరిస్థితి రాయలసీమలో మరింత దిగజారింది. తెలంగాణా, కోస్తాలలో ఫర్వాలేదు.
4) కులాలపరంగా చూస్తే SC లు, ST లు మైనారిటీల పరిస్థితి తెలంగాణాలో దిగజారింది.
5) కోస్తా జిల్లాల్లో అగ్రవర్ణాల వారి ఆదాయం క్షీణించింది.
6) గృహాదాయాన్ని పెంచుకొని, జీవన ప్రమాణాలు మెరుగుపరచుకునే అవకాశాలు తెలంగాణాలో అత్యంత పేద, పేద వర్గాలకు అందడం లేదు.

గణాంక వివరాలు తెలంగాణాలో ఆర్థికాభివృద్ధిని సూచిస్తున్నా ఈ అభివృద్ధి పేద ప్రజలకీ ఎంతవరకూ వచ్చిందనే విషయాన్ని కమిటీ ఇంత నిశితంగా పరిశీలన చేసింది. వాస్తవాలను మన ముందుంచింది. తెలంగాణాలో అభివృద్ధి పేదలకు అందలేదని తేల్చిచెప్పింది. అందుకు తెలంగాణాలోని అగ్రవర్ణాలవారు కారకులని కూడా గమనించింది. అసలైన విరుగుడు మందుని ప్రజలు, మేధావులు ఇప్పుడు కనుగొనాలి. దీనికి ప్రత్యేక రాష్ట్రమే విరుగుడని తేలితే, దానిని వ్యతిరేకించవలసిన అవసరం లేదు.

## ఆదాయ అసమానత

ప్రజలను మూడు గ్రూపులుగా విభజించితే, షెడ్యూలు కులాలు, షెడ్యూలు జాతులు, మైనారిటీలు ఒక గ్రూపుగానూ, ఇతర వెనకబడిన (OBC) హిందూ కులాలు ఒక గ్రూపుగాను, అగ్రవర్ణాలు, ఇతర మైనారిటీలు ఒక గ్రూపుగానూ కన్పిస్తారు.

**Income Inequality (Gini coefficient) by Rural Socio-Religious Category**

| Region | Period | All | High Caste Hindus & Other Minorities | SCs, STs & Muslims | Hindu OBCs |
|---|---|---|---|---|---|
| Andhra Pradesh | 1993-94 | 0.42 | 0.47 | 0.34 | 0.37 |
| | 2004-05 | 0.44 | 0.48 | 0.39 | 0.40 |
| | % change | 6 | 1 | 14 | 9 |
| Telangana | 1993-94 | 0.38 | 0.44 | 0.31 | 0.37 |
| | 2004-05 | 0.48 | 0.53 | 0.45 | 0.35 |
| | % change | 25 | 21 | 43 | 6 |
| Rayalaseema | 1993-94 | 0.38 | 0.39 | 0.35 | 0.39 |
| | 2004-05 | 0.43 | 0.40 | 0.39 | 0.42 |
| | % change | 13 | 2 | 13 | 8 |
| Costal Andhra | 1993-94 | 0.47 | 0.52 | 0.31 | 0.33 |
| | 2004-05 | 0.40 | 0.47 | 0.31 | 0.38 |
| | % change | -15 | -10 | -1 | 16 |

***Source :*** *Estimated from NCAER - Human Development Surveys, 1993-4 and 2004-5.*

***Note :*** *The Gini coefficient, invented by the Italian statistician Corado Gini, is a number between zero and one that measures the degree of inequality in the distribution of income in a given society. The coefficient would register zero (0.0 = perfect equality) for a society in which each member received exactly the same income and it would register a coefficient of one (1.0 = maximum inequality) if one member got all the income and the rest got nothing. Gini Coefficient takes the difference between all pairs of income and simply totals the absolute differences. It is calculated as* $G = \frac{\sum_{i=1}^{n}\sum_{j=1}^{n}|x_i - x_j|}{2n^2\bar{x}}$

*where* $x_i$ *&* $x_j$ *are different income classes, n is the number of values observed and x bar is the mean income.*

కొరాడో గినీ అనే ఇటాలియన్ నిపుణుడు సమాజంలో ఆర్థిక సమానత్వాన్ని నిర్ణయించే గినీ కోఎఫిషియెంట్ విధానాన్ని సూచించాడు. దాని ఆధారంగా ఈ పట్టికని తయారుచేశారు. "0.0" అంటే సంపద అందరికీ సమానంగా వుండి, ఆ సమాజంలో హెచ్చుతగ్గులు లేకుండా అందరూ సమాన ధనవంతులుగా వుండటం. "0.0" సమానత్వం నుంచి "1.0" అసమానత్వం వరకూ ఈ అధ్యయనం కొనసాగుతుంది. "1.0" వున్నదంటే పూర్తి అసమానత్వం ఉన్నట్టు.

దీని ప్రకారం చూసినప్పుడు తెలంగాణాలో ఇతర వెనకబడిన (OBC) హిందూ కులాలలోనూ, వ్యవసాయ వర్గాలలోనూ గినీ పద్ధతిలో 'ఆర్థిక సమానత్వాన్ని' మనం గమనించవచ్చు. తెలంగాణాలో అగ్రకులాల్లో ఆర్థిక అసమానత తక్కువగా వుంది. కోస్తాలో OBCలలో ఎక్కువగా వుంది. రాయలసీమలో మూడు గ్రూపులలోనూ ఆర్థిక అసమానతవుంది.

మొత్తంమీద ఈ విశ్లేషణ చూసినప్పుడు అభివృద్ధి ఫలాలు ప్రజలందరికీ సమానంగా అందకపోవటానికి మొదట లాభించిన వారే పదే పదే లాభించగా, తక్కినవారు అలాగే వుండిపోయి మరింత బీదలుగా మారిపోవటంతో ఏ కులానికి ఆ కులాన్ని చూసినప్పుడు ఆర్థిక అసమానతే కన్పిస్తుంది. దీని అర్థం ఏమంటేమనుషులు కులతత్త్వంతో 'కులాలు'గా విడిపోయినందువలన ఈ ఆర్థిక ప్రగతిపరంగా ఒనగూరే లాభం ఏదీ లేదన్నమాట! కుల, వర్గ తత్త్వాలకన్నా సామూహిక, సామాజిక తత్త్వంతో వ్యవహరిస్తే ఫలాలను అందరూ పంచుకోగలుగుతారన్నమాట!!

### నెలవారీ ఖర్చులు (Monthly Percapita Consumption expenditure)

2007-08 లెక్కల ప్రకారం చూసినప్పుడు రాష్ట్రంలో తలసరి నెలవారి ఖర్చు 971 రూపాయలుగా వుంది. దీనిప్రకారం చూసినప్పుడు తెలంగాణాలో రూ. 895గానూ, కోస్తాలో రూ. 1003గానూ, రాయలసీమలో రూ. 788గానూ వుంది. హైదరాబాద్‌లో ఈ వ్యయం చాలా ఎక్కువగా వుంటుంది. దాన్ని ఈ విశ్లేషణలో చేర్చలేదు.

**Monthly Per Capita Consumption Expenditure ( ₹ ) Regions and Social Groups (2007-08)**

| Region/Group | All Groups | SCs | STs | OBCs | Other Hindus | All Minorities | Muslims |
|---|---|---|---|---|---|---|---|
| Andhra Pradesh | 971 | 719 | 680 | 860 | 1484 | 969 | 892 |
| Telangana Inc Hyd | 1225 | 734 | 734 | 889 | 1846 | 1101 | 876 |
| Telangana exc Hyd | 895 | 710 | 726 | 836 | 1450 | 898 | 855 |
| Rayalaseema | 788 | 590 | 803 | 707 | 1099 | 755 | 937 |
| Coastal Andhra | 1003 | 759 | 570 | 902 | 1427 | 934 | 841 |

***Source :*** *Estimates from NSSO's 64th round survey, 2007-08. Note: Hyderabad excluded due to small sample size*

కనీస అవసరాలకు మనిషికి ఎంతయినా వెయ్యి రూపాయలు కావాల్సివుండగా తెలంగాణాలో 895 రూపాయిలే అందుతోంది. రాయలసీమలో మరీ ఘోరంగా 788 రూపాయలు అందుతున్నాయి. సగటు జీవన ప్రమాణం లేనట్టే దీని అర్థం. షెడ్యూల్ తెగల వారి విషయంలో ఇది బాగా వాస్తవంగా వున్నట్టు ఈ పట్టిక తెలుపుతుంది. కోస్తాలో వారికి 570 రూపాయలు మాత్రమే అందుతోంది. షెడ్యూల్ కులాల విషయంలో

రాయలసీమలో పరిస్థితి స్థిరంగా 590 రూ॥ మాత్రమే వుంది. ఇతర వెనుకబడిన కులాలవారికన్నా అగ్రవర్ణాల వారి నెలవారి ఖర్చు ఎక్కువగా వుంది. హైదరాబాద్‌తో కూడిన తెలంగాణా 1846 రూ॥ దాకా వుంది. తెలంగాణాలో 1450 రూ॥, రాయలసీమలో 1099 రూపాయలు, కోస్తాలో 1427 రూపాయలు.

డబ్బు ఖర్చుని చూసినప్పుడు, ఈ అధిక ధరల యుగంలో తెలంగాణా, కోస్తాలలో పరిస్థితి ఒకే రకంగా వున్నా, రాయలసీమలో తక్కువగా వుందన్న వాస్తవాన్ని మనకు కమిటీ వివరిస్తోంది. ఖర్చుకు తగ్గ ఆదాయం లేకపోవటమే ఇందుకు కారణాలుగా మనం గుర్తించాలి.

**సామాజిక వర్గాలు**

జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ నివేదికలో వివిధ సామాజిక వర్గాలు రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో వ్యాపించి వున్న తీరుని విశ్లేషించింది.

షెడ్యూలు కులాలు, తెగలు, ముస్లింల వియంలోను అన్ని ప్రాంతాల్లోనూ కలిపి సగటున 16% వుండగా షెడ్యూలు తెగల విషయంలో భిన్నంగా వుంది.

10% తెలంగాణా ప్రజలు షెడ్యూలు తెగలకు చెందిన వారిగా కమిటీ గుర్తించింది. రాష్ట్రంలోని మిగతా ప్రాంతాలతో పోల్చినప్పుడు ఈ సంఖ్య అధికం. రాయలసీమలో 3%, కోస్తాలలో 6% మాత్రమే షెడ్యూలు తెగలవారున్నారు. అలాగే 8.4% ముస్లింలు వున్నారు. కాని, రాయలసీమలో 12.5%, కోస్తాలో కేవలం 4.5% వున్నారు. చారిత్రక కారణాలరీత్యా హైదరాబాద్‌లో ముస్లింలు 41% వున్నారు.

అగ్రవర్ణాల వారి విషయానికొచ్చేసరికి రాయలసీమలో 24.2% వుండగా హైదరాబాద్ మినహా తెలంగాణాలో 10.5%, హైదరాబాద్‌లో 11.8%, కోస్తా 31.9 వున్నారు.

ఓబీసీలు రాష్ట్రవ్యాప్తంగా 44.5% వుండగా, హైదరాబాద్ మినహా తెలంగాణాలో 52.9%, హైదరాబాద్‌లో 34.9%, రాయలసీమలో 42.9%, కోస్తాలో 39.1% వున్నారు.

ఈ విషయాలన్నీ పరిశీలించి, లోతైన అధ్యయనం చేసిన మీదట కమిటీ తన నివేదికలో ఇలా పేర్కొంది.

1) తెలంగాణా ప్రత్యేక రాష్ట్రాన్ని కోరేవారి వాదన ప్రకారం, తెలంగాణా చాలాకాలం నిర్లక్ష్యం చేయబడిందని, వివక్షత చూపబడిందనీ, అందువలన ఆర్థిక సామాజిక వెనుకబాటుతనం కోస్తాఆంధ్రకన్నా ఎక్కువగా వుందని, తెలంగాణాలో తలసరి ఆదాయం తక్కువగా వుందనీ, ఉద్యోగావకాశాలు ఇక్కడ తక్కువగా వున్నాయని, వాణిజ్య అవకాశాలు కూడా తక్కువగా వున్నాయి. ఆర్థిక ప్రగతినంతా కోస్తా

ఆంధ్రవారే దక్కించుకున్నట్లు వారు ఆరోపించారు. స్థూలంగా చూసినప్పుడు, నిధులు, సంఖ్యలు, పర్సంటేజీల గణాంక వివరాలు పరిశీలించినప్పుడు ఇది వాస్తవమేననిపిస్తుంది.

2) కానీ, ఆర్థికపరంగా అభివృద్ధి పంపిణీ, ప్రజలందరికి సమాన వాటా అనే విషయాల్ని దృష్టిలోకి తీసుకున్నప్పుడు ఇందులో అసాధారణమేమీ కన్పించలేదని కమిటీ వ్యాఖ్యానించింది. హైదరాబాద్ మినహా తెలంగాణాలో జనాభా 36% వున్నారు. జనాభా - పంపిణీ విధానంలో పరిశీలిస్తే తెలంగాణా వాటా 1956, 1961, 1974 లెక్కల ప్రకారం తక్కువగా వుంది. ఇటీవలి కాలంలో జనాభా - ప్రాంత విస్తీర్ణత పద్ధతిలో తెలంగాణా వాటా చాలా ఎక్కువగా వున్నట్లు గమనించడ మైంది.

3) తెలంగాణా వెనుకబాటుతనాన్ని సూచించే కొన్ని ముఖ్య అంశాలున్నాయి. అవి అభివృద్ధి హైదరాబాద్ మీదే కేంద్రీకృతమైనందువలన ఏర్పడినవిగా కమిటీ భావించింది.

4) 50 ఏళ్ల సుదీర్ఘ ఆంధ్రప్రదేశ్ చరిత్రలో ప్రాంతీయమైన తేడాలు ఆర్థిక రంగంలో బాగా కన్పిస్తాయి. ఆర్థిక ప్రగతిని విశ్లేషించినప్పుడు తెలంగాణాలోనూ, రాయల సీమలోనూ ఆర్థిక అసమానత బాగా ఎక్కువగా వుండటాన్ని గమనించవచ్చు. కోస్తా ఆంధ్రలో మాత్రం ఆర్థిక అసమానత కొంతమేర తగ్గింది.

కలిగినవారు, లేనివారి మధ్య తేడా - SCలు, STలు మైనారిటీల విషయంలో తెలంగాణాలో బాగా ఎక్కువగా వుంది. ఈ ఆర్థిక వ్యత్యాసంపైన అత్యంత పేదవారి పోరాటం తెలంగాణా ఉద్యమంతోనే ఆగదు - అది మరింత ఉధృతం అయ్యే అవకాశం ఎక్కువగా వుంది. భవిష్యత్తులో అసంతృప్త రాజకీయశక్తులు, ప్రత్యేక ఆసక్తిగల వర్గాలవారు ఈ ప్రజా ఉద్యమాన్ని తమ ప్రయోజనాలకు ఉపయోగించు కునే అవకాశాలు ఎక్కువగా వున్నాయి - అని హెచ్చరించింది శ్రీకృష్ణ కమిటీ. రాజకీయ శక్తులు ప్రాంతాలతో నిమిత్తం లేకుండా అన్నిచోట్లా ఇలానే ప్రవర్తిస్తాయి. వాళ్లను నమ్మి, వాళ్లవెంట గుడ్డిగా వెళ్లే ముందు ప్రజలు తాము ఆటబొమ్మలుగా మారుతున్నామేమో గుర్తించాల్సిన అవసరాన్ని కమిటీ పరోక్షంగా నొక్కిచెప్పిందన్న మాట!

5) పేదరికం, అణగదొక్కడం, సాధికారికత అనే అంశాలలోంచి తెలంగాణా విషయాన్ని చూసినప్పుడు, రాష్ట్రాన్ని విభజించటమే పరిష్కారంగా తేలటంలేదు (An understanding of the perspective of the Telengana issue within poverty, deprivation and empowerment framework doesnot compulsorily support partitioning of state –" వాస్తవంగా, ఆర్థికపరమైన

విషయాలలో తెలంగాణా కోస్తాతో సమానంగానో, ఇంచుమించు సమానంగానో వుంది. ఒకసారి హైదరాబాద్‌ని కూడా కలిపిన తెలంగాణాని చూస్తే మాత్రం తెలంగాణా చాలాముందున్న ప్రాంతంఅవుతుంది. అభివృద్ధిరేటు మరింత పెరుగుదల స్థితిలోనే ఉంది. "దాన్నిబట్టి, వెనుకబడిన ప్రాంతం రాష్ట్రంలో రాయలసీమేగాని తెలంగాణా కాదని స్పష్టం అవుతోంది. (Thus, on the whole, it would appear that the deprived region is Rayalaseema, not Telangana–" అని కమిటీ వ్యాఖ్యానించింది.

ఇక్కడ నిర్మాణాత్మకమైన సూచనలు కొన్ని చేస్తోంది కమిటీ.

- వాణిజ్య బ్యాంకులు తెలంగాణాలో పెరగాలి. ఋణసదుపాయాలు విస్తృతంకావాలి.
- పంచాయితీ స్థాయిలో ఆర్థిక ప్రగతి కలిగేలా జాగ్రత్తలు తీసుకోవాలి.
- విద్య, వైద్యం, ఉద్యోగాలు అన్నీ హైదరాబాదు మీదే కేంద్రీకృతం కావటం వలన తక్కిన తెలంగాణా తక్కువ స్థాయిలో కన్పిస్తోంది. ఈ వ్యత్యాసాలను వెంటనే సరిచేయాలి. హైదరాబాదు మినహా తెలంగాణా అభివృద్ధి గురించి ప్రత్యేక ఆలోచన చెయ్యాలి !

6) గ్రామాలలో ఆదాయంలో తేడాల విషయం గురించి ఆలోచిస్తే, గత పదేళ్లకాలంలో తెలంగాణాలో ఆదాయవృద్ధి ధనికవర్గాలలోనే కల్గింది. పేదలు, అత్యంత పేదలు మరింత పేద వాళ్లయ్యారు. అన్ని ప్రాంతాల్లోనూ రైతులు లాభించగా, రైతు కూలీలకు తెలంగాణాలో బాగా అన్యాయం జరిగిందని కమిటీ అభిప్రాయపడింది. కోస్తా ఆంధ్రలో పరిస్థితి ఇలా లేదని కూడా తెలిపింది. అంతేకాదు – తెలంగాణాలో అగ్రవర్ణాలవారు బాగా లాభించారని లెక్కలుగట్టి మరీ నిరూపించింది. ఈ లెక్కలన్నింటిని "గినీ" పద్ధతిలో తొలిసారిగా ఒక విశ్లేషణ చేసి, తెలంగాణా కన్నా రాయలసీమలోనే అన్ని రకాలుగా వెనుకబాటుతనం తాండవమాడుతోందని తేల్చింది. నెలవారి ఖర్చుల వివరాలు చూసినప్పుడు తెలంగాణా కోస్తా ప్రజల కన్నా రాయలసీమ ప్రజలలో కొనుగోలుశక్తి పూర్తిగా పడిపోయిందని వెల్లడిచేసింది.

7) ప్రత్యేక రాష్ట్రం లేదా రాష్ట్రాలుగా ఆంధ్రప్రదేశ్‌ను విభజించినప్పుడు ఆర్థికంగా ఆయా కొత్త రాష్ట్రాలు ఎలా నిలదొక్కుకోగలుగుతాయన్న ప్రశ్నని కమిటీ అనేక కోణాలలోంచి సమాధానాలను విశ్లేషించింది.

- దేశంలో ఆర్థికపరంగా ఆంధ్రప్రదేశ్ 11వ స్థానంలో వుండగా ప్రాంతపరంగా చూసినప్పుడు హైదరాబాదు మినహా తెలంగాణా 15వ స్థానంలో నిలుస్తుంది.

- తలసరి ఆదాయం రీత్యా హైదరాబాద్‌తో కలిసిన తెలంగాణా 13వ ర్యాంక్ (GSDP) లో వుంటుంది.
- వెనకబడేది రాయలసీమే! అది జాతీయ సగటుకన్న తక్కువగా వుంటుంది.
- కోస్తా ప్రాంతంకూడా 13 స్థానంలో వుండి, దాని తలసరి ఆదాయం 10వ ర్యాంక్‌లో వుంటుంది. ఇది జాతీయ సగటు కన్నా కొద్దిగా ఎక్కువ.

ఈ లెక్కల్ని బట్టి హైదరాబాద్ లేకపోయినా తెలంగాణా ఆర్థికంగా నిలదొక్కుకునే అవకాశం వుందని కమిటీ తేల్చి చెప్పింది. కాబట్టి రాష్ట్రాన్ని విడగొట్టడానికి విభజిస్తే తట్టుకోగలదా..... ఇలాంటి ప్రశ్నలు అవరోధంకాదు. ఆలోచించవలసిందల్లా ఒక్కటే, ఒక ప్రాంతంలో వెనుకబాటుతనానికి కలిసివుండటమే కారణమా? విడగొడితే సమస్య పరిష్కారం అవుతుందా ?

కమిటీ నివేదిక తెలంగాణాలో అగ్రవర్ణాలవారు, అగ్రవర్గాలవారు. ధనిక రాజకీయ శక్తులు అట్టడుగు వర్గాల ప్రజలకు అభివృద్ధి ఫలాలు అందనీయకుండా చేస్తున్నారని, తాము మాత్రం అత్యంత ఆర్థిక ప్రగతిని సాధించుకున్నారని అర్థం అవుతోంది. చికిత్స ఇప్పుడు ఏ అవయవానికి చెయ్యాలో ప్రజలు నిర్ణయించుకోవాలి.

చిన్నదిగా వుంటేనే రాష్ట్రం అభివృద్ధి చెందుతుంది. కాబట్టి విడగొట్టాలనే, వేర్పాటు వాదులకి, పెద్దదిగా కలిసివుంటేనే రాష్ట్రం అభివృద్ధి చెందుతుందనే సమైక్యవాదులకీ ఇద్దరికీ శ్రీకృష్ణ కమిటీ ఒక్కటే సమాధానం చెప్పింది - చిన్నా పెద్దా కాదు. చిత్తశుద్ధి వుండాలని!

8) ఇది ఆర్థిక సంస్కరణల యుగం. రాష్ట్రాలు చిన్నవైనపుడు వాణిజ్య పన్నులు, అధికారుల తనిఖీలు, సెస్సులు, స్థానిక చట్టాలు ఎక్కడిక్కడ ఇబ్బందులు సృష్టిస్తాయని, ధరలు పెరిగిపోతాయని వాణిజ్యం భారమౌతుందని ముఖ్యంగా రాయలసీమ వారు కమిటీ ముందు భయం ఎక్కువ వ్యక్తం చేశారు. హైదరాబాద్‌తో సంబంధాలు తెగిపోయినందువలన కోస్తా ప్రజలలో పెద్ద మార్కెట్‌ని కోల్పోయే ప్రమాదం వుందని వాళ్లు భయపడ్తున్నారు. ఈ కోణంలోంచి చూసినప్పుడు విభజన అనేది ఆర్థిక ప్రగతికి అవరోధం అవుతుందని కమిటీ వ్యాఖ్యానించింది.

9) చిన్నరాష్ట్రం అయితే, తెలంగాణాలో షెడ్యూల్ తెగల ప్రజలకు ముస్లింలకు రాజకీయాధికారంలో పెద్దవాటా లభించే అవకాశం వుంటుందని తెలంగాణావారు అభిప్రాయపడ్తున్నారు.

అయితే, కోస్తాలో ఈ షెడ్యూల్డు కులాల తెగల ప్రజలకు వున్న వాటా తగ్గిపోయే అవకాశం వుంది. ఇలా చూసినప్పుడు, విభజన వలన ఒనగూరే ప్రయోజనాలు అన్ని సామాజిక వర్గాల, అన్ని వర్ణాల, అన్ని మతాల ప్రజలకూ, అన్ని ప్రాంతాల్లోనూ సమానంగా వుండదని, ఒకే సామాజిక వర్గ ప్రజలు ఒకవైపు లాభిస్తే ఇంకొకవైపు నష్టపోయే అవకాశం ఉందనీ కమిటీ పరిశీలనలో తేల్చింది.

10) పెద్ద రాష్ట్రాలను పాలించడం కష్టం అని, అతి వ్యయ ప్రయాసల కోర్చవలసి వుంటుందని, మంచిపాలన చిన్న రాష్ట్రాలతోనే సాధ్యం అవుతుందనే వాదన గురించి ప్రస్తావిస్తూ, జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ 73, 74 రాజ్యాంగ సవరణలు ఆంధ్రప్రదేశ్‌లో మండల వ్యవస్థల కారణంగా, అధికార వికేంద్రీకరణతో మంచి పాలనా వ్యవస్థ ఏర్పడి వుంది కాబట్టి, ఆ పేరుతో ఈ రాష్ట్రాన్ని విభజించి 'చిన్నది' చేయాల్సిన అవసరం ఉండదని అభిప్రాయపడింది.

ఈ రెండవ అధ్యాయంలో పేర్కొన్న అంశాలు జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ తెలంగాణాకు ప్రత్యేక ఆర్థిక మండలినివ్వడం ద్వారా సమైక్య రాష్ట్రాన్నే సూచించడానికి ప్రేరణగా నిలిచాయని మనం అర్థం చేసుకోవచ్చు. ఈ విశ్లేషణ ఆ దిశగానే సాగింది ! కమిటీ పదేపదే చెప్పిన అంశం - "విభజనను కోరడంలో న్యాయం ఉంది-" వెనుకబాటుతనానికి సమైక్య రాష్ట్రంలోనైనా ప్రత్యేక రాష్ట్రంలోనైనా రాజ్యాంగపరమైన, చట్టబద్ధమైన చర్యలు కావాలి" అని ! అందుకు చిత్తశుద్ధి కావాలి అని !



# మూడవ అధ్యాయం

## విద్య - ఆరోగ్యం
## EDUCATION & HEALTH

ఆంధ్రప్రదేశ్‌లో అక్షరాస్యత, ఆరోగ్య పథకాలు ఏ విధంగా అమలవుతున్నాయో జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ ఈ అధ్యాయంలో అధ్యయనం చేసింది.

**అక్షరాస్యత**

**Literacy Rate in India and Andhra Pradesh**

| | 1961 | 1971 | 1981 | 1991 | 2001 |
|---|---|---|---|---|---|
| All India | 28 | 34 | 44 | 52 | 65 |
| Andhra Pradesh | 21 | 25 | 30 | 44 | 60 |
| Telangana Inc Hyd | 17 | 21 | 26 | 41 | 58 |
| Telangana exc Hyd | 14 | 16 | 22 | 37 | 55 |
| Hyderabad | 35 | 40 | 58 | 72 | 79 |
| Rayalaseema | 21 | 24 | 30 | 45 | 60 |
| Coastal Andhra | 24 | 28 | 33 | 46 | 63 |

***Source** : Census Data*

అక్షరాస్యతలో ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి దేశ అక్షరాస్యత సగటు కన్నా తక్కువగానే వుంది. అయితే ఇటీవలికాలంలో కొంతమేర మెరుగుపడింది.

2001 లెక్కల ప్రకారం రాష్ట్ర అక్షరాస్యత 60% వుండగా, హైదరాబాద్ మినహా తక్కిన తెలంగాణాలో 55%, రాయలసీమ 60%, కోస్తా 63% వున్నాయి. తెలంగాణాలో అక్షరాస్యత అభివృద్ధి 180 గా వుంది. అది రాయలసీమలో 144.67గా వుంటే, కోస్తాలో 127.83 మాత్రమే వుంది.

యువకులలో అక్షరాస్యత 1983 లెక్కల ప్రకారం తెలంగాణాలో బాగా వెనుకబడి ఉండగా, 2007లో తెలంగాణాలో అక్షరాస్యత గణనీయంగా పెరిగింది. కోస్తాలో క్రిస్టియన్ మిషనరీలు, బ్రిటిష్ విద్యాధానం అమలులో ఉండటం ఒకరకంగా తొలినాళ్లలో కోస్తాలో విద్యారంగ అభివృద్ధికి మూలకారణం. తెలంగాణాలో నిజాం కాలంలో ఉర్దూ అధికార భాషగా వుండటం, నిజాం పాలనా విధానాలు అక్కడ పెద్దగా విద్యారంగాన్ని అభివృద్ధిపరచలేకపోయాయి.

తెలుగు భాషను ప్రామాణీకరించుకొని, తెలుగు మాధ్యమంలో చదవుకోవడం, స్కూలుకు వెళ్లే సదుపాయాలు ఇవన్నీ కోస్తా జిల్లాలో అట్టడుగు వారిలో కూడా ఎక్కువ మంది చదువుకోవటానికి దోహదపడ్డాయి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన సమయంలో తెలంగాణా విద్యార్థులు, ఉద్యోగులుకూడా రెండురకాలుగా ఇబ్బందులు ఎదుర్కొన్నారు. విద్యలో రాణించలేక పోవటం, ఇంగ్లీషులో ప్రావీణ్యం సంపాదించుకోలేకపోవటం, ఆ సమయంలో శిక్షణపొందిన ఉపాధ్యాయులు అక్కడ తక్కువగా వుండటంతో కోస్తా జిల్లాల నుంచి ఉపాధ్యాయులను రప్పించాల్సి వచ్చింది. 1969 ప్రత్యేక తెలంగాణా ఉద్యమంలో ఇలా ఆహ్వానించబడి వచ్చినవారినే ప్రధాన శత్రువులుగా పరిగణించారు. గత దశాబ్దిలో పరిస్థితి మారింది తెలంగాణా అక్షరాస్యతా క్రమంలో అమోఘమైన పరిణతి సాధించింది.

**Region-wise literacy rates of different social groups**

| Regions | SC Literacy Rate, 2001 | | | ST Literacy Rate, 2001 | | | Literacy Rate, 2001 | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | Males | Femals | Total | Males | Females | Total | Males | Females | Total |
| Andhra Pradesh | 64 | 43 | 54 | 48 | 26 | 37 | 70 | 50 | 60 |
| Tel inc Hyd | 59 | 36 | 47 | 47 | 23 | 35 | 69 | 47 | 58 |
| Tel exc Hyd | 58 | 34 | 46 | 47 | 22 | 35 | 67 | 43 | 55 |
| Hyderabad | 77 | 61 | 69 | 65 | 46 | 55 | 84 | 74 | 79 |
| Rayalaseema | 64 | 39 | 51 | 55 | 32 | 44 | 72 | 47 | 60 |
| Coastal Andhra | 68 | 52 | 60 | 47 | 30 | 38 | 71 | 55 | 63. |

***Source** : Census of India 2001*

షెడ్యూలు కులాలు, తెగలు, వెనుకబడిన వర్గాలు, ముస్లిం మైనారిటీలు స్త్రీలు - వీళ్ళలో గ్రామీణ ప్రాంతాల్లో అక్షరాస్యత చాలా తక్కువగా వుంది.

షెడ్యూల్ తెగల మహిళల్లో గ్రామీణ ప్రాంతాల్లో మరీ తక్కువగా వుంది. 1991 లెక్కల ప్రకారం ఈ షెడ్యూల్ తెగల మహిళల్లో 96.5% నిరక్షరాస్యులు. 2001 నాటికి పరిస్థితి మెరుగుపడి, ఈ సంఖ్య 86.5 శాతానికి చేరింది.

తెలంగాణాలో షెడ్యూల్ తెగల ప్రజల ఎక్కువమంది వున్నారని ఇంతకు ముందు చెప్పుకొన్నాం. 2007 లెక్కల ప్రకారం, 8-24 మధ్య వయసుగల యువతీ యువకులలో

షెడ్యూలు కులాలు, ముస్లింలు మిగతా ప్రాంతాలతో సమానంగానే తెలంగాణాలో అక్షరాస్యతని నమోదు చేశారు. షెడ్యూల్ తెగల వారిలో మాత్రం ఇంకా తక్కువగానే వుంది.

ఇలాగే స్కూలుకు వెళ్ళేవారు, మధ్యలో చదువు మానేసేవారి గురించి జిల్లాల వారీగా విద్యారంగం తీరుతెన్నులకు సంబంధించిన గణాంక వివరాలను కమిటీ అధ్యయనం చేసింది.

ఉన్నత విద్యకు సంబంధించి తెలంగాణాలో వ్యవసాయాధారిత కోస్తా జిల్లాలకన్నా ఎక్కువ డిమాండ్ వుంది. ఆర్థికంగా జీవన పరిస్థితి మెరుగుపడటమే ఇందుకు కారణంగా కమిటీ స్పష్టీకరించింది. రిజర్వేషన్లు, ఫీజు రీ ఇంబర్స్‌మెంట్ నిర్ణయం, ఇవన్నీ షెడ్యూల్ కులాలు, తెగలు, మైనారిటీల యువతను కాలేజ్ చదువుల వైపు మళ్లించాయి. ఇప్పుడు వాళ్లంతా మంచి ప్రభుత్వోద్యోగాలు వస్తాయనే ఆకాంక్షతో ఎదురు చూస్తున్నారు.

ప్రాథమిక విద్యకు సంబంధించి 1993 నుంచి తెలంగాణాలో బాగా అభివృద్ధి కన్పిస్తుంది. రాయలసీమను అధిగమించి కోస్తాజిల్లాలతో సమానమయ్యేలా ప్రాథమిక విద్యా ప్రగతి తెలంగాణాలో కన్పిస్తోంది. అప్పర్ ప్రైమరీ విద్య విషయంలో కూడా గొప్ప అభివృద్ధి కన్పిస్తుంది.

Annual status of Education (గ్రామీణ) రిపోర్టు ప్రకారం ప్రైవేట్ స్కూళ్ల సంఖ్య తెలంగాణాలో 33.1% వున్నాయి. కరీంనగర్‌లో అత్యధికంగా 43.1% వున్నాయి. అదే సమయంలో కోస్తా జిల్లాలలో 28.5% మాత్రమే ఉన్నాయి. రాయలసీమలో ఇంకా తక్కువగా 23.9% వున్నాయి. అంటే, ఉద్యోగాల కోసం తెలంగాణా విద్యావంతులైన యువతరం గట్టి పోటీనే ఇవ్వగల పరిస్థితి అక్కడ వుందని కమిటీ నివేదికలో చదివితే మనకు అర్థం అవుతుంది. ఈ పరిస్థితులలో ఉద్యోగావకాశాలు పెంపొందించుకోవడం ఎలా అనే దాని మీద చర్చ జరగాల్సిన అవసరం వుంది. తెలంగాణా వారు చదువులో వెనకబడివున్నారన్నది అపోహేనని కూడా ఈ గణాంక వివరాలు తెలుపుతున్నాయి. వెనకబడిన రాయలసీమ వారి గురించి కూడా ప్రత్యేకంగా ఆలోచించాల్సిన అవసరం వుంది.

తల్లుల విద్యార్హత, ట్యూషన్లు, ప్రైవేటు స్కూళ్లలో చదివించడం ఈ మూడు అంశాలూ బాగా సమకూరితేనే, చదువు వస్తుందనే నమ్మకం ఈ రోజుల్లో బాగా వుంది. తెలంగాణాలో చదవడం రాయడం నేర్చిన తల్లులు 39.7% మాత్రమే వుండగా, 12.3% విద్యార్థులు ట్యూషన్లకు వెళ్ళి చదువుతున్నారని గణాంకాలు తెలియజేస్తున్నాయి. అయినా తెలంగాణాలో ఉత్తమ విద్యా ఫలితాలు కల్పించడం గొప్ప విషయం. విద్యార్థులలో వున్న కసి, పట్టుదల, దృఢ సంకల్పాలే ఈ విజయాలు సాధించడానికి కారణం అని చెప్పవచ్చు. ఇది ఇతర ప్రాంతాల వారికీ ఆదర్శం కావాలి కూడా!

రంగారెడ్డి, హైదరాబాద్ జిల్లాల్లో ఎక్కువ ఉన్నత విద్యాలయాలు నెలకొని ఉన్నాయి. 46% విద్యాలయాలు, 48% విద్యార్థులు తెలంగాణాలో హైయర్ సెకండరీ విద్యారంగంలో ఉన్నారని గణాంక వివరాలు తెలియజేస్తున్నాయి. తెలంగాణాలో అవసరానికి మించే ఉన్నత విద్యాలయాలున్నాయని కమిటీ పేర్కొంది. 2001 లెక్కల ప్రకారం షెడ్యూల్ కులాల కోసం ఏర్పరచిన హాస్టళ్లలో చేరిన విద్యార్థుల సంఖ్య చాలా తక్కువగా వుందని కూడా కమిటీ నివేదిక తెలియజేస్తుంది. షెడ్యూల్ తెగల హాస్టళ్ల సంఖ్య మూడు ప్రాంతాలలోనూ తక్కువగానే వుంది. షెడ్యూల్ తెగల హాస్టళ్లు తెలంగాణాలో తక్కువగానే వున్నా, ఆ హాస్టళ్లలో చేరే విద్యార్థుల సంఖ్య ఇతర ప్రాంతాలకన్నా తెలంగాణాలో ఎక్కువగా వుందని కూడా కమిటీ నివేదికలో పేర్కొంది.

**యూనివర్శిటీ విద్య**

మన రాష్ట్రంలో రెండు రకాల విశ్వవిద్యాలయాలు, రెండు రకాల రిజర్వేషన్లు అమలులో ఉన్నాయి. 17 విశ్వవిద్యాలయాలలో రాష్ట్రవ్యాపిత పరిధి వుంది.

- ఉస్మానియా విశ్వవిద్యాలయ పరిధిలో 10 తెలంగాణా జిల్లాలు
- శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ పరిధిలో 4 జిల్లాలు రాయలసీమలోనూ, నెల్లూరు, కోస్తా జిల్లాలనుంచి
- ఆంధ్ర విశ్వవిద్యాలయం 8 కోస్తా జిల్లాలు.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో 42%, వెంకటేశ్వర విద్యాలయంలో 22%, ఉస్మానియాలో 36% సీట్లు జనాభా ప్రాతిపదికన ఏర్పరిచారు. ఉస్మానియాలో సీట్ల షేరుని పెంచమని ఇటీవల ఒక గట్టి డిమాండ్ ఏర్పడింది.

ఇవి కాక ప్రాంతీయ విశ్వవిద్యాలయాలలో 85% సీట్లు స్థానిక విద్యార్థుల కోసం రిజర్వ్ చేయబడ్డాయి. మిగిలిన 15 సీట్లు ఓపెన్ సీట్లుగా వున్నాయి. 2006 వరకూ ఆ ప్రాంతీయ విశ్వవిద్యాలయాలే ఉన్నాయి. రాజశేఖరరెడ్డి ప్రభుత్వం కొత్తగా నాలుగు విశ్వవిద్యాలయాలను తెలంగాణాలోనూ, మూడు కోస్తాలోనూ, ఒకటి రాయలసీమలోనూ ఏర్పాటు చేయడంతో విద్యా సదుపాయాలు బాగా పెరిగాయి.

**Region-wise data for Govt. and Aided Degree Colleges (2008-09)**

| Regions | Number | | | Enrolment | | | Lecturers | | | Stu Lee Ratio | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | Govt. | Aided | Total | Govt. | Aided | Total | Govt. | Aided | Total | Govt. | Aided | Total |
| Telangana inc Hyd | 106 | 53 | 159 | 88956 | 52405 | 141361 | 1881 | 1799 | 3680 | 47.00 | 29.00 | 38.00 |
| Telangana exc Hyd | 99 | 17 | 116 | 80839 | 17232 | 98071 | 1675 | 539 | 2214 | 48.00 | 32.00 | 44.00 |
| Rayalaseema | 54 | 25 | 79 | 46368 | 29819 | 76187 | 1093 | 1025 | 2118 | 42.00 | 29.00 | 36.00 |
| Coastal Andhra | 80 | 101 | 181 | 48758 | 116455 | 165213 | 1501 | 4307 | 5808 | 32.00 | 27.00 | 28.00 |

***Source :** Higher Education Department, Govt. of Andhra Pradesh*

హైదరాబాద్‌లో ఎక్కువ కాలేజీలు, విద్యార్థులు ఉన్నారు. ఆ నగరాన్ని అలా ఉంచితే, హైదరాబాద్ మినహా తెలంగాణాలో 99 ప్రభుత్వ కళాశాలలు, కోస్తాలో 80, సీమలో 54 వున్నాయి. సీమప్రాంతం నాలుగు జిల్లాలే అయినా, విద్యార్థి, ఉపాధ్యాయుల నిష్పత్తిని చూసినప్పుడు తెలంగాణాలో 48, సీమలో 42, కోస్తాలో 32 శాతంగా కన్పిస్తోంది. కోస్తాలో తక్కువ ఉపాధ్యాయులతో ఎక్కువ కళాశాలలు నడుస్తున్నా యన్న మాట. ఎయిడెడ్ స్కూళ్ళు, కాలేజీలలో కూడా ఇదే పరిస్థితి.

1996 తర్వాత ఇంజనీరింగ్ కళాశాలల సంఖ్య ఆంధ్రప్రదేశ్‌లో విపరీతంగా పెరిగింది. 37 నుంచి ఇప్పుడు 540 కాలేజీల వరకు పెరిగాయి. 10,455 మంది విద్యార్థుల సంఖ్య 1,75,767 వరకు పెరిగింది. అంతకు మునుపు 6 ఫార్మసీ కాలేజీలు ఉన్నాయి. ఇప్పుడు 256 కాలేజీలు అయ్యాయి. 310 మంది విద్యార్థులుండేవారు. ఇప్పుడు 15,320 మంది చదువుకొంటున్నారు. MBA కళాశాలలు 57 నుంచి 4998 పెరిగాయి. 2,145 నుంచి 37,443 మంది వరకూ విద్యార్థుల సంఖ్య పెరిగింది. MCA కాలేజీలు 44 నుంచి 6,988 పెరిగాయి. 1,330 నుంచి విద్యార్థుల సంఖ్య ఏకంగా 46,668 మందికి పెరిగింది.

**Region-wise data on Professional Colleges (2009-2010)**

| Regions | Engineering | | Pharmacy | | B.Ed. | | MBA | | MCA | | Law | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | No | Seats | No | Seats | No | Seats | No | Seats | No | Seats | No | Seats |
| Telangana inc Hyd | 286 | 69407 | 159 | 6766 | 248 | 26292 | 404 | 19835 | 253 | 12768 | 17 | 2649 |
| Telangana exc Hyd and Rangareddy | 134 | 31483 | 92 | 3929 | 178 | 18589 | 180 | 8870 | 47 | 4336 | 5 | 702 |
| Rayalaseema | 87 | 20285 | 27 | 1198 | 115 | 12238 | 122 | 5976 | 75 | 3743 | 13 | 2242 |
| Coastal Andhra | 233 | 55913 | 93 | 3945 | 241 | 26134 | 256 | 11632 | 226 | 10495 | 21 | 2851 |

***Source :*** *Department of Higher Education, and Commissioner of Technical Education, Govt. of Andhra Pradesh*

తెలంగాణాలో టెక్నికల్, ప్రొఫెషనల్ కాలేజీల సంఖ్య ఎక్కువగా ఉంది. ఎక్కువ భాగం హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాలలో కేంద్రీకరించి ఉన్నాయి. హైదరాబాద్‌ని మినహాయిస్తే, తెలంగాణాలో కోస్తా జిల్లాలకన్నా తక్కువ సంఖ్యలోనే కళాశాలలున్నట్లు లెక్క! ఈ ఇంజనీరింగ్, ఎం.బి.ఎ., ఎం.సి.ఎ., ఫార్మసీ కళాశాలల్లో ఎక్కువ భాగం ప్రైవేట్ యాజమాన్యానికి సంబంధించినవి. మార్కెట్ శక్తులు వీటిని నడుపుతుంటాయి. హైదరాబాద్, రంగారెడ్డిలలోనే ఎక్కువ ఎందుకు పెట్టారో మనం తేలికగా అర్థం చేసుకోవచ్చు. ప్రభుత్వరంగంలో కళాశాలల్ని బాగా వెనకబడిన ప్రాంతాలలో ఏర్పరిచినప్పుడు నిజమైన ప్రయోజనం నెరవేరినట్టవుతుంది. అలాంటి చోట ప్రైవేట్ కళాశాలల ఏర్పడుటకు సబ్సిడీలు, ఆకర్షణలు ఏవైనా ప్రకటించి ఆహ్వానించినా మంచిదే!

**Per capita Grant as Calculated by Various Political Groups**

| University | Annual per Capita (Rs.) |
|---|---|
| Andhra University | 35500 |
| Nagarjuna University | 22700 |
| Sri Venkateswara University | 37500 |
| Sri Krishna Devaraya University | 25000 |
| Osmania University | 17400 |
| Kakatiya University | 14000 |

***Source** : Memorandum submitted by TRS and other groups to CCSAP*

**Block Grants Released to Regional Universities**

| Sl.No | Name of the University | No. of Students in the University | Block grant released (Rs. Crores) | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | 2006-07 | 2007-08 | 2008-09 | 2009-10 | Avg./ year | Avg./ Capita (Rs.) |
| 1. | Osmania | 17079 | 93.00 | 93.00 | 49.22 | 75.00 | 77.55 | 45408 |
| 2. | Andhra | 13900 | 77.26 | 77.26 | 40.72 | 61.08 | 64.08 | 46100 |
| 3. | Kakatiya | 3902 | 23.72 | 23.72 | 24.87 | 18.75 | 22.77 | 58344 |
| 4. | Nagarjuna | 2500 | 14.85 | 14.85 | 7.77 | 15.50 | 13.24 | 52968 |
| 5. | Sri Venkateswara | 10500 | 42.13 | 42.13 | 44.75 | 33.60 | 40.65 | 38717 |
| 6. | Sri Krishnadevaraya | 1772 | 14.83 | 14.83 | 15.51 | 11.63 | 14.20 | 80118 |

Note :(1) The student strength data pertain only to University Campus and Constituent Colleges.
(2) It does not include strength of the affiliated colleges and Distance Education Students.
(3) The Block grant released is towards salaries and pension of the staff working in the university
Source : Department of HIgher Education, Go.AP

పై పట్టికల్ని కమిటీ ఈ విధంగా విశ్లేషించి వ్యాఖ్యానించింది.

- సగటు తలసరి ఆదాయం విషయానికొస్తే తెలంగాణా రాజకీయవాదులు చెప్పిన అంశాలను కమిటీ వాస్తమైనవిగా భావించలేదు.
- డిపార్ట్‌మెంట్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషన్, ఆం.ప్ర. ప్రభుత్వం వారు అందించిన వివరాల ప్రకారం ఆరు ప్రాంతీయ విశ్వవిద్యాలయాలకు తలసరి నిధుల విడుదల తెలంగాణాలో 47,814, రాయలసీమ 44696, కోస్తా 47147 కోట్లలో వున్నట్లు తేలింది. తెలంగాణాలోనే ఎక్కువ నిధులు విడుదలైనాయి.
- అయితే ప్రభుత్వ డిగ్రీ కళాశాలల్లో ప్రతి విద్యార్థి పైనా చేస్తున్న ఖర్చు వివరాలను పరిశీలించి నప్పుడు తెలంగాణా (హైదరాబాద్ మినహా)లో రూ.7,614,

రాయలసీమ రూ. 9,192, కోస్తాలో రూ. 11,558 ఖర్చు చేస్తున్నారు. హైదరాబాద్ మినహా తెలంగాణాలో తక్కువ నిధులు వ్యయం అయినట్లు తేలింది. అభివృద్ధి హైదరాబాద్‌లోనే కేంద్రీకృతం కావడం ఇందుకు కారణం !!

ప్రభుత్వ పాలిటెక్నిక్‌లలో హైదరాబాద్ మినహా తెలంగాణాలో 42,820, రాయలసీమలో 76,170, కోస్తాలో 47,040 చొప్పున ఖర్చు చేస్తున్నట్లు వివరాలు చెప్తున్నాయి.



Source: Data received from the Department of Higher Education, GoAP



Source: Data received from the Department of Higher Education, GoAP



Source: Data received from the Commissioner of Technical Education, GoAP

కొత్తగా పెట్టిన విశ్వవిద్యాలయాలలో తెలంగాణాకు 30 కోట్లలోపు కేటాయించారని, కడప యోగి వేమన విశ్వవిద్యాలయానికి ఏకంగా 300 కోట్లు కేటాయించారని, తెరాస పక్షాన ఇచ్చిన నివేదికలో పేర్కొన్న విషయాన్ని ప్రస్తావించి, యోగి వేమన విశ్వవిద్యాలయానికి నిధులు ఎక్కువ కేటాయించిన మాట వాస్తవమేగాని, ఉద్యమకారులు చెప్పిన సంఖ్య చాలా అతిశయోక్తిగా వుందని కమిటీ వ్యాఖ్యానించింది.

తెలంగాణాలో ఎయిడెడ్ కళాశాలలకు సహాయనిధులు తక్కువ కేటాయించారన్న ఆరోపణకు స్పందిస్తూ ప్రైవేట్ కళాశాలలకు నిధుల విషయంలో మార్గదర్శక సూత్రాల గురించి కమిటీ అన్వేషించింది. దానికి ఉన్నత విద్యాశాఖ ఇచ్చిన సమాధానంలో కోస్తా ఆంధ్ర కన్నా తెలంగాణాలో ఎయిడెడ్ కళాశాలలకు తక్కువ నిధులే ఇచ్చినట్లు పేర్కొన్నారు. ఎక్కువ ప్రభుత్వ కళాశాలలను ఏర్పరచడం ద్వారా ఈ ఖాళీని భర్తీ చేయడానికి ప్రభుత్వం కృషి చేసినట్లు తెలిపింది. వీటిల్లో కాకి లెక్కలున్నాయేమో గుర్తించాలి. ఎయిడెడ్ కళాశాలల వ్యవహారంలో లాబీయింగ్ అనేది బహిరంగ రహస్యమే కదా !

ఉన్నత విద్యాశాఖ నివేదిక ప్రకారం తెలంగాణాలో ప్రభుత్వ మరియు ఎయిడెడ్ కళాశాలలకు కలిపి ఇచ్చిన గ్రాంటు 93 కోట్లు, కోస్తా ఆంధ్రలో 224 కోట్లు, రాయలసీమలో 91 కోట్లుగా ఉన్నట్లు తెలుస్తోంది. ప్రభుత్వ కళాశాలలను కొత్తగా ఏర్పాటు చేయడం, లేదా కొత్త ప్రైవేట్ కళాశాలలను గుర్తించి ఎయిడ్‌ని అందించడం వెంటనే జరగాల్సి వుందని కమిటీ అభిప్రాయపడింది.

ఇలాంటి అవకతవకల వెనక పాలకుల నిర్లక్ష్యం, సమతుల్యత పాటించాలనే చిత్తశుద్ధి లేకపోవడం ముఖ్యకారణాలుగా మనకు కన్పిస్తాయి. అయితే ఇవి సవరించుకో దగిన చర్యలే!

కోస్తా, సీమ జిల్లాలో రాష్ట్ర వ్యాప్త విశ్వవిద్యాలయాలను ఏర్పరచగా, తెలంగాణా విషయానికి వచ్చేసరికి వాటిని కేవలం హైదరాబాద్‌లో మాత్రమే ఏర్పరిచారు. JNTU ని మొదట వరంగల్‌లో ఏర్పరచాలనుకున్నారు. కాని, హైదరాబాద్‌కి తరలించారు. అంబేద్కర్ ఓపెన్ యూనివర్శిటీని నల్గొండలో అనుకున్నారు. దాన్ని హైదరాబాద్ తరలించారు. రాష్ట్రవ్యాపిత విశ్వవిద్యాలయాలు రాజధానిలోనే వుండాలని అన్నారు. మరి ఇదే సిద్ధాంతాన్ని కోస్తాలోనూ, సీమలోనూ స్థాపించిన విశ్వవిద్యాలయాలకు ఎందుకు వర్తింప చేయలేదని తెలంగాణావాదులు ప్రశ్నించారు.

బాసర దగ్గర తలపెట్టిన IIIT ని హైదరాబాద్‌కు దగ్గరగా వున్న మెదక్ జిల్లాకు తరలించారు. ఆ విధంగా మిగిలిన 9 జిల్లాలకు విద్య సదుపాయాలు కలగకుండా పోయాయని, ఒక్క తిరుపతిలోనే 4 రాష్ట్రస్థాయి విశ్వవిద్యాలయాలు నెలకొల్పారని వారు ఆరోపించారు.

రాష్ట్రస్థాయి విశ్వ విద్యాలయాలలో 42% ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రాంతానికి, 36% ఉస్మానియా విశ్వవిద్యాలయం ప్రాంతానికి, 22% శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం ప్రాంతానికి చెందిన వారుండాలనేది నిర్ణయం. ఎక్కడికక్కడ ప్రాంతీయ విశ్వవిద్యాలయాలు ఏర్పడిన తర్వాత కొత్త రాష్ట్రస్థాయి విశ్వవిద్యాలయాలు ఒక ప్రత్యేక ప్రాంతంలో వుండటం అనేది ఆర్థికపరమైన లాభానికి సంబంధించిన అంశం అవుతుంది. ఎయిర్‌పోర్ట్, లాబ్‌లు, ఇతర అంతర్జాతీయ విద్యాలయాలు, సంస్థలు, అకాడెమీలు అందుబాటులో వున్నచోట కొత్త IIIT ఎక్కువ లాభకరంగా వుంటుందని భావించినట్లు ప్రభుత్వం తన కుంటి సమాధానంలో పేర్కొంది. అయితే ఈ సమాధానంతో కమిటీ ఏకీభవించలేదు. ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాల్లాంటివి పెద్ద విద్యాకేంద్రాలుగా మారాయి. అవి మహానగరంలో నెలకొల్పబడలేదని గుర్తు చేసింది. అయితే, తెలంగాణాలో వరంగల్, సీమలో చిత్తూరు, కడప, కోస్తాలో విశాఖపట్టణం, గుంటూరు జిల్లాలు ప్రసిద్ధ విద్యాకేంద్రాలుగా ఎదిగిన వాస్తవాన్ని గుర్తిస్తూ మూడు ప్రాంతాలలోనూ సమతుల్యతలో పెద్దగా వ్యత్యాసం లేదని కమిటీ భావించింది.

**వైద్య కళాశాలలు**

నాలుగు జిల్లాల రాయలసీమకు 4 వైద్య కళాశాలలు, 9 జిల్లాల కోస్తాకు 5 వైద్య కళాశాలలు, 10 జిల్లాల తెలంగాణాకు 4 వైద్య కళాశాలలు, అందులో 2 హైదరాబాద్‌లోనే ఉన్నాయన్న సంగతి కమిటీ తన నివేదికలో గుర్తించింది.

తెలంగాణావారు ఇతర ప్రాంతాలకు వెళ్లి చదువుకోలేరనీ, పూర్వపు ముల్కీ రోజుల్లో స్థానికులు కావడానికి 15 ఏళ్ల నిబంధన వుండగా ఇప్పుడు నాలుగేళ్ల చదువు తెలంగాణాలో వుంటే స్థానికులు అవుతారనే నిబంధన కారణంగా ఇతర ప్రాంతాలవారు చాలా తేలికగా స్థానికులుగా సీట్లు పొందుతున్నారని తెలంగాణావాదులు ఆరోపిస్తున్నారు.

కోస్తా విద్యార్థులు ఇందుకు భిన్నంగా తమ స్వంత రాజధానిలోని విద్యాలయాలలో తాము సీట్లు పొందలేకపోతున్నామని అంటున్నారు. రెండువైపుల వారి ఆందోళన మొదట అర్థం చేసుకోవాలి. ఎదురుదాడితో పరిష్కారాలు దొరకవు.

ఆంధ్రప్రదేశ్ కళాశాల విద్యా కమీషనర్ కమిటీకి అందించిన నివేదిక ప్రకారం తెలంగాణాలో 85% విద్యార్థులు స్థానికులేనంటున్నారు. ఈ స్థానికులలో తెలంగాణా యేతరులు ఎందరున్నారో లెక్కలు లేవు. అది సమగ్ర అధ్యయనం కాలేదు కదా !

ప్రైవేట్ ఇంజనీరింగ్ కళాశాలల విషయంలో జివో MS/84 (20/8/1993), అలాగే GOMS No. 227 (22/7/1994)లు 42%, 36%, 22% దామాషాలోనే సీట్లు నింపాలని స్పష్టీకరిస్తున్నాయి. జస్టిస్ సుభాషన్‌రెడ్డి, జస్టిస్ రంగారావు కమిటీ కూడా అన్ని ప్రైవేట్ ఇంజనీరింగ్ కళాశాలలు, మైనారిటీ సంస్థలు కూడా పైన చెప్పిన జీవోల ప్రకారమే

85% సీట్లు స్థానికులకు కేటాయించాలని తేల్చి చెప్పారు. అయితే ఈ రూల్ అన్నీ బుట్ట దాఖలు అయి, ఇప్పుడు ఎవరూ ఏమీ చేయలేని పరిస్థితి ఏర్పడిందని కమిటీ అభిప్రాయపడింది.

**హిందీ మార్కులు** : ఇంగ్లీషులో 35 మార్కులు, హిందీలో 18 మార్కులు వస్తే పాసయ్యేట్లు చెయ్యడం వలన హిందీలో ఎక్కువ ప్రావీణ్యత వున్న తెలంగాణా విద్యార్థులకు అన్యాయం జరుగుతోందనేది మరొక వాదన. ఈ వాదనతో కమిటీ ఏకీభవిస్తూ ప్రభుత్వం దీని మీద దృష్టిపెట్టి ఆలోచన చేయాల్సి వుందని పేర్కొంది. ఈ ఆలోచన చేసేప్పుడు హిందీని తెచ్చి సీమ, కోస్తాలమీద బలవంతంగా రుద్దకుండా జాగ్రత్తపడాలి.

## కమిటీ వ్యాఖ్యలు

పై విషయాలన్నీ పరిశీలించిన మీదట కమిటీ, విద్యారంగానికి సంబంధించిన తన వ్యాఖ్యానాన్ని ఇలా అందించింది. ఒక్కొక్క అంశాన్ని పరిశీలిద్దాం.

ప్రాథమిక విద్యాలయాల విషయంలో దేశంలో ఇతర రాష్ట్రాలతో పోలిస్తే ఆంధ్రప్రదేశ్ మెరుగైన స్థితిలో వుంది. 90% విద్యార్థులు తాము నివసిస్తున్న చోటే ప్రాథమిక విద్య పొందుతున్నారు. ఇప్పుడు రాష్ట్రంలో జరగవలసింది ఇంకా ఎక్కువ నాణ్యమైన రీతిలో నాణ్యమైన విద్యనందించటం. ప్రావీణ్యత గొప్పగా బైటకు రావడం లేదు. దానిని పెంపొందించాలి. ముఖ్యంగా ప్రభుత్వ విద్యాలయా లలో ఈ తేడా బాగా కన్పిస్తోంది. తెలంగాణాకి సంబంధించినంత వరకూ మిగతా ప్రాంతాలతో పోలిస్తే ఇక్కడ ఎక్కువ విద్యాలయాలున్నాయి. జోన్ 6 లో నాలుగేళ్ళ స్కూలు చదువు వుంటే స్థానికులేనన్న నిబంధన కారణంగా రాష్ట్ర వ్యాప్తంగా తల్లి దండ్రులు తమ పిల్లలను హైదరాబాద్ రంగారెడ్డి జిల్లాలలో చదివించడానికి ప్రాధాన్యత నిస్తున్నారు.

- తెలంగాణాలో ST విద్యార్థులలో చదువు కోసం డిమాండ్ ఎక్కువగా వుందని కమిటీ గుర్తించింది.
- తెలంగాణా మొత్తం జనాభాతో పోల్చినప్పుడు తెలంగాణాలో వున్న వృత్తి విద్యాసంస్థల సంఖ్య చాలా ఎక్కువ. అయితే, హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాలు మినహాయిస్తే మిగిలిన తెలంగాణాలో చాలా తక్కువ విద్యాలయాలు వున్నట్టే లెక్క. హైదరాబాద్ చుట్టూ ఎన్నో సంస్థలు కమ్ముకున్నాయి. ఈ అనుభవాన్ని దృష్టిలో పెట్టుకొని, అన్ని ప్రాంతాలలోనూ అన్ని జిల్లాలలోనూ సమతుల్యత వుండే విధంగా జాగ్రత్తలు తీసుకోవాల్సిన అవసరం వుంది.
- గ్రాంట్ల విషయంలో తెలంగాణావాదులు చెప్పిన విషయాలు, అందించిన ఆధారాలను

పరిశీలించినప్పుడు ఈ ఆధారాలలో కొన్ని వాస్తవాలు ఉన్నప్పటికీ, అన్నీ వాస్తవాలేననడం సరికాదని పేర్కొంది ! తెలంగాణాలో అక్షరాస్యతలో అభివృద్ధి గణనీయంగా వుంది. అయితే నిధుల మళ్లింపులో వ్యత్యాసం కన్పిస్తోంది. వాటిని సరిచేయాల్సి వుంది. కొన్ని సందర్భాల్లో నిధుల కేటాయింపులోనే రాజకీయపరమైన వత్తిళ్లు కూడా పనిచేస్తుంటాయి. ఏమైనా ప్రభుత్వ నిధులనేవి రాష్ట్రంలో ప్రజలందరికి సమానంగా పంపిణీ జరగాలి–అని !

కొన్ని ప్రాంతాలకు తక్కువ కేటాయింపు జరగడాన్ని సరిచేయడం కోసమే ఇటీవలి సంవత్సరాలలో మూడుప్రాంతాలలోనూ ప్రాంతీయ విశ్వవిద్యా లయాలను ఏర్పరచటం జరిగింది. అయితే, ఉత్తర తెలంగాణాలో ఒక మెడికల్ కళాశాలను ఏర్పాటు చేసి ఉండాల్సిందని కమిటీ అభిప్రాయ పడింది. ఇది మంచి సూచన. ఉత్తరాంధ్రలో కూడా మరొక సాంకేతిక విశ్వవిద్యాలయం ఉండాలని సూచించి ఉంటే బావుండేది.

తెలంగాణాలో ఇటీవలి సంవత్సరాలలో విద్యార్థులు కెరీర్ మీద దృష్టి పెట్టుకొని, వ్యవసాయానికన్నా విద్యార్జనకే ఎక్కువ ప్రాధాన్యతనిస్తుండటం గమనార్హం. కెరీర్ ఆశలు నెరవేరకపోవడంతో ప్రత్యేక రాష్ట్రవాదన బలపడుతోంది. రాజకీయ నాయకులు విద్యార్థులలోని ఈ నిరాశని రెచ్చగొట్టి సొమ్ము చేసుకోవటానికి ప్రయత్నించి, దానిని తెలంగాణా పట్ల వివక్షతగా చూపించే ప్రయత్నం జరిగినట్లు కమిటీ అభిప్రాయపడింది. "The Frustration of the youth when their expectations are not met is exploited bypoliticians who claim that their inability to get a job commensurate with their degree is due to discrimination against Telangana people thus causing inter – regionl and inter – community dissatisfaction".

ప్రభుత్వం నాణ్యమైన విద్యనదించలేకపోతే విద్యార్థులు ఎంత ఎక్కువగా చదువుకున్నా గొప్ప ఉద్యోగావకాశాలు రాక నిరాశకు లోనౌతారు. నాణ్యత ప్రావీణ్యతలను పెంచే విద్యాబోధన ఈ విద్యాలయాలలో జరగాలి – అని చెపుతూ, పోటీతత్త్వం పెరగాలంటే ఇంగ్లీషుని చిన్నప్పటి నుంచి అలవాటు చేయాల్సిన అవసరం వుందని కమిటీ ఇంకొక సలహానిచ్చింది !

ఇంగ్లీషుతోనే ప్రావీణ్యతలు వస్తాయన్నది ఒక వ్యామోహంతో కూడిన భ్రమే అయినా, కమిటీ సూచించినట్లు చెప్పిస్తున్న చదువు నాణ్యమైందిగా వుండాలనేది ప్రభుత్వానికి శిరోధార్యం–!!

తల్లిదండ్రులు విద్యావంతులు కాకుండా, ఆ కుటుంబంలో కాలేజీ విద్య దాకా వచ్చిన తొలితరం పిల్లలే ఈనాటి తెలంగాణా విద్యార్థుల్లో ఎక్కువమంది ఉన్నారన్న

విషయాన్ని కమిటీ బాగా గుర్తించింది, ఈ నివేదికలో తొలితరం కళాశాల విద్యార్థులంటూ చాలాసార్లు ఈ విషయాన్ని ప్రస్తావించింది. కోస్తా, సీమ ప్రాంతాల్లో కూడా ఇలాంటి మొదటితరం కాలేజీ విద్యార్థులు ఎక్కువమందే వున్నారు. ఇటీవల ప్రభుత్వం కల్పించిన ఫీజు రీఇంబర్స్‌మెంట్ సౌకర్యాలు, అవగాహన, పెరిగిన ఉద్యోగావకాశాలు ఇందుకు కారణం. తెలంగాణా కూడా ఇందుకు తగ్గట్టుగా గొప్పగా ప్రతిస్పందించింది. ఇది ఆహ్వానించదగిన పరిణామం. మానవ వనరులలో నాణ్యతని పెంచడానికి ఈ అవకాశాన్ని సద్వినియోగ పరచవలసిన సమయం ఇది !

అయితే, చదువుకున్నవారికి చదువుకున్నట్టుగా ఉద్యోగాలు రాకపోవడాన్ని "వివక్ష"గా తెలంగాణావాదులు చిత్రించడంతో కమిటీ ఏకీభవించలేదు. తగిన స్థాయిలో శిక్షణ లేకపోవడమే దీనికి కారణంగా కమిటీ భావించింది. ప్రావీణ్యతని పెంచి నాణ్యమైన చదువు చెప్పించండి. నిరుద్యోగ సమస్యకు ఇదే పరిష్కారం అని తన నివేదికలో కమిటీ స్పష్టంగా పేర్కొంది. మొత్తం మీద, సమస్యల్ని అధ్యయనం చేసి, ఆ సమస్యలకు విడిపోవటమే పరిష్కారం కాదని, దాన్ని దానిగా పరిష్కరించాలని కమిటీ ఈ అధ్యాయంలో తేటతెల్లం చేసింది. విడిపోతే ఆ సమస్య ఎలా పరిష్కారం అవుతుందో తెలంగాణావాదులు కమిటీకి నచ్చచెప్పడంలో తగిన జాగ్రత్త తీసుకోలేదని కూడా దాన్ని బట్టి అర్థం అవుతుంది. సమస్యని ఎత్తి చూపించి, కమిటీ దాన్ని గుర్తించేలా చేయడంలో మాత్రం వారి కృషి అమోఘమైందని చెప్పాలి.

## 2. ఆరోగ్యం

జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ మూడు ప్రాంతాలలోనూ విస్తృతంగా పర్యటించినప్పుడు ఆరోగ్యానికి సంబంధించిన అంశాల్ని పెద్దగా ఎవరూ లేవనెత్తలేదని కమిటీ నివేదికలో పేర్కొంది. అయినప్పటికీ విద్య, ప్రజారోగ్యాలే మంచి పాలనకు సంకేతాలు కాబట్టి కమిటీ తనంత తానే ప్రజారోగ్య పరమైన అంశాలు మూడు ప్రాంతాలకు ఏవిధంగా విస్తరించాయో అధ్యయనం చేసింది.

ఆసుపత్రులు, డిస్పెన్సరీలు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, ఆసుపత్రులో పడకలు, డాక్టర్లు వగైరా అంశాలను పరిశీలించింది. ఈ మొత్తం గణాంక వివరాలను క్రోడీకరించి కమిటీ తన అభిప్రాయాన్ని ఈ విధంగా నివేదికలో అందించింది.

- ఆరోగ్య సదుపాయాలు మన రాష్ట్రంలో చాలా స్వల్పంగా ఉన్నాయి. తలసరి వ్యయం చాలా తక్కువ.
- వున్నంతలో రాయలసీమలో ఎక్కువగానూ, ఆ తరువాత కోస్తాలో కొంతమేర, తెలంగాణాలో బాగా తక్కువగానూ వుంది.

- హైదరాబాద్ మినహా తెలంగాణాని చూసినప్పుడు తెలంగాణాలో ఆరోగ్య సదుపాయాలు అతిస్వల్పంగా ఉన్నాయి.
- "అయితే, వైద్యసదుపాయాలు అరకొరగా ఉన్నప్పటికీ ఆరోగ్యం విషయంలో తెలంగాణా చాలా మెరుగ్గా వుంది-" అని కమిటీ అభిప్రాయపడింది. ఇందులో ప్రభుత్వం గొప్పతనం ఏమీ లేదు. అది తెలంగాణా ప్రజల శారీరక, మానసిక దారుఢ్యానికి సంబంధించిన విషయంగా మనం గుర్తించాలి.
- ప్రసూతి శిశు పోషణ విషయంలో రాయలసీమ, కోస్తా ఆంధ్ర, మరీ ముఖ్యంగా ఉత్తరకోస్తా జిల్లాలతో పోల్చినప్పుడు, తెలంగాణా మెరుగైన స్థితిలో ఉంది.
- ఉన్నంతలో వైద్యసదుపాయాన్ని ఉపయోగించుకోవడం, ఆరోగ్య స్పృహతో అవసరమైతే ఖర్చుకు వెనుకాడకుండా రోగాలను నివారించుకోవడంలో తెలంగాణా ప్రజలు ముందుంటారు.
- పెద్ద కార్పొరేట్ ఆసుపత్రులు హైదరాబాద్‌లోనూ, కొన్ని కోస్తా జిల్లాలోనూ ఆధునిక సదుపాయాలతో కూడినవి వున్నాయి. రాయలసీమ ఈ విషయంలో వెనకబడి ఉంది.
- రానురానూ 'వైద్యం' అనేది ప్రభుత్వంలోంచి ప్రైవేట్ రంగంలోకి జారిపోతోందని కమిటీ హెచ్చరించింది.
- కోస్తాలో విజయనగరం, తెలంగాణాలో మెహబూబ్‌నగర్, సీమలో కర్నూలు ప్రసూతి, శిశుపోషణ విషయంలో బాగా వెనకబడి వున్న ప్రాంతాలు. ప్రైవేట్ వైద్యం చేయించుకోగలిగే శక్తి ఇక్కడి ప్రజలకు లేకపోవటమే కారణాలు అని కూడా కమిటీ అభిప్రాయపడింది.
- విశాఖపట్నం, గుంటూరు, నెల్లూరు జిల్లాలు శిశువులకు టీకాలు వేయించడంలో బాగా వెనకబడి వున్నాయి. ప్రసూతి విషయంలో విశాఖపట్నం, ప్రకాశం జిల్లాలు వెనకబడి వున్నాయి. కోస్తా జిల్లాల్లో ఈ వెనుకబాటుతనానికి కారణాలను దారిద్ర్యం, ఖర్చుపెట్టలేనితనం అనే అంశాలతో చూడలేమని, ఆరోగ్య స్పృహ, పరిజ్ఞానం లేకపోవడంకూడా కారణం అని కమిటీ అభిప్రాయపడింది.

ఈ సూచన అటు ప్రభుత్వానికే కాదు, ఇటు ప్రజలక్కూడా వర్తించేదే! వైద్యులు, సామాజిక కార్యకర్తలు, వైద్యగ్రంథాల రచయితలు అందరూ ఇందులో భాగస్వాములు కావాల్సిన అవసరాన్ని ఈ హెచ్చరిక గుర్తు చేస్తోంది.

- ప్రైవేట్ వైద్యం విషయంలో అవినీతిని నిరోధించి, నాణ్యమైన వైద్యాన్ని ప్రజలకు అందించేలా గట్టిచర్యలు తీసుకోవాలని కూడా ప్రభుత్వాన్ని కమిటీ హెచ్చరించింది.

# నాల్గవ అధ్యాయం

## జలవనరులు, నీటి పారుదల, విద్యుత్తు రంగాల అభివృద్ధి
## WATER RESOURCES, IRRIGATION AND POWER DEVELOPMENT

ఆంధ్రప్రదేశ్ 2,75,100 చదరపు కి.మీ. విస్తీర్ణంలో, 960 కి.మీ. పులికాట్ నుంచి ఇచ్ఛాపురందాకా విస్తరించి వుంది.

40 పెద్ద, మధ్యతరహా, చిన్న నదులు ఇక్కడ ప్రవహిస్తున్నాయి. గోదావరి, కృష్ణా, పెన్నా నదులు అంతర్రాష్ట్రాల నదులు.

గోదావరికి ఉత్తరాన ఒరిస్సా సరిహద్దులో 4 నదులు, పెన్నాకు దక్షిణ తమిళనాడు సరిహద్దులో 5 నదులు ప్రవహిస్తున్నాయి. ఇవికాక ఇంకా 28 నదులు చిన్నవి పెద్దవి ఆంధ్రప్రదేశ్‌లో ప్రవహిస్తూ త్రాగునీటి, సాగు నీటి అవసరాలను తీరుస్తున్నాయి.

ఈ నివేదికని జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ ప్రభుత్వానికి అందించే రోజే కృష్ణానది జలాల వినియోగం మీద తెలుగు ప్రజల హక్కును దెబ్బతీసే తీర్పు కూడా వెలువడింది.

గోదావరి జలాల వివాద ట్రిబ్యునల్ తీర్పు ప్రకారం 1480 TMC జలాలు, కృష్ణా జలాల వివాద ట్రిబ్యునల్ ప్రకారం 811 TMC జలాలు. పెన్నానది ద్వారా 99 TMC జలాలు అందుబాటులోకి వస్తాయి. మొత్తం జలాలు కలిపితే 2769 TMC మనకు దక్కుతాయి. అయితే ఈ జలాలతో ప్రస్తుతం మనం 1933 TMC జలాలను, 61.66 లక్షల హెక్టార్ల కోసం ఉపయోగించుకొంటున్నాం. 157.78 లక్షల హెక్టార్ల వ్యవసాయ యోగ్య భూమి మనకుంది. 70% ప్రజలు వ్యవసాయం మీద ఆధారపడే జీవిస్తున్నారు. వ్యవసాయం అనేది మనకు కొత్త విద్య కాదు. తరతరాల వారసత్వం అది మనకి. రాజుల కాలంలో వ్యవసాయానికి మంచి ప్రోత్సాహం లభించింది కూడా!

స్వాతంత్ర్యం తర్వాత భారతదేశంలో నీటిపారుదల విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. దేశంలో అనేక రిజర్వాయర్లను నిర్మించి నీటిని నిలవ చేసుకునేందుకు ఏర్పాట్లు ప్రోత్సహించారు. ఆంధ్రప్రదేశ్ కూడా ఈ అభివృద్ధిలో భాగస్వామ్యం అయ్యింది.

ఈ నేపథ్యంలో నీటిపారుదల రంగానికి సంబంధించి అనేక అంశాలను కమిటీ దృష్టికి తెచ్చేందుకు మూడు ప్రాంతాల నిపుణులు రాజకీయవేత్తలు ప్రయత్నించారు. కమిటీవారు అన్నీ శ్రద్ధగా విన్నారు. వారికిగావారు ఈ సమస్యలకు సంబంధించిన సమాచారాన్ని సంబంధిత అధికారులు, సంస్థల నుంచి తెప్పించుకొని అధ్యయనం చేశారు.

– తెలంగాణా ప్రజలు లేవనెత్తిన అంశాలలో నీటి కేటాయింపులలో వివక్షత అనేది ముఖ్యమైంది. గోదావరి జలాలను కోస్తా, రాయలసీమలకు మళ్లించటంలోనూ ప్రాజెక్టుల కేటాయింపులోనూ తెలంగాణాకి అన్యాయంజరిగిందని, పనికిరాని ప్రాజెక్టులు తెలంగాణాలో కట్టడానికి ప్రయత్నించారని, "ఇచ్చంపల్లి", దేవాదుల లిఫ్టిరిగేషన్‌లాంటి ప్రాజెక్టులు అనవసరం అనీ, పోలవరం ప్రాజెక్టు కోస్తా జిల్లాల ప్రయోజనం కోసం తెలంగాణాకు అన్యాయం చేసి కడ్తున్నారని, తరతరాలుగా తెలంగాణాలో కొనసాగుతున్న ప్రాజెక్టులను నిలిపి వేస్తున్నారని... ఇలా చాలా అభియోగాలు కమిటీ ముందు నమోదు చేశారు తెలంగాణా వాదులు.

చెఱువుల మరమ్మత్తులు లేకపోవడం అనే అంశాన్ని ప్రస్తావిస్తూ 12 లక్షల ఎకరాల నుంచి 5 లక్షల ఎకరాలకు చెరువుల మీద ఆధారపడే వ్యవసాయం తగ్గిపోయి, భూగర్భ జలాలమీద ఆధారపడే పరిస్థితి వచ్చిందని, అది రైతులకు అధిక వ్యయంతో కూడుకున్నదని దానివలన రైతుల ఆత్మహత్యలు పెరిగిపోయాయని అన్ని ప్రాంతాల ప్రజలు కమిటీ దృష్టికి తెచ్చారు. నదులు నిండుగా ప్రవహిస్తున్నా ఈ పరిస్థితి ఉందన్నారు. నీటిపారుదల ద్వారా వ్యవసాయం చేసే భూములు తెలంగాణాలో తక్కువగా వున్నాయి. కోస్తాలో ఎక్కువగా వున్నాయి. ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే కృష్ణా గోదావరి జలాలను ఎక్కువగా వాడుకునే అవకాశం వుంటుందని, వ్యవసాయం పెరుగుతుందని, ఉపాధి అవకాశాలు పెరుగు తాయని తెలంగాణావాదులు పేర్కొన్నారు.

తెలంగాణాతో పోలిస్తే వ్యవసాయ రంగంలో రాయలసీమ బాగా వెనకబడివుందని కోస్తా, సీమ ప్రాంత నిపుణులు కమిటీ దృష్టికి తెచ్చారు.

నీరు, నీటిపారుదలలకు సంబంధించిన అంశాలు పూర్తిగా సాంకేతికమైనవి కాబట్టి ఈ విషయమై అధ్యయనం చేసేందుకు ఆ రంగంలో నిపుణత కలిసిన బైట వ్యక్తిని నియమించేందుకు కమిటీ నిర్ణయించుకొని, ఎ.డి.మొహైలీ, పూర్వపు చైర్మన్, కేంద్ర జలసంఘం గారికి ఆ బాధ్యత అప్పగించింది.

నిర్లక్ష్యం, వివక్షతలను గుర్తించటం, తగిన పరిష్కారాలను, అభివృద్ధి చేసేందుకు సూచనలను అందించటం వీరి బాధ్యత.

మొహైలీగారు విస్తృతంగా సమాచారం తెప్పించుకొని ప్రత్యేక అధ్యయనం చేశారు. అయన కూడా అనేక మంది సంబంధిత అధికారులు, నిపుణులతో విస్తారంగా చర్చలు జరిపారు. తుంగభద్రపైన సుంకేశుల బ్యారేజీని, పోతిరేపాడు హెడ్ రెగ్యులేటర్‌ని, రాజోలి బండ కాలువని, నాగార్జున సాగర్‌ని, దిగువ మనేరు డ్యామ్‌ని, ఇలా చాలా వాటిని వ్యక్తిగతంగా సందర్శించారు. తన అభిప్రాయాల్ని పొందుపరిచి నివేదికని కమిటీకి అందించారు.

శ్రీకృష్ణ కమిటీ అన్ని విషయాలను కూలంకషంగా పరిశీలించింది. భూగర్భ జలవనరుల వినియోగం, నదీ జలాల ఎత్తిపోత, జలయజ్ఞం కార్యక్రమాలు పంట విస్తీర్ణం, వ్యవసాయ యోగ్య భూముల విస్తీర్ణం, చెరువుల, కాలువలు, వ్యవసాయాదాయం, వరి, ఇతర ధాన్యాలు - ఈ అన్నింటికీ సంబంధించిన గణాంక వివరాలు అధ్యయనం చేసింది.

కోస్తా జిల్లాల్లోనే ఉత్తర కోస్తా జిల్లాలకు గల ప్రత్యేకతని, పోలవరం ప్రాజెక్ట్‌ని ఇలా అనేక విషయాలను నివేదికలో ప్రస్తావించి వాటి సాంకేతిక వివరాలు పొందు పరిచింది.

కమిటీ తన నివేదికలో వివిధ ప్రాంత ప్రజలు లేవనెత్తిన అంశాలకు ఒక్కొక్క దానికి తన అభిప్రాయాల్ని ఈ నివేదికలో పొందుపరిచింది. కొన్నింటిని పరిశీలిద్దాం.

- నీటిని అందించడానికి 'అయకట్టు' విస్తీర్ణం ఒకటే ప్రాతిపదిక కాదని కమిటీ అభిప్రాయపడింది. నదుల్లోకి నీటి విడుదల అనేది జలసంఘాల తీర్పుల మీద ఆధారపడే విషయం. అలా నదులలోకి వచ్చిన నీటిని ప్రాజెక్టులు వారీగా, ప్రాంతాల వారీగా నిపుణుల సంఘం సూచన మేరకు ఎప్పటికప్పుడు విడుదల చేయాలి. ఇక్కడ తెలంగాణాకు గల వ్యతిరేకాంశం ఏమంటే అది ఎత్తయిన పీఠ భూమి ప్రాంతం. నదులు దిగువకు ప్రవహిస్తూపోతాయి.
- కృష్ణాజలాల వివాదాల ట్రిబ్యునల్ ముందు ఆంధ్రప్రదేశ్ తన వాదనని గట్టిగా విన్పించకపోవడం వలన అది తెలంగాణాకు ఎక్కువ నష్టాన్ని కల్గించిందనే భావన తెలంగాణా వారిలో బాగా వుంది. అందువలన మొత్తం రాష్ట్రానికి నష్టం జరిగింది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు జరిగిన ఒప్పందాలను కృష్ణాజలాల వివరాల ట్రిబ్యునల్ ముందు గట్టిగా ప్రస్తావించి వుంటే కృష్ణానదిలోకి ఇంకా ఎక్కువ నీరు విడుదల అయి వుండేదనేది ఆరోపణ.

- శ్రీశైలం ఎడమ కాలువ ప్రాజెక్ట్‌ని కావాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆలస్యం చేసి తెలంగాణాకి అన్యాయం చేసిందనేది మరో ఆరోపణ. ఈ ప్రాజెక్ట్ సాంకేతిక అంశాలను కమిటీ పరిశీలించిన తర్వాత, ఇంజనీరింగ్ అంశాలకు సంబంధించి, ఇది వెంటనే చేపట్టి పూర్తి చేయగల ప్రాజెక్ట్ కాదని కమిటీ అభిప్రాయపడింది.
- తెలంగాణాలో చిరకాలంగా వున్న చెరువులను ఉద్దేశపూర్వకంగా ధ్వంసం చేశారని, నిర్లక్ష్యం చేశారని, మరమ్మత్తులకు నిధులు కేటాయించలేదని, అది పెద్ద నష్టం కల్గించిందనేది మరో ఆరోపణ. దానివలన భూగర్భ జలాలమీద రైతులు తప్పనిసరిగా ఆధారపడవలసి వచ్చిందన్నారు. దాని గురించి కమిటీ చేసిన అధ్యయనంలో, చెరువులు, కుంటలు లాంటి చిన్న జలవనరుల మీద కాకుండా భూగర్భ జలాల మీద ఆధారపడటం అనేది దేశవ్యాప్తంగా ఏర్పడిన మార్పేనని గమనించారు.
- జనాభా పెరుగుదల, పంటలు పండించడంలో పెరుగుదల, నేల ఖరీదు పెరగటం, విద్యుత్ సౌకర్యాలు బాగా అందుబాటులోకి రావటం - ఇవన్నీ చెరువుల నిర్లక్ష్యం కావడానికి కారణాలుగా కమిటీ గుర్తించింది. దానివలన భూగర్భ జల వనరుల వినియోగం దేశ వ్యాప్తంగా పెరిగినట్లు భావించాలి.
- భూగర్భంలో నీరు అందుబాటులో లేనప్పుడు లోతైన బావులు ఖరీదైన అంశం అవుతాయి. నీటిని తోడడం ఖరీదవుతుంది. అందుకని, పెట్టుబడికి తేలికపాటి రుణాలిచ్చి, సబ్సిడీ మీద విద్యుత్తునిచ్చి రైతులను ప్రోత్సహించడం తప్పనిసరి అవుతుంది. గ్రౌండ్‌వాటర్ రీచార్జ్ స్కీముల వంటి వాటిని కూడా చేపట్టవచ్చు. అలాంటి చోట పాత చెరువులను పునరుద్ధరించటంలాంటివి చేయవచ్చు.
- పోలవరం ప్రాజెక్ట్‌కు సంబంధించి కమిటీ ఇచ్చిన అభిప్రాయం చాలా ముఖ్యమైంది. అంతపెద్ద ప్రాజెక్ట్‌కన్నా గోదావరి మీద మూడు చిన్న ప్రాజెక్టులు నిర్మించినట్లయితే తెలంగాణా భూమి ఎక్కువ మునిగి పోకుండా వుండేదనేది ఆరోపణ. కమిటీ వ్యక్తంచేసిన అభిప్రాయం ఇది.

    అ) పోలవరం ప్రాజెక్ట్ చాలాకాలం క్రితమే గోదావరి జలాల వివాద ట్రిబ్యునల్ అంగీకరించిన ప్రాజెక్టులలో ఒకటి. 80 TMC ల గోదావరి జలాన్ని కృష్ణానదికి మళ్లించడం ద్వారా మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌ల మధ్య ఈ మళ్లించిన నీటిని పంపిణీ చేయటం ఈ ప్రాజెక్ట్ తొలిలక్ష్యం. ఆంధ్రప్రదేశ్ వాటాగా వచ్చే నీటి దామాషా ప్రకారం తెలంగాణా వాటా తెలంగాణాకి వస్తుంది. ఆ విధంగా తెలంగాణా కొంత భూమిని నష్టపోయినా, ప్రాజెక్ట్ వలన లాభం పొందుతుంది. ఈ దశలో ఈ ప్రాజెక్ట్‌ని ఆపాలని ప్రయత్నించడం సబబుకాదని కమిటీ స్పష్టీకరిం చింది. A Demand for stopping the project at this stage appears misconceived (పేజీ 207) అన్నది ఈ నివేదిక!

- ఇచ్చంపల్లి ప్రాజెక్ట్‌ను పట్టించుకోలేదనే ఆరోపణ గురించి ప్రస్తావిస్తూ, అది పెద్ద ఎత్తున అటవీ భూమిని ముంచెత్తడం వలన ఆదివాసీ ప్రజలకు పునరావాసం కల్పించుకున్న ప్రాజెక్టు. పర్యావరణ, అటవీశాఖల అనుమతుల అవసరం. దీని గురించిన ఆరోపణలు కూడా అపోహలేనని కమిటీ ప్రకటించింది.

అయితే తెలంగాణా వారి ఆరోపణలన్నింటినీ కమిటీ అపోహలుగానే కొట్టేసిందనే భావన కూడా సరికాదు. జలవనరులు నీటిపారుదల రంగంలో నిపుణులు నిర్ధారించినవి వాస్తవమైన అంశాలుగా కూడా వున్నాయి. వాటిని కమిటీ ఒక్కటొక్కటే వివరించింది.

1) కృష్ణానది మీద శ్రీశైలం ప్రాజెక్ట్ కేవలం విద్యుత్ అవసరాలకు మాత్రమే ఉద్దేశించిన ప్రాజెక్ట్. తక్కువ నీటిని తీసుకోవటానికి ఈ ప్రాజెక్టు డిజైన్ చేయబడింది. "Minimum Draw Down Level (MODL)" చాలా తక్కువగా వుండేలా ఈ ప్రాజెక్ట్‌ని రూపొందించారు. ఆ తరువాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ తక్కువ నీటిని తీసుకునే పథకాన్ని ఎక్కువ తీసుకునేదిగా మార్చింది. అంటే MDDL ని పెంచింది. శ్రీశైలం జలాలను తేలికగా వాడుకునే అవకాశం కలగడంతో తెలుగు గంగ, శ్రీశైలం కుడి కాలువ ప్రాజెక్టులు కోస్తా, సీమలలో చేపట్టటం జరిగింది. 18 TMC ల జలాలు చెన్నై నగరానికి 19 TMC లు శ్రీశైలం కుడి కాలువలోకి మళ్లించారు. మిగులు జలాలను స్వేచ్ఛగా వాడుకునే హక్కు ప్రకారం పోతిరెడ్డిపాడు రెగ్యులేటర్, శ్రీశైలం ఎగువ ప్రవాహన నిర్మించేందుకు నిధులు విడుదల చేశారు. న్యాయపరమైన హక్కులు, సాంకేతిక అంశాలు, ప్రాజెక్ట్ భద్రత వంటి విషయాలను పరిగణనలోకి తీసుకోకుండానే ఈ ప్రాజెక్ట్ నిర్మాణానికి తలపడినట్లు కన్పిస్తోంది. కృష్ణాజలాల వివాద ట్రిబ్యునల్ దృష్టిలో కూడా ఇది వుందని కమిటీ అభిప్రాయ పడింది.

- నాగార్జునసాగర్ ఎడమ కాలువ విషయంలోని ప్లానింగ్‌ని మార్పుచేసి, తెలంగాణాకు పూర్తిగా దక్కకుండా, ఈ కాలువని ఒక సరస్సులో కలిసేట్లు చేశారని, అందువలన ఈ కాలువ ద్వారా నీటిని సాగుభూములకు అందించకుండా పోయిందనే ఆరోపణని కమిటీ అర్థం చేసుకోదగినదిగా భావించింది. కొన్ని ఎత్తిపోతల పథకాలను ఈ కాలువకు అనుసంధానం చేసినప్పటికి ఆరోపణలో పసవుందని కమిటీ భావించింది.
- జూరాల, NLBC లాంటి చిన్న ప్రాజెక్ట్‌లు, పెద్ద సాంకేతిక పరిజ్ఞానం అవసరం లేనివి కూడా అసాధారణ ఆలస్యం చేశారనే ఆరోపణని ప్రస్తావిస్తూ, కర్నాటక రాష్ట్రం జూరాల కోసం, మహారాష్ట్ర 'లెండి' (Lendi) ప్రాజెక్ట్‌కోసం చేయవలసిన చెల్లింపులు చేయకపోవటం ఆలస్యానికి గల కారణాలలో ఒకటిగా కమిటీ గుర్తించింది. అయితే కారణం ఏదైనా తెలంగాణాకు రావలసిన జలాలు రాకుండా

ఆగినందుకు వారి మనోవేదనని అర్థం చేసుకోవాలని కమిటీ భావించింది. తుంగభద్ర మీద రాజోలిబండ నీటి మళ్లింపు ప్రాజెక్టు పూర్తయితే, తెలంగాణాకు పెద్దగా వచ్చే జలాలు ఏమీ లేవనే ఆరోపణని ప్రస్తావిస్తూ తుంగభద్ర బోర్డు, కర్నాటక ప్రభుత్వాల పాత్రతో కూడిన ప్రాజెక్ట్‌గా దీనిని కమిటీ భావించింది.

- కాకతీయ కెనాల్ సామర్థ్యాన్ని తగ్గించారని, శ్రీరామ్‌సాగర్‌ని పూడిపోయేలా చేశారని వరద కాలువని పూర్తి చేయలేదని – ఈ ఆరోపణలను ప్రస్తావిస్తూ, శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ ఇంకా చక్కగా ప్లాన్ చేసివుండాల్సిందని సాంకేతిక నిపుణుల అభిప్రాయంగా చెప్పారు. పైగా కొన్ని పంపు స్కీములు కూడా చేర్చడంతో మరింత అధ్వాన్యం కావచ్చునని చెప్పారు. ఈ విషయంలో తెలంగాణా వారు ఆందోళన పడటంలో అర్థంవుందని అన్నారు. అయితే అరచేతిలో వైకుంతం చూపించగలిగే పరిష్కారాలేవీ (easy solutions) లేవని, తక్కువ నీటిని అవసరమయ్యే పంటలు వేసుకోవటమే మంచిదని సూచించారు. కాకతీయ కాలువ సామర్థ్యాన్ని వెంటనే పెంచాలని గట్టిగా సూచించారు.

- సింగూరు-ఘన్‌పూర్-నిజాంసాగర్ ప్రాజెక్ట్ గురించి ప్రస్తావిస్తూ పాత నిజాంసాగర్ రిజర్వాయర్ బాగా పూడిపోయిందని నిపుణుల అభిప్రాయంగా చెప్పారు. సింగూరు అనేది ఈ ప్రాజెక్ట్‌కు కొంత సహకరించేదేనని, నాలుగు TMC జలాలను త్రాగు నీటికి గాను, అలాగే పరిశ్రమల కోసం మళ్లించవచ్చునని పేర్కొన్నారు. అయితే, ప్రస్తుతం మొత్తం సింగూరు జలాలను హైదరాబాద్‌కు మళ్ళించడం వలన, కృష్ణా బేసిన్‌కు అది లాభం చేకూరుస్తుందేగాని, ఘన్‌పూర్, నిజాంసాగర్ ఆయకట్టు వారికి నష్టమే కల్గిస్తుందనే ఆరోపణలో వాస్తవంగా కమిటీ గుర్తించి, తెలంగాణా ప్రజల ఆవేదనతో ఏకీభవించింది.

కృష్ణాజలాలను హైదరాబాద్‌కు మళ్లించే పథకం వేగంగా అమలైతే, సింగూరు జలాల మళ్లింపు ఆపవచ్చని సూచించింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కొన్ని High Lift స్కీములను గోదావరి మీద చేపట్టి, ఎత్తయిన తెలంగాణా పీఠభూమికి నీటిని మళ్లించే ప్రయత్నాలు కొన్ని ప్రారంభించింది. కొందరు తెలంగాణా వాదులు దీన్ని మంచి ఆలోచనగా అంగీకరించారు. అయితే, చాలా మంది ఇది ఆచరణ సాధ్యంకానిదిగా భావించారు. వీటిని చేపట్టబోయే ముందు నిపుణులతో కలిసి గట్టిగా చర్చించి నిర్ణయాలు తీసుకోవాల్సి వుంటుంది. ప్రాణహిత దిగువ ప్రవాహాల మీద కొన్ని బ్యారేజీలు నిర్మించి, చిన్న చిన్న ఎత్తిపోతలతో స్థానికంగా నీటిని పొలాలకు మళ్లించవచ్చని తెలంగాణావాదులు సూచిస్తున్నారు. ఈ సూచనని జాగ్రత్తగా అధ్యయనం చేసి, కొంతమేరయినా తెలంగాణా దిగువ ప్రాంతాలకు

నీటిని అందించేందుకు కృషి చేయవలసివుందని ప్రభుత్వానికి శ్రీకృష్ణ కమిటీ సూచించింది.

- రాయలసీమ వారి సమస్యలకొస్తే, 1951లో ప్రారంభమైన కృష్ణా పెన్నా ప్రాజెక్ట్ 500 TMC జలాలను రాయలసీమకు అందించవలసి వుంది. తెలుగు గంగ ప్రాజెక్ట్ దాని తర్వాత ప్రారంభం అయ్యింది. శ్రీశైలం నుంచి 112 TMC జలాలను పోతిరెడ్డిపాడు రెగ్యులేటర్ ద్వారా రాయలసీమకు 30 రోజులలోగా అందించవలసి వుంది. ఈ ఆరోపణపై నిపుణుల అభిప్రాయం తీసుకున్న తర్వాత కృష్ణ కమిటీ ఈ విధంగా వ్యాఖ్యానించింది. 1951 ప్రణాళిక ప్రకారం 500 TMC జలాలను రాయలసీమకు అందించే విషయాన్ని కృష్ణా జలాల వివాద ట్రిబ్యునల్ కేటాయింపులకు అనుగుణంగా లేదని కమిటీ భావించింది. కర్నూలు, కడప కాలువ ద్వారా 19 TMC ల జలాలు పొందే హక్కుందని గుర్తు చేసింది. ఎగువ ప్రవాహం మీద ప్రాజెక్టులు కట్టినప్పుడు దిగువ ప్రాంతాలకు మిగులు జలాల మీద హక్కు వున్నా లేనిదే అవుతుంది. సీమవారి ఆరోపణని కమిటీ అంగీకరించలేదు.
- సీమలో కాలువల మరమ్మత్తుని పట్టించుకోవడం లేదనే ఆరోపణ వాస్తవమేనని కమిటీ గుర్తించింది. వాటి పూడికలను ఎప్పటికప్పుడు తీసి, కాలువలను జాగ్రత్తగా నిర్వహించకపోతే నీటిపారుదల తగ్గిపోతుంది. సీమలో ఇప్పుడు బోరుబావుల వినియోగం బాగా పెరిగింది. వాటికి తోడుగా కాలువలు కూడా అందుబాటులో వుంటే మంచిది. లైనింగ్ చేయటం గురించి ప్రస్తావిస్తూ - కాలువలకు లైనింగ్ సాధారణంగా వెయ్యరు. అందువలన భూమిలోకి నీరు ఇంకే ప్రక్రియ తగ్గిపోతుంది. భూగర్భజలాలు అందకుండాపోతాయి. దానికన్నా, కాలువలలో పూడికతీయడం వంటి పద్ధతులే మెరుగైనవని కమిటీ అభిప్రాయపడింది.
- 181 TMC జలాలను కృష్ణాడెల్టాకు కృష్ణాజలాల వివాద ట్రిబ్యునల్ తీర్పు చెప్పగా, వాటిలో 20 TMC జలాలను తెలంగాణాలోని 'భీమా' ప్రాజెక్ట్‌కు మళ్లించామనీ, తెలంగాణా జూరాల ప్రాజెక్ట్‌కు కేటాయించే జలాలు వాస్తవానికి నెల్లూరుకు అందవలసినవని కోస్తావారి ఆరోపణని ప్రస్తావిస్తూ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో జలాలను ప్రాంతాల వారిగా కేటాయించిన కృష్ణాజలాల ట్రిబ్యునల్ తీర్పులో మార్పు చేసే అధికారం ప్రభుత్వానికి వుందని, అయినా, కృష్ణాడెల్టాకు ప్రస్తుతం 181 TMC లకన్నా ఎక్కువ నీరే విడుదల అవుతోందని కమిటీ అభిప్రాయపడింది. జూరాల ప్రాజెక్ట్‌కు కృష్ణా ట్రిబ్యునల్ ఆ ప్రాంతానికి జరుగుతున్న అన్యాయాన్ని సరిదిద్దడం కోసం అదనపు జలాలనిచ్చి ప్రోత్సహించింది. కాబట్టి ఈ ఆరోపణలన్ని అపోహాలేనని కమిటీ అభిప్రాయపడింది.

- శ్రీశైలం కుడి కాలువ 1981లో ఆమోదించబడింది. ఇంకా పూర్తి కాలేదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ కాలువని తెలుగు గంగతో ముడిపెట్టి 15 TMC నీటిని చెన్నైకి మళ్లించేందుకు సమాయత్తమైంది. మిగులు జలాల హక్కుని ఉపయోగించుకొని శ్రీశైలం కుడి కాలువ పనిని కొనసాగించాలని నిర్ణయించుకొంది. కాబట్టి దీని గురించి కోస్తా, సీమ ప్రాంతాల వారి ఆరోపణలు అపోహాలేనని కమిటీ భావించింది.
- శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్, వరద కాలువలను దిగువ ప్రాంతాల వారి ప్రయోజనాలకు విరుద్ధంగా ఉపయోగిస్తున్నారనే ఆరోపణని ప్రస్తావిస్తూ, వైనగంగ, ప్రాణహిత, శబరి, ఇందిరావతి మొదలైన జలాలు దిగువ ప్రాంతాలు పొందుతున్న సంగతిని గుర్తించింది. ఈ ఆరోపణ కూడా అపోహగానే కమిటీ భావించింది.
- గోదావరి ఎగువన పెద్ద ఎత్తున ఎత్తిపోతలని చేపడితే గోదావరి ఎండిపోతుందనే భయాందోళనలను కమిటీ ప్రస్తావిస్తూ, ఇందులో పసలేదని భావించింది. అసలు ఈ ఎత్తిపోతలు అసాధ్యం అని, అనవసరం అని తెలంగాణావారే వ్యతిరేకిస్తున్న విషయాన్ని కమిటీ ఇక్కడ గుర్తు చేసింది.
- గోదావరి జలాలను నిలవచేయడం డెల్టా ప్రయోజనాల రీత్యా అవసరం అనే విషయాన్ని ప్రస్తావిస్తూ కమిటీ ఇలా వ్యాఖ్యానించింది. కృష్ణా, గోదావరి డెల్టాలు భారతదేశంలోనే ధాన్యాగారాలుగా ప్రసిద్ధి పొందాయి. జాతీయ ప్రయోజనాల దృష్టితో కూడా కృష్ణా, గోదావరి డెల్టాలను పరిరక్షించవలసిన అవసరం ఎంతైన ఉంది. జలాలను నిలవబెట్టె ఏర్పాట్లు కూడా డెల్టాలకు అవసరమే! ఇరుంపల్లి, ఇందిరావతిపైన విద్యుత్ అవసరాలకు జలాలను నిలవచేసే ప్రాజెక్టుల్లాంటివి ఛత్తీస్ఘర్ అటవీశాఖ అభ్యంతరాలు కారణంగా ఆలస్యం అవుతున్నాయి. పోలవరం కొంతమేర ఈ అవసరాన్ని తీర్చగలదు. అది వెంటనే పూర్తి కావలసి వుంది. ఈ కోరికలో అసమంజసత్వం ఏమీ లేదు. ప్లాన్ ప్రకారం పోలవరం దక్షిణం పూర్తి కావాలి. మునక ప్రాంతాలలోని ప్రజల పునరావాసానికి తగిన పటిష్టమైన చర్యలు కూడా తీసుకోవాలని కమిటీ అభిప్రాయపడింది.
- నాగార్జునసాగర్ ప్రాజెక్ట్తో సహా కోస్తా, సీమలలోని ప్రాజెక్టులు వేటిని సరిగా పట్టించుకోవటంలేదనే ఆరోపణని ప్రస్తావిస్తూ, కాలువల మరమ్మత్తు వెంటనే చేపట్టి నీటిపారుదల సక్రమంగా జరిగేలా చూడాలని కమిటీ సూచించింది.
- మూడు ప్రాంతాల ప్రయోజనాలను కాపాడుతూ, తగిన చర్యలు ఎప్పటికప్పుడు తీసుకొంటూ రాష్ట్ర ప్రభుత్వం జలవనరుల అభివృద్ధికి తోడ్పడాలని కమిటీ భావించింది. అందుకు కొన్ని సంస్కరణను కమిటీ సూచించింది.

ఈ నివేదికని అర్థం చేసుకోవడానికి పెద్ద మనసు కావాలి. అందరి ఆరోపణల్ని, అందరి కోరికల్ని, అందరి ఎదురుదాడుల్ని కమిటీ శ్రద్ధగావింది. ఏ విషయానికి ఆ విషయంగా తన తీర్పును చెప్పింది. ఎవరి పక్షమూ వహించలేదు. ఎవరినీ విరోధించలేదు. అలా చేయవలసిన అవసరం ఈ కమిటీకి లేదు.

ఇప్పుడు జరగవలసింది ఒక్కటే - మేమన్నట్లు జరగలేదు, మేము కోరినట్లు రాయలేదు, మామాట చెల్లలేదు - లాంటి ఉపన్యాసాలతో ఉపయోగం లేదు. వాస్తవాలు తెలుసుకోవడానికి ఎవరూ చెయ్యని అధ్యయనం ఈ కమిటీ చేసింది. ఎవరికివాళ్ళు ఎదుటి వాళ్లను వేలెత్తి చూపించారు. కాని, నాలుగు వేళ్లు తమనే చూపించాయని ఈ నివేదిక చదివితే అర్థం అవుతుంది.

కాబట్టి ఓడిపోయామని ఎవరూ భావించనవసరం లేదు. గెలిచామని ఎవరూ సంబరపడనవసరం లేదు. అందరూ గెలిచేదే అసలు గెలుపు అనే బుద్ధ వాక్యానికి ఈ కమిటీ అద్దం పట్టింది!

**జలవినియోగ సంఘం Water Management Board**

పాత అనుభవాలను దృష్టిలో పెట్టుకొని, ఒక స్వతంత్రమైన చట్టపరమైన, సాధికారికమైన, సాంకేతికమైన జలవినియోగ సంఘం కృష్ణా, గోదావరి ఇంకా ఇతర నదీ పరివాహక ప్రాంతాలకు ఉపయోగకరంగా ఉండేలా మూడు ప్రాంతాల ప్రయోజనాలూ నెరవేర్చేదిగా ఉండాలని కమిటీ సూచించింది.

రాష్ట్రంలో ఒక ప్రాంతంనుంచి ఇంకొక ప్రాంతానికి నీటిని మళ్లించే అంశాలు, ప్రాజెక్టుల లక్ష్యాలు, వాటికి బడ్జెట్ అంచనాలు, ఇవన్నీ సమతుల్యంగా వుండే విధంగా ఈ బోర్డు సమన్వయాన్ని సాధించగలుగుతుంది. తగినంత నీటిని అందించగలగాలి!

సాంకేతికపరంగా మరియు నిర్వహణాపరంగా నీటి అందుబాటు, కేటాయింపు, విడుదల, నీటిపారుదల ప్రాజెక్టుల అనుమతి, విషయాలను ఈ బోర్డు పరిధిలో వుంచాలి. నీటిపారుదలకు సంబంధించి ఒక మాస్టర్‌ప్లాన్ తయారుచేసి దాని ప్రకారం పూర్తి స్థాయిలో నీటి వినియోగం జరిగేలా ఈ బోర్డు బాధ్యత వహించాలి.

ఈ బోర్డు చేసిన నిర్ణయాలు, సూచనలు సాధికారికమైనవి అమలు జరిపి తీరేలా చట్టబద్ధత వుండాలి. ప్రభుత్వానికి ప్రత్యేకమైన అభ్యంతరం ఏదైనా వుంటే తప్ప, నీటి పారుదల రంగానికి సంబంధించిన అంశాలు అమలు జరగవలసిందే! ప్రభుత్వ పక్షాన వుండే భిన్నాభిప్రాయాన్ని బోర్డుకు నివేదించి పునఃపరిశీలనని కోరవలసి వుంటుంది. వార్షిక నివేదికని బోర్డు అసెంబ్లీకి సమర్పించవలసి వుంటుంది.

ఈ బోర్డు చైర్మన్‌గా వ్యవహరించే వ్యక్తి కేంద్ర ప్రభుత్వం నుంచి డిప్యుటేషన్ పద్ధతిలో పనిచేసే ఎడిషనల్ సెక్రటరీ హోదా కలిగివుంటాడు. ఈ నియామకాన్ని కేంద్ర ప్రభుత్వమే జరపవలసి వుంటుంది. నీటిపారుదల రంగంలో సీనియర్ నిపుణుడుగా ఈ రాష్ట్రానికి చెందని వ్యక్తి చైర్మన్‌గా వ్యవహరిస్తారు, కృష్ణకు దక్షిణ పరివాహక ప్రాంతానికి ఒకరిని, గోదావరికి ఎగువ ప్రాంతానికి ఒకరినీ, బోర్డు పాలన కోసం ఒకరినీ, ఆర్థిక అంశాలకు ఒకరినీ, పర్యావరణాంశాలకు ఒకరినీ సభ్యులుగా ఈ బోర్డును వ్యవస్థీకరించాలి.

ఈ ఐదుమంది సభ్యులను రొటేషన్ పద్ధతిలో ఇద్దరిని తెలంగాణా, ఇద్దరిని కోస్తా, ఒక్కరిని సీమ ప్రాంతాల నుంచి ఎంపిక చేసుకోవాల్సి వుంటుంది.

భాక్రా, బియాస్, తుంగభద్ర, నర్మద దామోదర లోయ, బ్రహ్మపుత్ర, బెత్నా నదులకు సంబంధించిన సంఘాలు ఇలాంటి లక్ష్యాల సాధనకే ఏర్పాటయ్యాయి. ఇతర దేశాలలో కూడా అమెరికాలో టెన్నెస్సీ లోయ అధారిటీ ప్రాజెక్టుల ప్లానింగ్, నిర్మాణం, నిర్వహణ లాంటి బాధ్యతలన్ని అప్పగించారు. ఆస్ట్రేలియాలో "ముర్రే–డార్లింగ్ అధారిటి" అంతర్రాష్ట్ర జలాల నిర్వహణని చూసేందుకు ఇలానే ఏర్పడింది.

ఇది రాష్ట్ర సమైక్యతని, సమతుల్యతని కాపాడే ఒక ప్రయత్నంగా బోర్డు భావించింది. ఒకవేళ రాష్ట్రాన్ని విడదీయటమే అనివార్యం అయితే కొత్తరాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ప్రక్రియకు కూడా ఈ బోర్డు ఉపయోగపడ్తుంది. కాబట్టి, తక్షణం దీన్ని ఏర్పాటు చేయవలసిందిగా కమిటీ సూచించింది.

శ్రీకృష్ణ కమిటీ చేసిన ఈ సూచన వేచి చూసేది, తీరుబడిగా ఆలోచించేది కాదు. దేశంలో ఇన్ని బోర్డులు నీటి వినియోగం, నిర్వహణ అంశాలను పరిపాలిస్తున్నవి వుండగా, మన రాష్ట్రంలో వానిమీద సరిఅయిన దృష్టి పెట్టనే లేదు. ప్రత్యేక రాష్ట్రాన్ని ఇచ్చే నిర్ణయం చేసినా చీలిక జరిగేవరకూ నిర్వహణని ఈ బోర్డుకు అప్పగించేందు కోసం దాన్ని వెంటనే వ్యవస్థీకృతం చేయాల్సి వుంది.

## నీటిపారుదల / జలవనరుల అభివృద్ధి సంస్థ

## Irrigation / Water resources corporation

మూడు ప్రాంతాలకు వర్తించే విధంగా ఆంధ్రప్రదేశ్‌కు తక్షణం ఒక నీటిపారుదల / జలవనరుల అభివృద్ధి సంస్థని ఏర్పాటు చేయడం అవసరం. ప్రస్తుతం పనిచేస్తున్న ఇరిగేషన్ డెవలప్‌మెంట్ కార్పోరేషన్ లిమిటెడ్ ఆశయాలు, లక్ష్యాలు, విధులు కంపెనీ చట్టం 1956 ప్రకారం అది ఏర్పడిన విధానం అన్నింటిని పరిశీలించిన తరువాత దానికి సంబంధించిన ఈ కింది మార్పులు సూచిస్తూ ఒక కొత్త కార్పొరేషన్‌గా రూపుదిద్దా లని కమిటీ తన నివేదికలో సూచించింది.

నీటిపారుదల అభివృద్ధి, నీటిపారుదల సామర్థ్యం, పారిశ్రామిక రంగానికి నీటిని అందించటం, ప్రజారోగ్యానికి సంబంధించిన అంశాలు ఇప్పుడున్న కార్పొరేషన్ లిమిటెడ్ నిర్వహిస్తోంది. అదనంగా కమిటీవారు ఈ సూచనలు చేస్తున్నారు.

1) భూగర్భ జలాలు, గృహావసరాలకు శుద్ధిచేయని నీళ్ళు అందించడం, వర్షాధార వ్యవసాయం, చెరువులు, చెరువుల మరమ్మతులు - ఇవన్నీ స్థానిక సంస్థలు పంచాయితీలు, స్వచ్ఛంద సంస్థల సహకారంతో నిర్వహించడం.

2) ఉపరితల జల ప్రవాహాలు, భూగర్భజలాల నాణ్యత, వాటి అభివృద్ధికి తీసుకోదగిన చర్యలు, రాష్ట్ర కాలుష్య నివారణ సంఘంలో సమన్వయం లాంటి బాధ్యతలు అదనంగా నిర్వహించాలి.

3) ఈ కార్పొరేషన్ అన్ని ప్రాజెక్టుల నుంచి నీటి పారుదలనీ, ప్రజావసరాలకు, పారిశ్రామిక అవసరాలకు నీటినీ అందించే బాధ్యత తీసుకోవాలి.

**పాలనాయంత్రాంగం**

ఈ కార్పొరేషన్‌కు ఒక చైర్మన్ మరియు మేనేజింగ్ డైరెక్టర్, ఇద్దరు లేక ముగ్గురు డైరెక్టర్లు (రెండు లేక మూడు ప్రాంతాలకు ప్రతినిధులు) ఒక ఫైనాన్స్ డైరెక్టర్, ఒక పాలనా వ్యవహారాల డైరెక్టర్ వుండగా, భూగర్భ జలాలు, నీటినాణ్యత, జల కాలుష్యాలకు సంబంధించి ఇంకొక డైరెక్టర్ వీరుకాక పూర్తికాలం గాని, తీరిక సమయాలలోగాని పనిచేసే మరికొందరు డైరెక్టర్లు - వీళ్లంతా నీటిపారుదల, జలవనరుల రంగాలలో నిపుణులైన వారై వుండాలి.

ఛైర్మన్ చీఫ్ మేనేజింగ్ డైరెక్టర్‌గా పూర్తిస్థాయిలో పనిచేసే వ్యక్తి వుండాలి. ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి ఈ కార్పొరేషన్‌లో అధికారిక హోదాలో సభ్యుడుగా వుంటారు. అదనంగా ఒక మేనేజింగ్ డైరెక్టరును ఏర్పరచుకోవచ్చు.

ఈ కార్పొరేషన్ పాలక వర్గాన్ని ముఖ్య కార్యదర్శి ఆధ్వర్యంలో ఒక కమిటీ నిర్ణయిస్తుంది. చైర్మన్‌గా ఉండే వ్యక్తి కేంద్ర జలసంఘంలో ఉన్నతాధికారి హోదాలో వుండాలి. సెక్రటరీ స్థాయివారు సభ్యులుగా వుంటారు.

అవసరం అనుకొంటే ఇంకొక స్వతంత్ర కమిటీని కూడా ఈ లక్ష్యసాధనకు నియమించవచ్చు. ప్రాంతాల వారీగా నీటి పారుదల జలవనరుల అభివృద్ధి కోసం ప్రత్యేక కార్పొరేషన్లు కూడా ఇదే తరహాలో నియమించవచ్చు.

ప్లానింగ్ కమీషన్ అంగీకరించిన వేరొక నిధులు, రాష్ట్ర ప్రభుత్వ నిధుల నుంచి కొంత, బాండ్లు విడుదల చేయటం ద్వారా కొంత కార్పొరేషన్ సమీకరించే నిధుల

ద్వారా కార్పొరేషన్ లేదా కార్పోరేషన్‌లు పని చేయాలి. బాండ్లు విడుదల చేసేట్లయితే దానికి రాష్ట్ర ప్రభుత్వం హామీగా వుండాలి. మూడు ప్రాంతాల సమాన అభివృద్ధికి అంకితంగా ఈ మొత్తం కార్యక్రమాలను నిర్వహించాలి.

ఇలా అనేక విధివిధానాలను మార్గదర్శకాలను కమిటీ లోతుగా అధ్యయనం చేసి సూచనలు చేసింది. నీటిపారుదల, జలవనరుల అభివృద్ధి క్రమంలో ఈ సూచనలను సంస్కరణలుగా కమిటీ భావించింది.

మనిషి ఎప్పుడూ "రొటీన్"లో జీవిస్తూ వుంటాడు. ఏదో ఒక సంఘటన జరిగితే తప్ప మారడు. ఇది మానవ సహజ విషయం. సంఘటన తరువాతనైనా మారకపోవడం అనేది విజ్ఞతకాదు. రాష్ట్రం విడిపోయిన తరువాత ఇలాంటి సమస్యలు తలెత్తవన్న హామీ ఏమైనా వుందా ? విడిపోవటం ఒక్కటే పరిష్కారం అనడానికి తగిన ఉపపత్తి కమిటీ దృష్టికి రాలేదు. అందువలన, విడిపోయినా, విడిపోకపోయినా ఈ కమిటీ సూచనలు మంచి పాలనా వ్యవస్థను అందిస్తాయని, అన్ని ప్రాంతాల వారికి మేలు కల్గిస్తాయనీ మనం విశ్వసించవచ్చు.

విడిపోవటం అనేది కేవలం రాజకీయ నిర్ణయం. దానికి సాంకేతిక రంగులుపుల మడం అనవసరం... ప్రజాసమస్యలే ముఖ్యకారణం అయితే, వాటికి నిర్మాణాత్మక ప్రత్యామ్నాయాలు పరిష్కారాలు ఎన్నింటినో కమిటీ సూచిస్తోంది. విభజించినా, కలిపే ఉంచినా, రెండింటినీ రాజకీయ నిర్ణయాలే ప్రభావితం చేస్తాయి. రాజకీయ నాయకులే ఎవరి ప్రాబల్యాన్ని వాళ్లు ప్రదర్శిస్తున్నారు.

ఇప్పుడు విజ్ఞాత చూపించవలసింది మూడు ప్రాంతాల ప్రజలు - రాజకీయ శక్తుల నుంచి దాన్ని ఆశించడం కష్టం కాబట్టి!!

## నాల్గవ అధ్యాయం - రెండవ భాగం

## ఆంధ్రప్రదేశ్‌లో విద్యుత్ రంగం - అభివృద్ధి

నీటిపారుదల జల వనరుల అభివృద్ధి తర్వాత విద్యుత్ రంగం గురించి కమిటీ అధ్యయనాంశాలను ఈ నివేదికలో అందించారు.

దక్షిణాదిలో ఆంధ్రప్రదేశ్ పెద్దరాష్ట్రం. 2,75,100 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంలో, 974 కి.మీ. సముద్ర తీరం కలిగివుండి, గోదావరి, పెన్న, వంశధార లాంటి పెద్ద నదులు ప్రవహిస్తున్న భూమి.

ఈ విద్యుత్ రంగం పూర్వాపరాలను, విద్యుత్ వినియోగాన్ని చారిత్రాత్మకంగా విశ్లేషించింది కమిటీ ఈ నివేదికలో! విద్యుత్ వినియోగానికి సంబంధించిన అనేక వివరాలు

మనకు ఈ నివేదికలో కన్పిస్తాయి.

- 2009-10 సం॥లో ఆంధ్రప్రదేశ్ 10880 MW విద్యుత్‌ను ఉత్పత్తి చేయగలిగింది.
- వాస్తవానికి 12010 MW విద్యుత్ అవసరం ఈ రాష్ట్రానికి వుంది. అంటే 1130 MW (-9.41%) విద్యుత్తు తరుగులో మన రాష్ట్రం వుంది.
- 74,859 మెగా యూనిట్ల విద్యుత్‌నే ఈ కాలంలో సరఫరా చేయగలిగింది. 79,201 మెగా యూనిట్ల అవసరం వుండగా 4,342 మెగా యూనిట్ల విద్యుత్ (-5.48%) తరుగులో మనం ఉన్నాం.

**Generation installed capacity (MW) As on 30-06-2010**

| Region | Total Installed Capacity | Thermal Generation installed Capacity |
|---|---|---|
| Telangana | 4368 | 1783 |
| Rayalaseema | 1840 | 840 |
| Coastal Andhra | 5242 | 1760 |
| **State own capacity in MW** | **11450** | - |
| Inter state | 148 | - |
| Central Generating Stations | 3049 | - |
| **Total capacity in MW** | **14648*** | **4383** |

***Source :*** *APtransco / APgenco* **rounded*

ప్రాంతాలవారీగా ఉత్పత్తి సామర్థ్యాన్ని అంచనా వేసినప్పుడు తెలంగాణాలో ఉత్పత్తి సమర్థత తక్కువగా వుంది. అయినా, తెలంగాణాకు విద్యుత్ పూర్తిస్థాయిలోనే అందుతోందని కమిటీ అభిప్రాయపడింది. అయితే ధెర్మల్ విద్యుత్ ఉత్పత్తి కోస్తా, తెలంగాణాలలో సమానంగానే వుండటానికి కారణం తెలంగాణాలో బొగ్గు గనులు వుండగానే, సింగరేణి నుంచి, తల్లార్ గనుల నుంచి, బైట దేశాల నుంచి కోస్తా ప్రాజెక్టుకు బొగ్గు దిగుమతి అవుతోంది.

జలవిద్యుదుత్పత్తి 68% తెలంగాణా నుంచి జరుగుతోంది. తెలంగాణాలోనే రెండు పెద్ద నదులు కృష్ణ, గోదావరి అడుగుపెట్టడం ఇందుకు కారణం. రాయలసీమ, కోస్తాలకన్నా ఎత్తయిన ప్రాంతం నుంచి దిగువకు జలాలు వస్తుంటాయి. కాబట్టి తెలంగాణా ప్రాంతంలో జల విద్యుత్ ప్రాజెక్టులకు ఎక్కువ అనుకూలత వుంది.

**Region and District wise Hydro Power Stations installed capacity in A.P. (as on 30-06-2010)**

| Name of the Project | Capacity (MW) | Location |
|---|---|---|
| | **Telangana** | |
| Srisailam Left Bank PH | 900 | Mahaboobnagar |
| Jurala | 117 | Mahaboobnagar |
| Nagarjunasagar Main PH | 816 | Nalgonda |
| Nagarjunasagar Left Canal PH | 60 | Nalgonda |
| Mini Hydel* | 6 | Nalgonda |
| Singur | 15 | Medak |
| Mini Hydel* | 2 | Karimnagar |
| Lower Sileru | 460 | Khammam |
| Mini Hydel | 2 | Khammam |
| Nizam Sagar | 10 | Nizamabad |
| Pochampadu | 27 | Nizamabad |
| Mini Hydel | 12 | Nizamabad |
| **Telangana Total** | **2427** | |
| | **Rayalaseema** | |
| Penna Ahobilam | 20 | Ananthapur |
| Srisailam Raight Bank PH | 770 | Kurnool |
| **Rayalaseema Total** | **790** | |
| | **Coastal Andhra** | |
| Upper Sileru | 240 | Visakapatnam |
| Donkarai | 25 | East Godavari |
| Nagarjunasagar Right Canal PH | 90 | Guntur |
| **Costal Andhra Total** | **355** | |
| **State Total** | **3572** | |

Source : APtransco /APjenco. Note: *Indicates private projects.

గ్యాస్ ఆధారిత ప్రాజెక్టులు తెలంగాణా రాయలసీమల్లో లేవు. 38 గ్యాస్ ఆధారిత ప్రాజెక్టులు 9,536 MW విద్యుత్‌ను ఉత్పత్తి చేసే సమర్థతలో పనిచేసేవి వుండగా 58% గ్యాస్ మాత్రమే అందజేయడంతో ఈ ప్రాజెక్ట్‌లు పూర్తి స్థాయిలో పనిచేయలేకపోతున్నాయి. డీజిల్, ఇంకా ఇతర సాంప్రదాయ ఇంధనాల ఆధారంగా పనిచేసే విద్యుత్ ప్రాజెక్టులు కోస్తాలో 37 MW విద్యుత్‌ను అందించే సమర్థత కల్గినవి పని చేస్తున్నాయి. తెలంగాణాలో 159 మెగావాట్లు సీమలో 444 మెగావాట్ల సమర్థత కల్గిన ప్రాజెక్టులున్నాయని గణాంక వివరాలు చెప్తున్నాయి. హైదరాబాద్ నగరానికి సంబంధించి విద్యుత్ అభివృద్ధికి చెందిన వివరాలు కూడా పొందుపరిచారు.

విద్యుత్ రంగాన్ని ఆధునీకరించాలని, విద్యుత్ పంపిణీ సామర్థ్యాన్ని పెంచాలని, కొన్ని సబ్‌స్టేషన్ల ఏర్పాటు, నాణ్యమైన విద్యుత్ సరఫరా మొదలైన అంశాలను తన నివేదికలో కమిటీ ప్రస్తావించింది.

## విద్యుత్ సమస్యలు

ప్రాజెక్టుల ఏర్పాటులో వివక్షతని ఎత్తి చూపుతూ వచ్చిన ఆరోపణలు, సింగరేణి, ఇతర ప్రాంతాల నుంచి బొగ్గు బైటకు తరలిపోవటం లాంటి అంశాలను కమిటీ అధ్యయనం చేసింది. అంశాలవారిగా తన అధ్యయనాంశాలను వివరించింది.

మౌలికంగా ఇవన్నీ సాంకేతిక పరమైన అంశాలు. వీటిని పరిశీలించేందు కోసం శ్రీ వి.బి.గుప్తా, (పూర్వపు చీఫ్ ఇంజనీర్, కేంద్రీయ విద్యుత్ సంస్థ, కేంద్ర ప్రభుత్వ విద్యుత్ శాఖ) సహకారాన్ని కమిటీ తీసుకొంది. ఈ సాంకేతిక నిపుణుడు కేంద్ర ప్రభుత్వాలు అందించిన సమాచారాన్ని, వివిధ సంస్థలు, సంఘాలు, రాజకీయ పక్షాలు ఇతరులు అందించిన విజ్ఞాపనల్ని క్రోడీకరించి, విశ్లేషించి వ్యక్తపరిచిన అభిప్రాయాల ఆధారంగా కమిటీ నివేదికలో ఈ వ్యాఖ్యలను చేసింది.

1) గృహవసర విద్యుత్ కనెక్షన్లు 1971-72లో తెలంగాణాలో 4.19 లక్షలు వుండగా 2008-09 నాటికి 85.62 లక్షలు పెరిగాయి. రాయలసీమలో 2.91 లక్షల నుంచి 35.76 లక్షలకు పెరిగాయి. కోస్తాలో 5.3 లక్షల నుంచి 85.31 లక్షలకు చేరాయి. ఈ విధంగా చూసినప్పుడు తెలంగాణా తక్కువస్థాయి విద్యుత్ (Low Tension Services) వినియోగదారులు కోస్తాకన్నా ఎక్కువగా వున్నట్లు తేలింది. విద్యుత్ వినియోగం కూడా 351 మిలియన్ యూనిట్ల నుంచి, 18,342 మిలియన్ యూనిట్లకు చేరింది. కోస్తాలో కేవలం 10,418 మెగా యూనిట్ల వినియోగం మాత్రమే వుంది. సీమలో 6,132 మెగా యూనిట్లుంది. గృహావసరాలు, వాణిజ్యవసరాలు, పరిశ్రమలు, వ్యవసాయం ఇతర రంగాలన్నింటికి కలిపిన విద్యుత్ వినియోగంలో కూడా తెలంగాణా 30,949 మిలియన్ యూనిట్లతో అత్యధికంగా వుంది. కోస్తాలో 18,430, సమీలో 9,679 మిలియన్ యూనిట్లు మాత్రమే వుంది. పారిశ్రామికీకరణ కారణంగా తెలంగాణాలో విద్యుత్ వినియోగం ఇంత ఎక్కువగా వుంది.

**Total Connected Load HT & LT (MW)**

| Region | 1971-72 | 1981-82 | 1991-92 | 2001-02 | 2007-08 | 2008-09 |
|---|---|---|---|---|---|---|
| Telangana | 770 | 2241 | 5074 | 9432 | - | 16739 |
| Rayalaseema | 474 | 895 | 2014 | 3564 | - | 5402 |
| Coastal Andhra | 949 | 1801 | 4446 | 7491 | - | 16203 |

**Agriculture Power Consumption LT in Million KWH**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| Telangana | 154 | 376 | 4088 | 7357 | 8406 | 9274 |
| Rayalaseema | 155 | 245 | 1617 | 2508 | 3242 | 3727 |
| Coastal Andhra | 180 | 322 | 1267 | 2291 | 2821 | 3054 |

***Source** : Volume-I of 'Andhra Pradesh Statistics of Key Indicators'*

వ్యవసాయపరంగా కూడా తెలంగాణా కోస్తాకన్నా మూడు రెట్లు అధిక విద్యుత్‌ను వినియోగిస్తుంది. విద్యుత్ సబ్‌స్టేషన్లు తెలంగాణాలో 400 KV, 220 KV, 132 KV, 33 KV సబ్‌స్టేషన్లు కోస్తా, సీమలకన్నా ఎన్నో ఎక్కువ వున్నట్లు ఈ పట్టిక తెలుపుతోంది.

**Per Capita Consumption of Electricity in AP (2009-10)**

| Per Capita Consumption of Electricity in 2009-10 | | | | Expected Per Capita Consumption of Electricity in 2010-11 | |
|---|---|---|---|---|---|
| **Region** | **Total sales (MUs) in 2009-10** | **Population in millions** | **Per capita consumption of electricity (KWH)** | **DISCOMS Plan to Purchase in 2010-11** | **Per capita consumption of electricity** |
| Telangana | 30949 | 30.9 | 999 | 45249 MUs | 1191 KWH |
| **Telangana +** | **26327.1** | **23** | **1445** | - | - |
| Rayalaseema | 9679.1 | 13.5 | 716 | 38545 MUs | 777 KWH |
| Coastal Andhra | 18430.3 | 31.7 | 581 | | |
| *State* | *59058.4* | *76.2* | *775* | - | - |

****Source** : AP transco / APgenco. Note 1 : + excluding Hyderabad. Note2 : Expected Consumption is as per the filings of ARR for FY 2010-11 of the AP Power Distribution Companies to AP Electricity Regulatory Commission.*

ట్రాన్స్‌ఫార్మర్లు కోస్తాలో 211489 వుండగా తెలంగాణాలో 296522 వున్నాయి.

**Region-wise number of existing sub-station in 2010**

| **Region** | **400 KV** | **220 KV** | **132 KV** | **33 KV** |
|---|---|---|---|---|
| Telangana | 4 | 42 | 136 | 1784 |
| Rayalaseema | 2 | 21 | 53 | 772 |
| Coastal Andhra | 3 | 33 | 89 | 1158 |

***Source** : AP transco / AP gences*

తాజా లెక్కల ప్రకారం 2010-11 సంవత్సరాలలో, కేవలం తెలంగాణాలో తలసరి విద్యుత్ వినియోగం సంవత్సరానికి 1191 KWH గా వుంది. అది 2009-10 కన్నా ఇంచుమించు 200 KWH ఎక్కువ. హైదరాబాద్‌తో కలిపిన తెలంగాణాలో ఈ విద్యుత్ తలసరి వినియోగం 1445.6 KWH గా వుంది. అంటే తెలంగాణాలో కోస్తాతో పోలిస్తే వ్యక్తిగతంగా విద్యుత్ వినియోగం ఎక్కువ. సీమ-కోస్తాలలోకన్నా బోరుబావుల వ్యవసాయం తెలంగాణాలో ఎక్కువగా వుండటం ఒక కారణం కావచ్చు.

ఇలా విద్యుత్ సబ్సిడీ, విద్యుత్ రంగంలో ఉద్యోగావకాశాలు, ఇంకా అనేక సాంకేతిక వివరాలను కమిటీ అధ్యయనం చేసింది. ఏ ప్రాంతంలో విద్యుత్ వినియోగం ఎక్కువగా వుందో ఆ ప్రాంతం అభివృద్ధి పథంలో వెలుగొందుతోందన్నట్టేనని కమిటీ వ్యాఖ్యానించింది. (పేజీ 241) విద్యుదవసరాలకు తగ్గట్టుగా పంపిణీ కూడా అక్కడ శక్తివంతంగా వుందని కమిటీ భావించింది. తెలంగాణాకు ఎక్కువ విద్యుత్ వెడుతోంది. మిగతా ప్రాంతాలతో పోలిస్తే ఎక్కువ సబ్సిడీ అందుతోంది. 53% తెలంగాణాపైన, 24% రాయలసీమపైన, 23% కోస్తాపైన ఖర్చు చేసినట్లు గణాంక వివరాలు చెప్తున్నాయి.

విద్యుత్ రంగంలో ఉద్యోగావకాశాలలో వివక్షత గురించిన ఆరోపణలను పరిశీలించి, జోనల్ రూల్స్ ప్రకారం, తెలంగాణా, రాయలసీమ ప్రజల మనోభావాల కనుగుణంగా ఉద్యోగావకాశాలు కల్పించాలని కమిటీ పేర్కొంది.

విద్యుత్ ఉత్పత్తి సరఫరాల మెరుగుదలకు కొన్ని సలహాలు, సూచనలందించింది.

1) సింగరేణిని దృష్టిలో పెట్టుకొని మరికొన్ని థర్మల్ పవర్ స్టేషన్ల ఏర్పాటును కమిటీ సూచించింది.

2) పూర్వం జోనల్ విధానాన్ని విద్యుత్ రంగాల్లో పాటించకపోవటానికి ఉన్నత ఉద్యోగాలలో కొంత వివక్షత కన్పించవచ్చు. ఇప్పుడు జోనల్ వ్యవస్థ పరిధిలోకి విద్యుత్ సంస్థలకు తీసుకువచ్చారు. కాబట్టి ఆ తేడాలు ఇకముందు ఉండకపోవచ్చునని కమిటీ అభిప్రాయపడింది.

3) మరో శిక్షణా కేంద్రాలు తెలంగాణా, సీమలలో నెలకొల్పితే 'ఎ.పి.జెన్‌కో'లో 50,000 ఉద్యోగాలకు అవకాశాలు కలుగుతాయి.

4) జలవిద్యుత్‌కు సంబంధించిన శిక్షణ కేంద్రం కూడా అవసరం. శ్రీశైలం పవర్‌స్టేషన్ దగ్గర దానిని నెలకొల్పటం మంచిది.

5) 1130 MW విద్యుత్ తరుగులో మనం ఉన్నాం కాబట్టి, థర్మల్‌పవర్ స్టేషన్ల నిర్వహణ విషయంగా కొన్ని జాగ్రత్తలను కమిటీ సూచించింది. విద్యుత్ పొదుపు సూత్రాలను ప్రజల్లో ప్రచారం చేయాలని, విద్యుత్ చౌర్యాన్ని అరికట్టాలనీ, వ్యవసాయానికి ఉచిత విద్యుత్ పథకంలో, కరెంటుని వ్యవసాయేతర ప్రయోజనాలకు వాడకుండా జాగ్రత్తపడాలని కమిటీ సూచించింది.

6) ఇందిరాసాగర్ పోలవరం ప్రాజెక్ట్ పనులు 33% పూర్తి స్థాయిలో అది త్వరలోనే అందుబాటులోకి వస్తే 960 MW విద్యుత్ ఉత్పత్తి జరిగి తెలంగాణా, రాయలసీమకు అందుతుంది. 7.2 లక్షల ఎకరాలకు మేలు కలుగుతుంది.

7) ఇరుంపల్లి, కొంతనపల్లి, సింగారెడ్డి పల్లి, రాజీవ్‌సాగర్ లాంటి ఎగువ ప్రాజెక్టులకు మేలు కలుగుతుంది.

విద్యుత్‌రంగంపైన కమిటీ విశ్లేషణని బట్టి రాష్ట్రంలో మిగిలిన ప్రాంతాలకన్నా తెలంగాణా ఎంతో నాగరికంగా ఎదిగిన ప్రాంతంగా కన్పిస్తుంది.

రాజకీయ పక్షాలు స్వార్థరాజకీయ ప్రయోజనాలతో ఎప్పటికప్పుడు తెచ్చిన వత్తిడుల ఫలితంగా ఏర్పడిన తేడాలు విధాన నిర్ణయం లేని ప్రభుత్వ అసమర్థతకు తావుగానే తప్ప ఒక ప్రాంతం ప్రజలను వేరొక ప్రాంత రాజకీయ నాయకులు పేరుపెట్టి తిట్టే అంశాలుకాదని కూడా ఈ నివేదిక చదివితే అర్థం అవుతుంది. లోపాలు ఎక్కడైనా వుంటే అది స్థానిక నాయకత్వంలోనే వున్నాయి. నిందించుకోవలసింది తమని తామే ! ఏ సంబంధమూ లేని ఇతర ప్రాంత ప్రజల్ని కాదని కూడా అర్థం అవుతుంది!!

విద్య, ఆరోగ్యం, విద్యుత్, తలసరి వ్యయంలాంటి అభివృద్ధి చిహ్నాలన్నింటిలోనూ తెలంగాణా కోస్తా కన్నా ఎక్కువ అభివృద్ధినే సాధించినట్లు శ్రీకృష్ణ కమిటీ నివేదిక పేర్కొంటోంది.

అయితే విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలోని వెనుకబాటుతనం గురించి ప్రత్యేక అధ్యయనం జరిపి వుంటే ఇంకా ఎక్కువ వివరాలు వెల్లడి అయి వుండేవని చాలామంది ఈ నివేదికని చదివాక అభిప్రాయపడ్తున్నారు.

మొత్తం నివేదికలో ఈ నాల్గవ అధ్యాయం చాలా ముఖ్యమైంది. ఇతర ప్రాంతీయులు కూడా తమ ప్రాంతాలలోని వెనుకబాటుతనానికి కారణాలను అన్వేషించుకొని, తమనుతాము సంస్కరించుకొని, అభివృద్ధిపథంలో ముందుకు సాగేందుకు పునరంకితం అయ్యేలా ఈ అధ్యాయం ప్రేరణ కల్గిస్తుంది. విడిపోయినంత మాత్రానో లేదా కలిసివున్నంత మాత్రనో ఈ సమస్యలు వాటికవే పరిష్కారం అయ్యేవి కాదు. సమస్య మూలాల గురించి ఆలోచించి అసలైన పరిష్కారాలు కనుగొంటే ఓడేవారు ఎవరూ వుండరు. అందరూ గెలిచేదే అసలైన ఆట అవుతుంది.



# ఐదవ అధ్యాయం

## ప్రభుత్వోద్యోగాల అంశాలు

## PUBLIC EMPLOYMENT ISSUES

నిజాంకాలం నుంచి తెలంగాణాలో ముల్కీ నిబంధనలు స్థానికులకు ఉద్యోగావకాశాల కోసం పోరాటాల ఫలితంగా ఏర్పడ్డవే! ప్రభుత్వోద్యోగాలకోసం తెలంగాణాలో పోరాటానికి 100 ఏళ్ల చరిత్ర వుంది. ఆ సమయంలో తమిళుల కింద మద్రాసు రాష్ట్రాలలో కోస్తా, సీమ ప్రజలు నలిగిపోతూ ఏ ఉద్యోగావకాశాలూ లేక కొట్టుమిట్టాడుతున్నారు. ఆ దశలో తమిళుల బారినుంచి రక్షించుకోవటానికి ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర భావన అంకురించింది. 1919లో నిజాం తెలంగాణా వారికోసం ముల్కీ ఫర్మానా ఇచ్చాడు. అది కొంతలో కొంతమెరుగు ఆ సమయంలో ఇటువైపు ఏ రక్షణా లేకుండా కోస్తా సీమ ప్రజలు ఇంగ్లీషు పాలనలో ప్రభుత్వోద్యోగాల కోసం అర్రులు చాస్తు దిక్కులేక అల్లాడుతున్నారు.

జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ తెలంగాణా వారికి ప్రభుత్వోద్యోగాల విషయంలో వివక్షత కారణంగా అన్యాయం జరిగిందనే ఆరోపణపైన అధ్యయనంచేసి, ప్రభుత్వం చేపట్టిన చర్యలను విశ్లేషించేందుకు సాంకేతిక నిపుణులు శ్రీ ముఖేష్ కక్కర్ పూర్వపు IAS అధికారి, Institute for Regulation & Competition, New Delhi కి డైరెక్టర్ జనరల్‌గా వున్నారు - వారి సహకారం తీసుకొంది.

ముల్కీ నిబంధనలను, ముల్కీగా గుర్తించబడడానికి కావలసిన అర్హతల్ని, ముల్కీ సర్టిఫికెట్ల అంశాల్ని ముల్కీ నిబంధనలకు ప్రత్యామ్నాయ నిబంధనల్ని, రాష్ట్రాల పునర్విభజన కమిటీ నిర్ణయాల్ని, ఆంధ్రప్రదేశ్ ఏర్పడే సమయంలో పెద్ద మనుషుల ఒప్పందాన్ని (1956), అప్పటి రాజ్యంగ సవరణనీ, ఆంధ్రప్రదేశ్, పంజాబ్, బోంబేలకు కల్పించిన ప్రత్యేక అవకాశాల్ని, ప్రభుత్వోద్యోగ చట్టం 1957, 1969లో ఏర్పరచిన 8 సూత్రాల

ప్రణాళికనీ, 1972లో 5 సూత్రాల ప్రణాళికని, ఆనాటి తెలంగాణా ఉద్యమాన్ని ముల్కి నిబంధనలు పునరుద్ధరణని, అప్పటి కోర్టు తీర్పుల్ని, 1972 ముల్కి నిబంధనల్ని 1972 జై ఆంధ్ర ఉద్యమాన్ని ఇందిరాగాంధీ ఆరుసూత్రాల (1973) పథకాన్ని, 1973లో ముల్కి నియమాల రద్దునీ, రాజ్యాంగంలో 371-D ఆర్టికల్‌నీ, 1975 రాష్ట్రపతి ఉత్తర్వులనీ ఆ తరువాతి పరిణామాల్ని గిర్‌గ్లాని కమీషన్ ఏర్పాటునీ, దాని నివేదిక సారాన్ని ఇలా మొదటి అధ్యాయంలో ప్రస్తావించిన వాటినే మరింత లోతుగా అధ్యయనం చేసి సవివరంగా ఈ నివేదికలో పొందుపరిచారు.

**వాటిమీద కమిటీ అభిప్రాయాలివి :**

1) ప్రభుత్వోద్యోగాలనేవి చాలా తక్కువ శాతం ప్రజలకు మాత్రమే లభిస్తాయి.
2) 1990-2010 మధ్యకాలంలో ఉద్యోగావకాశాలు అమితంగా ఏర్పడ్డాయి. ప్రైవేట్ రంగంలో వచ్చిన ఈ అవకాశాలు ప్రభుత్వోద్యోగాలకన్నా వాసిలోనూ రాసిలోనూ మెరుగైనవిగా వున్నాయి.
3) గ్రూప్ A, B ఉద్యోగాలకు ప్రాంతీయ రిజర్వేషన్ జాతీయ ప్రాముఖ్యతరీత్యా సాధ్యపడే అంశం కాదు.
4) 1975 రాష్ట్రపతి ఉత్తర్వు, దానికి సంబంధించిన జీవోల నేపథ్యంలో ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం ఏర్పడినా ప్రభుత్వోద్యోగాల విషయంలో న్యాయపరమైన చిక్కులు, వాటిపైన తగిన చర్యలు అవసరం అవుతాయి. విడిపోతే ఉద్యోగాలు లభిస్తాయనే ప్రచారాన్ని దృష్టిలో పెట్టుకొని కమిటీ తన నివేదికలో ఈ వ్యాఖ్య చేసినట్లు కన్పిస్తుంది. ఆ వాదనతో కమిటీ ఏకీభవించినట్లు కన్పించదు.
5) కాంగ్రెస్ ప్రభుత్వం మూడు ప్రాంతాల మంత్రులతో ఏర్పర్చిన త్రిసభ్య కమిటీ అందించిన సూచనలు, పరిష్కార మార్గాలు సంతృప్తికరంగా ఉన్నట్లు శ్రీకృష్ణ కమిటీ అభిప్రాయపడింది.

తెలంగాణా న్యాయవాదులు వివక్షతని ఎత్తిచూపుతూ చేపట్టిన ఆందోళనను కమిటీ ప్రస్తావించింది. ఇద్దరు పూర్వపు హైకోర్టు ప్రభుత్వ న్యాయమూర్తులతో ఈ విషయం చర్చించి, వివక్షత అనేది జరిగే అవకాశం లేదని అన్ని నియామకాలు చట్ట ప్రకారమే, జరిగాయని కమిటీ అభిప్రాయపడింది. (5.31.8 పేజీ 288)

అడ్వకేట్ జనరల్, ఎడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్ ప్రెసిడెంట్, సభ్యుల నియామకాల వంటి ముఖ్యమైన పదవుల విషయంలో ప్రాంతీయ సమతుల్యతని కూడా దృష్టిలో పెట్టుకొంటే మంచిదని, సెక్రటేరియట్‌లోని సీనియర్ పదవుల విషయంలోనూ, డైరెక్టరేట్ల విషయంలోనూ, మూడు ప్రాంతాల సమతుల్యతని పాటించటం అవసరం అని కమిటీ తన అభిప్రాయంగా సూచించింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత అడ్వకేట్ జనరల్‌గా

ఇంతవరకూ తెలంగాణాకి చెందిన ఒక్కరిని కూడా నియమించలేదంటే, సిగ్గుపడి పాలనా వ్యవస్థ తలదించుకోక తప్పదు.

ఇటీవలికాలంలో ప్రభుత్వం లా ఆఫీసర్లు, స్టాండింగ్ కౌన్సిల్ నియామకాల విషయంలో చేసిన కృషి సంతృప్తికరంగా ఉందని కమిటీ అభిప్రాయపడింది. బావుంది! అయితే ఒకమాట... గేట్లు విరగ్గొట్టి, కోర్టుల్ని పగలగొడితేనే ప్రభుత్వం బుద్ధిగా పనిచేస్తుందనే సంకేతం దీనివలన కలగకుండా ప్రభుత్వమే జాగ్రత్త వహించాలి. చిన్న కారణానిక్కూడా బస్సులు తగలబెట్టి, ట్రాఫిక్‌కి అవరోధాలు కల్పించి, బందులు చేస్తే తప్ప ప్రభుత్వంలో స్పందన రాకపోవటం ఒక దురదృష్టకర పరిణామం. అటువంటి ధోరణుల్ని ప్రభుత్వమే చేజేతులా తెచ్చిపెడుతోంది. గత సంవత్సరం హైకోర్టులో జరిగిన న్యాయ వాదుల వృత్తాంతం ఇందుకు తార్కాణం. అందాక పరిస్థితి రాకుండా ముందుగానే ప్రభుత్వం స్పందించకపోవటం అన్యాయం. గెలుపు న్యాయవాదులదే అయ్యింది. కాని, విధ్వంసం ఒక సాంప్రదాయంగా మారకూడదు. అడిగినదే తడవుగా స్పందన లేనప్పుడు ప్రభుత్వాన్ని "నగరంలో వృషభం"తో కవులు పోలిస్తే తప్పు పట్టాల్సిన పనిలేదు. కోస్తాలో హైకోర్టు బ్రాంచి కోసం ఆందోళన చేస్తున్న వారి విషయంలో ప్రభుత్వం "నగరంలో వృషభం"లానే స్పందిస్తోంది. కోస్తాలాయర్లు కూడా రేపు నాలుగు బస్సులు తగలబెడితే అప్పుడు రాష్ట్రం స్పందిస్తుందన్న మాట !

ఉద్యోగపరమైన అంశాల మీద కమిటీ తన అభిప్రాయాన్ని చెపుతూ ముగింపుగా ఇలా అంది: తెలంగాణా ప్రజల రక్షణ కోసం అదనపు ప్రభుత్వ యంత్రాంగం ఏర్పాటు అవసరం ఏమీలేదు. ఉన్న రక్షణ కవచాల్ని సక్రమంగా వినియోగించగలిగితే అదే గొప్ప! తెలంగాణా ఉద్యోగుల కోర్కెల విషయంలో కూడా గత ఐదేళ్లలో ప్రభుత్వం తీసుకున్న చర్యలు వాళ్లకి సంతృప్తికరంగానే ఉన్నట్లు కమిటీ గుర్తించింది.

అసంతృప్తులు కలగక మునుపే నివారించగలగడం ఉత్తమపాలన. కలిగాక తగిన చర్యలు తీసుకోవడం మధ్యమ పాలన. కలిగి, విధ్వంసం జరిగిన కదలనితనం అధమపాలన! ప్రభుత్వాలు ఏ పాలనని అందిస్తాయో వాళ్లకి వాళ్లే నిర్ణయించుకోవాలి.



# ఆరవ అధ్యాయం

## హైదరాబాద్ మహానగర విషయాలు
## ISSUES RELATING TO HYDERABAD METROPOLIS

తెలంగాణా ఉద్యమంలో హైదరాబాద్ కీలకం అయ్యింది. అది ఉమ్మడి ఆస్తిగా అభివృద్ధి చెందడంతో విభజన విషయంలో 'హైధరాబాద్' భవితవ్యం చాలా ముఖ్యమైన అంశంగా నిలిచింది. అన్నిప్రాంతాలవారి అభిప్రాయాలూ విన్న తరువాత కమిటీవారు నిపుణుల సలహా పొందడం కూడా అవసరంగా భావించి Centre for Policy Research, New Delhi వారి సహకారం తీసుకున్నారు. వారి నివేదిక ఆధారంగా కమిటీ వారు తమ అధ్యయనాన్ని కొనసాగించినట్లు తెలియచేశారు.

1580లో మొహమ్మద్ కులీకుతుబ్‌షాహీ (1518-1687) గోల్కొండ ప్రభువు హైదరాబాద్ నగరాన్ని నిర్మించిన కాలం నుంచి హైదరాబాద్‌కు గల ప్రత్యేకతని, దాని సంస్కృతిని, దాని చారిత్రక పరిణామాలను ఈ అధ్యాయంలో కమిటీ చర్చించింది. స్వాతంత్ర్యం తర్వాత హైదరాబాద్ సంస్థానం భారతదేశంలో విలీనం కావటం, ఆంధ్రప్రదేశ్ అవతరణ, హైదరాబాద్ రాజధాని కావటం, హైదరాబాద్‌ని శాశ్వత ముస్లిం రాజ్యంగా చేయాలని ఉపక్రమించిన ఆలిండియా మజ్లిస్ ఇత్తిహద్ ఉల్ ముస్లిమీన్ సంస్థ, 1957 ఎన్నికలు, 1969 ఉద్యమం, 1982 తెలుగుదేశం అధికారం, తదనంతర పరిణామాలు, 1995 చంద్రబాబునాయుడు గద్దెనెక్కటం, 1999లో ఆయన తిరిగి అధికారాన్ని కైవసం చేసుకోవటం, ఎన్.డి.ఎ.ప్రభుత్వంలో ఉత్తరాంచల్, చత్తీస్‌ఘడ్, జార్ఖండ్ రాష్ట్రాలు 2000 సంవత్సరంలో ఏర్పడటం, చంద్రబాబుతో విభేదించిన కె.చంద్రశేఖరరావు ప్రత్యేక రాజకీయ పార్టీ తెలంగాణా రాష్ట్రసమితి 2001లో ఏర్పరచటం - ఈ అన్ని పరిణామాలను కమిటీ ప్రస్తావించి విశ్లేషించింది.

హైదరాబాద్ రాజకీయాల్ని, MIM పాత్రని కూడా విశ్లేషించింది. MIM వారు తెలంగాణాలో 8%, రాయలసీమలో 12%, ముస్లింలు కలిసి 20% పెరిగే అవకాశం వుంటుందని "రాయల తెలంగాణా"ను కోరిన విషయం, గ్రేటర్ హైదరాబాద్‌లో కాంగ్రెస్ మద్దతు దారులను, తెలుగుదేశం మద్దతు దారులను కల్గిన ప్రాంతాలు, అక్కడి రాజకీయ పరిస్థితిని కమిటీ విశ్లేషించింది.

జూబిలిహిల్స్ మున్సిపాలిటీ 1937లోనూ, సికిందిరాబాద్ మున్సిపాలిటీ 1945లోనూ చాదర్‌ఘాట్ మున్సిపాలిటీ 1933లోనూ హైదరాబాద్‌లో విలీనం అయ్యాయి. 1960లో హైదరాబాద్ 'కార్పొరేషన్' అయ్యింది. 2007లో గ్రేటర్ హైదరాబాద్ మున్సిపల్ కార్పొరేషన్ ఏర్పడింది. 626 చదరపు కి.మీ. విస్తీర్ణంలో హైదరాబాద్ మరి 12 మున్సిపాలిటీలు కలిసిన ప్రాంతం ఇది.

హైదరాబాద్ మున్సిపల్ డెవలప్‌మెంట్ అథారిటీ (HMDA) పరిధిలో ప్రస్తుతం 7073 చదరపు కి.మీ. వున్నాయి. 5.4 మిలియన్ల మంది రంగారెడ్డి, మెదక్, మహబూబ్‌నగర్, నల్గొండ జిల్లాలలోని ప్రాంతాలు కలిసి ఏర్పడింది.

హైదరాబాద్ GDP, హైదరాబాద్‌లో ఉద్యోగాలు, హైదరాబాద్ చుట్టూ కేంద్రీకృతమైన అభివృద్ధి, చుట్టూ వున్న SEZ లు, ఇన్ఫర్‌మేషన్ టెక్నాలజీ రంగం, రియల్ ఎస్టేట్ వ్యాపారాలు, హైదరాబాద్‌లో పెట్టుబడులు, హైదరాబాద్‌కు రాకపోకలు, వలసలు, వలస వచ్చి స్థిరపడ్డవారు ఇలా అనేక విశేషాలను కమిటీ ప్రస్తావించి లోతైన అధ్యయనం జరిపింది. అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీలు రాష్ట్రంలో ఇతర ప్రాంతాలలో పనిచేస్తున్న తీరుని ఇందులో విశ్లేషించారు.

అన్ని విషయాలనూ పరిశీలించిన మీద హైదరాబాద్ విషయమై చాలా అనుమానాలకు, సందేహాలకు, అపోహాలకు, కొంత సమాధానం చెప్పే ప్రయత్నం ఈ నివేదికలో జరిగింది.

హైదరాబాద్ మహానగరం ప్రాంతీయంగా, జాతీయంగా, అంతర్జాతీయంగా మూడు స్థాయిల్లో వుంది. ఒక స్థాయిలో ఇది ప్రాంతీయతా బంధాలలో వుంది. ప్రాంత అభివృద్ధికి అది ఇంజన్‌లాగానో, డ్రైవర్‌లాగానో వుంది. వందల సంవత్సరాలుగా రాజధాని నగరంగా వుండటంతో చాలా త్వరితంగా అభివృద్ధి చెందింది. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ రంగంలో హైదరాబాద్ ఇప్పుడు ముందునడిచే పాత్ర పోషిస్తోంది. రాష్ట్రం మొత్తం మీద సమాచార సాంకేతిక రంగానికి సంబంధించిన కార్యాలయాలన్నీ కేవలం హైదరాబాద్‌లోనే ఉన్నాయి! 2005-06లో 99% రాష్ట్ర ఎగుమతులు కేవలం హైద్రాబాద్‌లోనే జరిగాయి.

హైదరాబాద్ ఆర్థికపరమైన అంశాలలో 39% ఆధునిక అంశాలు కాగా, 19% రవాణా రంగం సమకూరుస్తోంది. రియల్ఎస్టేట్ వ్యాపారంలో జాతీయస్థాయి వ్యక్తులు, సంస్థల పాత్రకూడా ఇక్కడ నడుస్తోంది. రంగారెడ్డి జిల్లాలో ఉత్పాదక పరిశ్రమలు రాష్ట్రవ్యాప్తంగా ప్రతిభావంతుల్ని పోషిస్తున్నాయి. ప్రపంచవ్యాప్తంగా పెట్టుబడులను ఈ నగరం స్వాగతిస్తోంది. హైదరాబాద్‌కు తరలివెళ్లడం, హైదరాబాద్‌లో పెట్టుబడులు పెట్టడం ఈ రెండు అంశాలు ఈ మహానగరానికి కాస్మోపోలిటన్ కళను తెచ్చిపెట్టాయి. పబ్లిక్ సెక్టార్ కంపెనీలు, యూనిట్లు, జాతీయ సంస్థలు, పౌరసంస్థలు, మిలిటరీ పరిశోధన, అభివృద్ధి సంస్థలు, రక్షణదళాల సంస్థలు హైదరాబాద్‌లో కేంద్రీకృతమై వున్నాయి.

2001లో 75,86,813 మంది జనాభా వున్న హైదరాబాద్ ప్రాంతం 2011లో 1,03,18,302 గా పెరిగిపోయింది. సంక్రాంతి పండుగకి ప్రతి సంవత్సరం హైదరాబాద్ నుంచి కనీసం 8 లక్షల మంది కోస్తా, సీమ జిల్లాలకు తరలి వెళ్తుంటారని ఒక అంచనా! నిజాం నాటి హైదరాబాద్‌కి, నేటి హైదరాబాద్‌కి ఎంతో తేడా వుంది. కోస్తా నుంచి తరలివచ్చిన వారి పెట్టుబడులు హైదరాబాద్ అభివృద్ధికి ముఖ్యంగా దోహదపడ్తున్నాయి. ఇప్పుడు ఇతర రాష్ట్రాల నుంచి కూడా ప్రజలు అసంఖ్యాకంగా హైదరాబాద్ తరలి వస్తున్నారు. ఇతర ప్రాంతాల నుంచి రానూపోనుగా తిరిగేవారు. తాత్కాలికంగా వచ్చి వెళ్ళేవారు, ముఖ్యంగా పేదవర్గాల వారుకూడా హైదరాబాద్‌లో పనికోసం వెదుక్కొంటు న్నారు. పెద్దపెద్ద విద్యాసంస్థలు కేంద్రీకృతం కావడంతో విద్యార్థిలోకం ఎక్కువగా చదువుల కోసం ఇక్కడకు చేరుకొంటోంది. చిన్న చిన్న వ్యాపారులు, ఎంతో కొంత వృత్తిపరమైన ప్రావీణ్యం కల్గినవారు రాష్ట్రవ్యాప్తంగా హైదరాబాద్‌చేరి స్థిరపడ్డారు. హైదరాబాద్‌తో పెనవేసుకున్న వారి బంధాల కారణంగా రాష్ట్రంలో ఏర్పడిన పరిస్థితులు అమితమైన భయాందోళనలకు కారణం అయ్యాయి.

ఈ విషయాలన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు హైదరాబాద్‌ని అస్థిరపరిచే ప్రయత్నం జరిగిందనేది వాస్తవంకాదు. రాజధాని నగరంగా, వాణిజ్య నగరంగా హైదరాబాద్ నగరం సురక్షితంగా వుంది. మూడు రాష్ట్రాల ప్రగతిరథానికి హైదరాబాద్ ఇంజన్‌లాంటిది. జాతీయ ఆర్థిక ప్రగతికి కూడా ఇది దోహదకారిగా వుంది. ఉద్యోగావకాశాలు మరింత పెరిగే అవకాశం వుంది.

మూడు ప్రాంతాలకు హైదరాబాద్‌తోగల ఆర్థిక బంధాన్ని మరింత పెంపొందించి, అభివృద్ధి పరచవలసిన సమయం ఇది. నూతన ఆర్థిక వ్యవస్థకు హైదరాబాద్ ఒక కేంద్ర స్థానం. దాన్ని మరింత బలసంపన్నం చేయాల్సిన అవసరం వుంది. అంతర్జాతీయ స్థాయి గుర్తింపు, ఒక బ్రాండ్ ఇమేజ్‌ని ఈ నగరం సంతరించుకొంటోంది దాన్ని నిలబెట్టాలి.

అస్థిరత్వం, అయోమయంతో నగరాభివృద్ధి ఎక్కువకాలం కొనసాగలేదు. ఈ మహానగరం భవిష్యత్తు సిద్ధాంతకర్తల చేతుల్లో వుంది. సమర్థమైన పాలన అందించడం ద్వారా అన్ని విధాలా ఈ నగరం పెరిగి అభివృద్ధి చెందేలా చర్యలు తీసుకోగలగాలి - అని వ్యాఖ్యానించింది జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ-

కూర్చున్న కొమ్మలు నరుక్కుంటూ, నిండు పాలకుండను తన్నుకొంటూ, వడ్డించిన విస్తరిని చింపుకొంటూ అదే ఆదర్శంగా జీవించాలనే నిర్ణయమే పెద్దలు తీసుకొంటే భగవంతుడా... నా దేశాన్ని రక్షించు... అనుకోవాల్సి వస్తుంది!! ఇది ప్రత్యేక రాష్ట్ర వాదానికిగాని, సమైక్య రాష్ట్రవాదానికి గాని వ్యతిరేకంగా అంటున్న మాటలుకావు. విడిపోతేనే అభివృద్ధి అనేవాళ్లూ, కలిసి ఉంటేనే అభివృద్ధి అనేవాళ్లూ, రెండు వేర్వేరు ధృవాలు. 'పాము-కప్ప' సామెతలాగా ఎటుచెప్పినా ఎవరో ఒకరు తమ ప్రాంతంలో విధ్వంసం సృష్టించి పైచేయి ప్రచారాన్ని పొందాలని చూస్తున్నారు. అలాంటి వారి విధ్వంసకర కృత్యాలను మీడియాలో పదేపదే చూపిస్తుండటంతో వారికి అదొక ఊతం అయ్యింది. 2010 జనవరి కన్న ముందునాటి పరిస్థితిని మాత్రమే ఈ కమిటీ నివేదిక విశ్లేషించింది. 2010 సంవత్సరంలో దిగజారిన "అభివృద్ధి" గురించి అసలైన వివరాలు తెలిస్తే తెలుగువాడి గుండె ఆగుతుంది !



# ఏడవ అధ్యాయం

## సామాజిక సాంస్కృతిక అంశాలు

## SOCIOLOGICAL AND CULTURAL ISSUES

ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర వాదన మూడు ప్రాంతాల ప్రజల మనోభావాలలోనూ తీవ్రమైన భావాతిరేకాలకు దారి తీసించిది.

తెలంగాణా ప్రాంతంలో ప్రత్యేక రాష్ట్రం కావాలనే ప్రగాఢమైన కోరిక ఉవ్వెత్తున ఎగిసిపడింది. కోస్తా రాయలసీమల్లో మిశ్రమ స్పందన కల్గింది. కొద్దిమంది కోస్తా ప్రాంతంలో తాము విడిపోవటానికి సిద్ధమేనని, ప్రత్యేక రాష్ట్రంతోనే తమకు సుఖశాంతులుంటాయని భావించారు. కాని, మెజారిటీ ప్రజలు రాష్ట్రాన్ని సమైక్యంగా వుంచాలనే కోరుకున్నారు. రాయలసీమలో కూడా ఇదే పరిస్థితి. సమైక్య రాష్ట్రాన్నే కోరారు. అయితే, విభజన జరిగితే తెలంగాణా, కోస్తా ఆంధ్ర, గ్రేటర్ రాయలసీమ రాష్ట్రాలుగా మూడుగా విభజించాలని కొందరు కోరారు.

ఈ అన్ని అంశాలను కమిటీవారు శ్రద్ధగా విన్నారు. విజ్ఞాపనల్ని పరిశీలించారు. 1956 నుంచి పెద్ద మనుషుల ఒప్పందం కొరకు తెలంగాణాలో జరిగిన పరిణామాలు, అలాగే సీమ నేతలకు, కోస్తా నేతలకు 1937లో శ్రీబాగ్ ఒడంబడిక పేరుతో జరిగిన ఒప్పందాలు విభిన్నమైన సామాజిక పరిస్థితులున్నప్పటికీ 1956 నుంచి 'తెలుగు' స్పృహ వ్యాపించివున్న మూడు ప్రాంతాలలోనూ కలిగిన వైనం అన్నింటినీ కమిటీ ప్రస్తావించింది. కోస్తా ఆంధ్రుల రాజకీయ ఆధిపత్యం, సీమ నాయకుల ఫ్యాక్షనిస్ట్ ధోరణులు తెలంగాణావారికి ఇబ్బందిగా వుండే అంశాలే!

అయితే విడిపోవాలనే బలమైన కోరిక తెలంగాణా వారిలో కలిగింది కేవలం అసూయద్వేషాల వలనా ? వివక్షత చూపించినందువలనా? నెగెటివ్ ఆలోచన ధోరణి

వలనా...? లేక వారి కోరికలో పాజిటివ్ అంశం ఏమైనా ఉన్నాదా...? అనే ప్రశ్నని కమిటీ తనకు తాను వేసుకొన్నది. అందుకు సమాధానాలు వెదికే ప్రయత్నం చేసింది. అయితే, విడిపోవడం ద్వారా తెలంగాణా ఏ విధంగా లాభిస్తుందనే అంశం మీద కూడా కమిటీ దృష్టి పెట్టింది! విడిపోవాలనే కోరిక సమంజసమే అయినప్పటికీ, విడిపోవడమే పరిష్కారమా అని ఆలోచించింది.

అందుకే, 1956 నాటి ఒప్పందాలు, ఆంధ్రప్రదేశ్ ఏర్పడటానికి దారితీసిన పరిస్థితులు ఆనాటి ఆశావాహుల వాదాలు, వ్యతిరేకుల అభ్యంతరాలు అన్నింటిని మళ్లీ మళ్లీ పరిశీలన చేసింది.

ఒక తెలంగాణాని ఆంధ్రప్రదేశ్‌లోంచి విభజించినంత మాత్రాన దేశస్థాయిలో జాతీయ సమైక్యతకి ఏర్పడే పెద్ద ముప్పేమీ లేకపోవచ్చు. కానీ, చిన్న రాష్ట్రాలు పెద్ద రాష్ట్రాల్లా అభివృద్ధిని సాధించగలవా ? పాలనా వ్యవస్థ పటిష్టంగా ఉంటుందా ? కొత్త రాష్ట్రాల కోసం పుట్టుకొస్తున్న డిమాండ్లను పరిష్కరించడం ఎలా ? – ఇవన్నీ సమాధానం వెతకవలసిన ప్రశ్నలు జాతీయ స్థాయిలో ఆలోచించవలసిన అంశాలుగా కమిటీ అభిప్రాయపడింది.

కొత్తగా ఏర్పడిన ఉత్తరాఖండ్, ఛత్తీస్‌ఘర్, జార్ఖండ్‌లకు లేనిదీ ఆంధ్రప్రదేశ్‌లో అదనంగా ఏర్పడిన సమస్య ఏమంటే, ఇక్కడ విడిపోదలచుకున్న భూభాగంలో రాష్ట్ర రాజధాని నగరం ఉంది. ఈ రాజధాని నగరాన్ని మూడు ప్రాంతాల ప్రజలు కలిసి పెద్దదిగా చేసుకొని అభివృద్ధిపరచుకున్నారు. విభజన నిర్ణయం తీసుకోబోయే ముందు దాని ప్రభావం మూడు ప్రాంతాల మీద ఎలా ఉంటుందో ఆలోచించి తీరాలి. ఆలోచించాల్సిన అవసరం లేదని ఈ నగర లబ్ధిదారులు వాదించినా కమిటీ ఆ విషయాన్ని గురించి ఆలోచించకుండా పక్కన పెట్టలేదు.

తెలంగాణా కోసం డిమాండ్ హైదరాబాద్ నగరంలో అంత పెద్ద స్థాయిలో కన్పించలేదు. అయితే, ఉద్యమ ప్రకంపనాల నుంచి నగరం తప్పించుకోలేకపోయింది. ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థుల ఉద్యమానికి వేదికగా నిలిచింది. కాస్మోపోలిటన్ రూపం సంతరించుకున్న ఈ మహానగరం భవిష్యత్తు విషయంలో ముస్లిం మైనారిటీల ఆలోచనలు కూడా పరిగణనలోకి తీసుకోవాల్సి వుంది. ఇలాంటి ఉద్యమాలు ప్రపంచంలో ఎక్కడ చెలరేగినా పరిష్కారాల గురించి ప్రపంచ స్థాయి నిపుణులు చెప్పిన విషయాల్ని కూడా కమిటీవారు ఆయా గ్రంథాలను ఉదాహరిస్తూ పరిశీలన చేశారు. ప్రజాస్వామ్యంలో ప్రజలకు తను ఆశలను, ఆకాంక్షలను వ్యక్తపరచుకొనే హక్కుంది. తెలంగాణా ఉద్యమం తెలంగాణా ప్రజలకు ఆ అవకాశాల్ని బలంగా ఇచ్చిందని కమిటీ అభిప్రాయపడింది.

రాష్ట్ర విభజన జరిగితే SCలు, STలు, OBCలు, ముస్లింలనుంచి తాము ఏ విధంగా లాభపడేది, ఏ విధంగా నష్టపోయేదీ కమిటీ తెలుసుకొనే ప్రయత్నం చేసింది. ప్రాంతాల వారీగా అన్ని వర్గాల ప్రజల మనోభావాలను గుర్తించే ప్రయత్నం చేసింది.

తెలంగాణావారు తమకు కోస్తా వారికన్నా భిన్నమైన, ప్రాచీనమైన చరిత్ర వుందని, దాన్ని కోస్తావారు రాజకీయంగా అధిగమించారని, స్వపరిపాలన, ఆత్మాభిమానం లాంటి పదాలతో ప్రత్యేక రాష్ట్ర డిమాండ్‌ని ముందుకు తెచ్చారు ఈ అన్ని విషయాలను కమిటీ పరిశీలించే ప్రయత్నం చేసింది.

తెలంగాణా ఉద్యమంలో ఏర్పడిన పరిణామ క్రమాన్నంతా కమిటీ ఈ అధ్యాయంలో పరిశీలన చేసింది.

కమిటీ సభ్యులు భద్రాచలం అటవీ ప్రాంతానికి వెళ్లినప్పుడు అక్కడి కోయ ప్రజలు ఇలాంటి ఉద్యమం ఒకటి జరుగుతున్న సంగతే తెలియదని చెప్పారట. అక్కడి ఆదీవాసీలతో ప్రత్యేక సమావేశాన్ని ఏర్పాటు చేసినప్పుడు "మన్యసీమ" డిమాండ్ వెలుగులోకి వచ్చింది. తెలంగాణా, కోస్తా, ఒరిస్సా, ఛత్తీస్‌ఘడ్‌లలోని మన్య ప్రాంతాలను కలిపి "మన్యసీమ" రాష్ట్రం ఏర్పాటు చేయాలనేది వారి ప్రధాన డిమాండ్. శ్రీకృష్ణ కమిటీకి మన్య ప్రజలు ఈ కోరికని నివేదిస్తుండగా కొందరు తెలంగాణా మద్దతు దారులు ప్రవేశించి జై తెలంగాణా నినాదాలు చేసినట్లు కమిటీ తన నివేదికలో పేర్కొన్నది.

విద్యార్థులు, యువకులు ఎక్కువగా తెలంగాణా వాదాన్ని బలపరిచినట్లు కమిటీ గుర్తించింది. ఖమ్మం పట్టణంలో తెలంగాణా రాష్ట్రం ఏర్పాటుపట్ల భిన్నాభిప్రాయాలు వ్యక్తపరిచారు. వ్యక్తమైనాయంటూ, ఒక టీచరు తన తండ్రి ఉద్యోగం రీత్యా రాష్ట్రంలో అనేక ప్రాంతాలలో పని చేశారని అన్ని ప్రాంతాల్లోనూ తాము పెరిగామని, ఇప్పుడు తనకు 'స్వంత ఊరు' అనేది ఏదీ లేదనీ పేర్కొన్న సంగతిని ఉటంకించారు. ఖమ్మంలో 200 మందితో సమావేశాన్ని నిర్వహించగా కోస్తా ప్రాంతం నుంచి వచ్చి సెటిలర్స్‌గా ఖమ్మంలో స్థిరపడిన కుటుంబాల నుంచి ఒక్కరు కూడా ఆ సమావేశానికి రాలేదని తాము గ్రహించినట్లు కమిటీ పేర్కొంది. తెలంగాణాలో సమైక్య రాగాన్ని విన్పించేది సెటిలర్సేనడం సరికాదని కమిటీ ఈ ఉదాహరణ ద్వారా స్పష్టీకరించదలచుకున్నట్లు అర్థం అయ్యింది. ఒక సర్పంచ్ నిర్భయంగా సెటిలర్స్‌నీ ఎవరినీ మీటింగ్‌కు రాకుండా అడ్డుకున్నారని, వాళ్లు చాలా భయభ్రాంతులౌతున్నారని కమిటీ దృష్టికి తీసుకువచ్చినట్లు కూడా ఈ నివేదికలో పేర్కొన్నారు.

మొత్తం మీద, ఎక్కువ మంది ఎటు చేతులెత్తితే అటే తీర్పు - అనే పద్ధతిలో ఈ కమిటీ నివేదిక వుంటుందని ఆశించిన వారికి ఆశాభంగమే ఎదురయ్యింది. ఎదుటి పక్షం వారిని మాట్లాడనిచ్చినందు వలన మన వాదనలోని పసని నిరూపించుకోవచ్చునని

చాలా మంది గమనించకపోవడం విచిత్రం. కమిటీ తనకు రావలసిన సమాచారాన్ని తానే తెప్పించుకొంది. ఈ నివేదికలో కమిటీ వారు చూపించిన ఉపపత్తులు, ప్రత్యేక వాదులుగాని, సమైక్యవాదులుగాని అందించినవి కావు. వాళ్ళు ఎవరూ లేవనెత్తని అంశాలు కూడా కమిటీ పరిశీలన చేసింది.

బహిరంగ సభలలో ప్రజల్ని రెచ్చగొట్టడానికి ఉపయోగించే పదజాలం, వినియోగించిన సమాచారం చాలా వరకూ కమిటీ ముందుకొచ్చే సరికి అది వెలవెలపో యింది. రెండు వైపులా ఇదే జరిగింది. విషయ ప్రాధాన్యతని బట్టి సమైక్యమా, విడిపోవటమా అనేది నిర్ణయించాలని, వాస్తవాలను తెలుసుకోగోరే తటస్థులకు ఈ నివేదికలో సేకరించిన సమాచారం ఒక గొప్ప గని !

ఈ ఉద్యమాలలో ఆవేశంగా తిరుగుతున్న యువతరానికి పూర్వపు జైతెలంగాణా, జైఆంధ్ర ఉద్యమాలు, ఆనాటి పరిస్థితుల గురించి సమగ్ర అవగాహన లేదని కమిటీ అభిప్రాయపడింది. ముఖ్యంగా బాగా లోపలి ప్రాంతాలలో, పేద ప్రజల దగ్గరకు ఎలాంటి ముందస్తు సమాచారము లేకుండా అకస్మాత్తుగా వెళ్ళి పరిశీలించినప్పుడు చాలామంది ఈ ఉద్యమం గురించి తెలియదని గాని, తాము తటస్థులమని గానీ చెప్పినట్లు కమిటీ నివేదించింది.

తెలంగాణా వచ్చేస్తే ఉద్యోగాలు, నీళ్లు, కాలేజీల్లో సీట్లు వచ్చేస్తాయనే ప్రచారం బాగా విస్తృతంగా జరిగినట్లు కమిటీ గుర్తించింది. పాఠశాలల పిల్లలు కూడా ఇదే పాట పాడేలాగా విద్యార్థుల్లో బలంగా తెలంగాణా సెంటిమెంట్‌ను గుప్పించడం జరిగింది. తెలంగాణా NRI లు కూడా ఇందుకు బాగా దోహదపడ్డారు. 1969తో పోలిస్తే ఇప్పుడు నడుస్తున్న తెలంగాణా ఉద్యమం ఎక్కువేనని కమిటీ అభిప్రాయ పడింది. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం, సమాచార వ్యవస్థ, ఆధునీకరించబడిన విధానాల కారణంగా తెలంగాణా సందేశాన్ని ఎక్కువ మందికి చేర్చగలిగారు.

"సెంటిమెంట్" పరంగా మూడు ప్రాంతాల్లోనూ ప్రజల మనోభావాలు ఎలా వున్నాయని కమిటీ పరిశీలించింది. రాష్ట్రాలలో అన్ని ప్రాంతాలకన్నా రాయలసీమ వెనుకబడి ఉంది. ఈ ప్రాంతంలో వెనుకబాటుతనం ఉన్నప్పటికి ప్రజలు విభజనను, కోరుకోలేదు. "ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత జలాలు కోస్తా ఆంధ్రాకి, డబ్బు హైదరాబాద్‌కి చేరాయి. అన్ని విధాలా త్యాగాలు చేశాం. రెండుసార్లు మోసపోయాం. అయినా సమైక్యాంధ్రానే కోరుకొంటున్నాం." ఇదీ రాయలసీమ మాట, బాట!!

హైదరాబాద్ రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల ప్రజలకూ అవసరం. ఉద్యోగం, విద్య, వాణిజ్య అవసరాలను తీర్చేది హైదరాబాద్ నగరమే! అందుకే సమైక్యరాష్ట్రం-కావాలనేది వారి అభిప్రాయం. తెలంగాణా విడిపోతే, వచ్చే నీళ్లు కూడా రాకుండా ఆగిపోతాయని

ఎక్కువ మంది భయాందోళనలు వ్యక్తం చేశారు. దానికితోడు తెలంగాణా వాదులు 'గోడలు కట్టేస్తాం' 'అడ్డు కట్టలు వేసేస్తాం' లాంటిమాటలకు మీడియా ఎక్కువ ప్రచారమిచ్చింది. మీడియా ఏక మొత్తంగా తెలంగాణాకు అనుకూలంగా వ్యవహరించింది. తాత్కాలికంగా అది తెలంగాణా వాదులకు సంతోషం కల్గించవచ్చు. కానీ, కోస్తా సీమ ప్రజల్లో వ్యతిరేక భావనలను రెచ్చగొట్టడానికి ఈ అతి ప్రచారమే కారణం అయ్యింది. తెలంగాణా ప్రజలపట్ల, వారి త్యాగాలపట్ల, వారి వెనుకబాటుతనం పట్ల ముఖ్యంగా కోస్తా ప్రజల్లో ఎనలేని సానుభూతి వుంది. అయినా అతి ప్రచారం తెలంగాణా పట్ల ఏకాభిప్రాయం రాకుండా అడ్డుపడిందని చాలా మంది భావిస్తున్నారు. నిజానికి, ఏకాభిప్రాయం సాధించడం కోసం తెలంగాణా వాదులెవరూ ప్రయత్నించలేదు. పైగా ఏకాభిప్రాయం అవసరం లేదని వాదించారు.

"విడిపోవడమే అనివార్యం అయితే, రెండు ముక్కలైనా, మూడు ముక్కలైనాసరే ఎలాగైనా బతకగలం" అనే ఆత్మవిశ్వాసాన్ని ఉత్తర కోస్తా ప్రజలు వ్యక్తపరిచినట్టు కమిటీ నివేదించింది. నిజానికి ఈ భావన ఎక్కువ మందిలో వుంది కూడా. తెలంగాణావాదులు సౌమనస్కంగా ఏకాభిప్రాయానికి ప్రయత్నించి ఉంటే, విధ్వంసం లేకుండానే తెలంగాణా ఏర్పడి ఉండేది. కోస్తావాసులు సహకరించేవారే ననుకుంటాను.

ఇక్కడ ఒక విషయం ప్రస్తావించడం అవసరం. ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుంచి ఆంధ్ర రాష్ట్రాన్ని విభజించినప్పుడు తెలుగు ప్రజలు తెలుగు నగరమైన మద్రాసును కోల్పోయారు. ఈనాడు హైదరాబాద్ అభివృద్ధికి తెలుగు ప్రజలు ఎలా కృషి చేశారో అలాగే ఆనాడు మద్రాసు నగరం కోసం కృషి చేశారు. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినప్పుడు దాన్ని కోల్పోయారు. అయినా, కోలుకున్నారు. రాష్ట్రాల పునర్విభజన సమయంలో విలువైన తెలుగు ప్రాంతాల్ని ఇతర రాష్ట్రాలకూ వదులుకున్నారు. ఇప్పుడు మళ్లీ విభజన జరిగితే హైదరాబాదుని కోల్పోతారు. అయినా కోలుకుంటారు..." అనే మాటలు చాలా మందినోట విన్పిస్తూ వుంటాయి. అభివృద్ధి అనేది వ్యక్తులు, సంస్థలు, వ్యవస్థ కలిసికట్టుగా అందించేదే గాని, దానికదే పుట్టుకురాదు కదా!

కమిటీ వారు ఈ అంశాలన్నింటినీ పరిగణనలోకి తీసుకున్నారు. తెలంగాణాకి అన్యాయం జరిగిందనే వాదనని చదువుకున్న వర్గాలవారు ముఖ్యంగా విద్యార్థులు, టీచర్లు, స్వచ్ఛంద సంస్థలు, డాక్టర్లు లాయర్లు వగైరా వృత్తుల్లో వున్నవారూ అభిప్రాయ పడుతున్నారు. ఉద్యోగావకాశాలు, ప్రమోషన్లు, కెరీర్ అభివృద్ధి ముఖ్యంగా ప్రభుత్వోద్యోగాల్లో పై పదవులు ఆశించి భంగపడ్డవారు వీరిలో ఎక్కువ మంది. కాబట్టి ప్రత్యేక వాదం ఊపునందుకోవడంలో ఆశ్చర్యం లేదని కమిటీ భావించింది.

"హక్కుల ఆధారిత అభివృద్ధి" అనే సూత్రం ఆధారంగా తెలంగాణాలో ఇప్పుడు నడుస్తున్న ప్రాంతీయ వాదాన్ని పరిశీలించాలని కమిటీ అభిప్రాయపడింది.

చిప్కో ఉద్యమం, సర్దార్ సరోవర్ ప్రాజెక్ట్ ఉద్యమం ఇవన్నీ హక్కుల పరిరక్షణని అభివృద్ధితో ముడిపెట్టి ప్రారంభమైన ఉద్యమాలేనని కమిటీ పేర్కొన్నది. స్థానిక ఆదివాసీల హక్కులను కాలరాసి ఎక్కడో, ఎవరికో అభివృద్ధిని చూపిస్తామనే రోజులు పోయాయని ఈ ఉద్యమాలు నిరూపిస్తున్నాయి. మేథావులు, రాజకీయ నాయకులు ఈ కోణంలోంచి ఆలోచించడం అవసరం. నిర్ణయాలు తీసుకునేప్పుడే ప్రజలు - వారి హక్కులను పరిగణనలోకి తీసుకోవాలి. ప్రజల్ని చెప్పు కింద తేలు అనుకొంటే, ఆ తేలు చెప్పులోంచే కుట్టుగలదు... తెలంగాణా ఉద్యమం దేశంలో ఇలాంటి ఉద్యమాలలో తాజా ఉద్యమంగా చెప్పాలి. భూమి పుత్రులు (Sons of the soil) జన్మభూమి (Homeland) భావనలకు ఇప్పుడు ప్రత్యేకత ఏర్పడింది. 1975 రాష్ట్రపతి ఉత్తర్వుల ద్వారా లభించిన జోనల్ విధానం 'హోమ్‌ల్యాండ్' భావాన్ని, తమకుగల హక్కుల్ని తెలంగాణా ప్రజలు గుర్తించేలా చేసిందని కమిటీ విశ్లేషించింది.

సామాజిక ఆర్థిక అసమానతల్ని రూపుమాపగలిగే మంత్ర దండాలేవీ లేవు... అది చిన్న రాష్ట్రం అయినా, పెద్ద రాష్ట్రం అయినా, సొంత సంస్కృతితో కూడిన ఏక రాష్ట్రం అయినా సరే! తెలంగాణాలో అనేక రంగాలలో అభివృద్ధి తాండవిస్తూనే వుంది. కాబట్టి ఈ ప్రత్యేక రాష్ట్ర వాదాన్ని మరింత ఎక్కువ రాజకీయ అవకాశాల కోసం, మరింత ఎక్కువ అధికారం కోసం, రాష్ట్రీయంగా, ప్రాంతీయంగా మరింత ఎక్కువ మాట చెల్లుబాటు కోసం మొదలైనదిగా కమిటీ అభిప్రాయపడింది. రాజకీయ అవకాశాలలో తగిన వాటా లభించినా పై పదవులు ఉన్నత పదవులమీద దృష్టి ఎక్కువైంది. కొత్తరాష్ట్రం ఏర్పడితే ఆ ఫలానా పదవి మనకే దక్కుతుందనే భావన స్థిరపడింది" అని కమిటీ అభిప్రాయ పడింది. ఇది ఒక కోణం. ప్రజా ఉద్యమాలలో ఇది మాత్రమే కోణం కానప్పటికీ ఈ కోణంలోంచి ఉద్యమానికి ఆజ్యం పోశారని కమిటీ అభిప్రాయపడినట్లు కనిపిస్తోంది.

**Distribution of social groups by state and region (percentage)**

| Region | SCs | STs | Muslims | Other Minorities | OBCs | High Castes |
|---|---|---|---|---|---|---|
| Andhra Pradesh | 16.2 | 6.6 | 9.2 | 1.7 | 44.5 | 22 |
| Telangana inc Hyderabad | 15.8 | 8.9 | 12.4 | 1.5 | 50.7 | 10.7 |
| Telangana exc Hyderabad | 16.9 | 10.0 | 8.4 | 1.2 | 53 | 10.5 |
| Hyderabad | 8.0 | 0.9 | 41.2 | 3.2 | 35 | 11.8 |
| Rayalaseema | 16.7 | 2.9 | 12.5 | 0.9 | 43 | 24.2 |
| Coastal Andhra | 16.3 | 6.0 | 4.5 | 2.2 | 39 | 32 |

***Source :*** *Census 2001 and NSSO 64th round*
***Note :*** *1. The figures are in percentages and may not add to 100 due to rounding.*
*2. Note : * - the OBC proportions were estimated using the NSSO survey data,. The proportion of High castes is arrived by deducting the proportions of the rest.*

ఆంధ్రప్రదేశ్‌లో షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలవారు ఇద్దరినీ కలిపితే 22.8% జనాభా వున్నారు. ఓబిసీలు 45% వున్నారు. అగ్రవర్ణాలు 22% వున్నారు. ముస్లింలు ఇతరులు కలిసి 11% దాకా వున్నారు. తెలంగాణాలో షెడ్యూలు తెగలవారు, వెనుకబడిన కులాలవారు మొత్తం 90% వుండగా, అగ్రవర్ణాల వారు 10.5% మాత్రమే వున్నట్లు గణాంక వివరాలు చెప్తున్నాయి. రాయలసీమలో 24.2% అగ్రవర్ణాల వారుండగా, కోస్తాలో 32% వున్నారు. అభివృద్ధి ఫలాలు ఈ వర్గాలవారిలో ఎవరికి ఎంత మేర చేరుతున్నాయన్న అధ్యయనం జరిగినప్పుడు తెలంగాణాలో అభివృద్ధి దిగువ తరగతుల వారికి చేరనేలేదని కమిటీ తేల్చింది. అయినా గణాంక వివరాలు తెలంగాణా అభివృద్ధినే సూచిస్తున్నాయి. అంటే ఈ అభివృద్ధి పూర్తిగా తెలంగాణాలో ఆధిపత్య వర్గాలకు మాత్రమే చేరిందని కమిటీ అధ్యయనం తేటతెల్లం చేస్తోంది. తెలంగాణాని ప్రాథమికంగా దోచుకున్నది తెలంగాణాకు చెందిన అభివృద్ధి చెందిన వర్గాలేననికూడా కమిటీ నివేదిక తెలియజేస్తోంది.

### షెడ్యూలు కులాలవారి మనోభావాలు

నిజాంకాలం నుంచి నెలకొని వున్న వెనుకబాటుతనాన్ని ఎత్తిచూపుతూ, షెడ్యూలు కులాల వారు తెలంగాణాలో ప్రత్యేక రాష్ట్రాన్నే కోరుతున్నారు.

షెడ్యూలు కులాలలో తెలంగాణాలో మాదిగ సామాజిక వర్గంవారు, కోస్తాలో మాల సామాజిక వర్గంవారు ఎక్కువ సంఖ్యలో వుండగా తెలంగాణా షెడ్యూలు కులాల వారి ఆరోపణ ఏమంటే, కోస్తాలోని మాలలు, IAS, IPS IFS లాంటి పై ఉద్యోగాల్లో స్థిరపడగలిగారని, ప్రయోజనాలన్నీ వారికే దక్కుతున్నాయనీ తెలంగాణాలోని మాదిగలకు దక్కడం లేదని, కాబట్టి ప్రత్యేక రాష్ట్రం కావాలనేది వారి వాదన.

షెడ్యూలు కులాలో OBC లకు వున్నట్టే ABCD వర్గీకరణ వుంటే, అన్ని షెడ్యూల్ కులాల వారికీ సమాన ప్రాతినిధ్యం కలుగుతుందని మాదిగ సామాజిక వర్గంవారు కోరుతున్నారు. అందుకని షెడ్యూల్ కులాలలో మాదిగ సామాజిక వర్గంవారు రెండువైపులా ప్రత్యేక రాష్ట్రాన్నే కోరుతున్నారు.

ఉత్తరకోస్తాలో షెడ్యూల్ కులాలవారు 'ప్రత్యేక ఆర్థిక సహాయం' చేసే ప్యాకేజీని ప్రకటించాలని కోరారు.

రాయలసీమలో షెడ్యూల్ కులాలవారు ఎక్కువగా సమైక్య రాష్ట్రాన్నే కోరినా, చిన్న రాష్ట్రాలతో షెడ్యూల్ కులాల వారికి మేలు జరుగుతుందని కొందరు అభిప్రాయ పడ్డారు.

బి.ఆర్.అంబేద్కర్ భావన కూడా అదే! షెడ్యూల్ కులాలు, తెగలు, మతపరమైన మైనారిటీలకు గొంతు వినిపించే అవకాశం చిన్న రాష్ట్రాలలోనే ఎక్కువ వుంటుందని!

కత్తి పద్మారావు ప్రత్యేక రాష్ట్రాన్నే సమర్థించారు. దళితులు ఎక్కువమంది చిన్న రాష్ట్రాలతోనే తమకు ప్రగతి వుంటుందని భావించాయి.

మాలలలో ఆదిఆంధ్రులు కలిసి కోస్తా ఆంధ్రలో 57.7% వుండగా, మాదిగలు 36.6% వున్నారు. తెలంగాణాలో షెడ్యూలు కులాల్లో మాదిగల సంఖ్య 61.3% వున్నారు. రాయలసీమలో కూడా మాదిగల సంఖ్య ఎక్కువగానే వుంది. రాష్ట్ర వ్యాప్తంగా చూసినప్పుడు మాదిగలు 49.2%, మాలలు 42.8% వున్నారు. కోస్తాలో "వెర్లి" కులస్థులు ఎక్కువ.

కోస్తాలో బ్రిటిషర్లు మాలలను ఎక్కువ ఆదరించారు. వాళ్లకు విద్యాబుద్ధులు నేర్పించారు. మాలలలో క్రైస్తవ మతాంతరీకరణం చెందినవారు తమని ఆది ఆంధ్రులుగా, దళిత వర్గంలోని ప్రజలుగా చెప్పుకొన్నారు. అదే సమయంలో అటువంటి అవకాశాలు తెలంగాణా అధిక సంఖ్యాక షెడ్యూల్ కులస్థులైన మాదిగలకు రాలేదు. అందువలన తెలంగాణా మాదిగలు కోస్తా మాలలతో పోటీపడలేకపోయారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడినా మాదిగలకు అనుకూల పరిస్థితులు తెలంగాణాలో కలిసిరాలేదు.

సుప్రీంకోర్టు షెడ్యూలు కులాల రిజర్వేషన్లలో వర్గీకరణను వ్యతిరేకించగా, ఉషామెహ్రా కమీషన్ (2007) వర్గీకరణను రాజ్యాంగ వ్యతిరేకం కానేకాదని, మాదిగల కోరిక సమంజసమేనని ప్రకటించింది. జోనల్ రూల్స్ కూడా షెడ్యూలు కులాల వారికి ఉపకరించేవిగా వున్నాయి.

షెడ్యూలు కులాలలో రాష్ట్రంలో రెల్లి, మాదిగ కలిపి 50.21%, మాలలు, ఇతర కులాల వారు 42.78% వున్నారు. కానీ, 70% రిజర్వేషన్ల అవకాశాలు మాల సామాజిక వర్గానికే అందాయని ఉషామెహ్రా కమీషన్ నివేదిక తెలిపింది. విద్యాలయాలలోనూ, ఇతర ప్రభుత్వోన్నత ఉద్యోగాలలోనూ మాదిగలు వెనుకబడి వున్నారని ఈ నివేదిక సారాంశం.

దళితులలో ప్రాంతీయపరంగా ఈ అసమానత స్పష్టంగా తెలంగాణా వివక్షతకి నిదర్శనంగా కన్పిస్తుంది. ఇది దళితుల ఆంతరంగిక సమస్యగా చూడనవసరంలేదని, తెలంగాణాపట్ల వివక్ష కారణంగానే మాదిగ సామాజిక వర్గం వెనకబడిందని కమిటీ నివేదికలో తేట తెల్లం అవుతోంది.

**షెడ్యూలు తెగల వారి మనోభావాలు**

1976 షెడ్యూలు కులాలు, తెగల చట్టం ప్రకారం 35 షెడ్యూలు తెగలు ఆంధ్రప్రదేశ్‌లో వున్నాయి. సుగాలీలు, కోయలు, యానాదులు, ఎరుకులు, గోండులు కొండదొరలు ఇలా అనేకులుగా షెడ్యూలు తెగలవారు రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో విస్తరించి వున్నారు. 80% శాతం గోండులు ఆదిలాబాద్‌లో జీవిస్తున్నారు. షెడ్యూలు తెగలలో 41.4% సుగాలీలున్నారు. వీళ్లు తెలంగాణాలో వివిధ జిల్లాల్లో కేంద్రీకృతంగా

ఉన్నారు. తెలంగాణాలోని షెడ్యూలు తెగల ప్రజలు ప్రత్యేక రాష్ట్రాన్నే కోరుతున్నారు. అఖిల భారత బంజారా సేవాసంఘం తెలంగాణానే కోరింది. కోస్తాలోని సుగాలీలు, ఎరుకలు ఎక్కువ లాభం పొందారనేది వారి వాదన. 1976 వరకు బంజారాలు షెడ్యూలు తెగలుగా గుర్తింపు పొందక పోవడం కూడా వాళ్లకు నష్టాన్ని కల్గించింది. కలిసి వుంటే 6% రిజర్వేషన్లు, విడిపోతే 12% రిజర్వేషన్లు కలుగుతాయని వారి నమ్మకం. షెడ్యూలు తెగలు నివసించే చిన్ని గ్రామాలకు పంచాయితీ హోదా కల్పించాలని కూడా వీరు కోరుతున్నారు. లంబాడా ప్రజలు కూడా ప్రత్యేక పంచాయితీలు కోరుతున్నారు. ఆదివాసీ ప్రజలు మాత్రం 'మన్యసీమ' లేదా సమైక్య రాష్ట్రాన్ని కోరుతున్నారు.

రాయలసీమలో లంబాడాలు తెలంగాణా వారికన్నా తాము వెనకబడి వున్నామని భావిస్తున్నారు. ఎరుకుల హక్కుల పోరాట సంఘం (కడప) వారు సమైక్య రాష్ట్రంలో ఎటువంటి లాభాలూ కలగలేదు కాబట్టి ప్రత్యేక రాయలసీమ రాష్ట్రాన్ని కోరారు. చెంచులు, నల్లమల అడవుల్లో ఎక్కువగా నివసిస్తున్నారు. వాళ్లు ఎలాంటి భావాలూ వ్యక్తం చెయ్యలేదు.

కోస్తా జిల్లాల షెడ్యూలు తెగలవారు ఐక్యరాష్ట్రాన్నే కోరుకున్నారు. విభజించడమే జరిగితే, ఆదివాసీలకు ప్రత్యేక రాష్ట్రం కావాలని అన్నారు.

సంచార జాతుల వారు కూడా తెలంగాణాలో ప్రత్యేక రాష్ట్రమే కోరారు.

గిరిజన సంక్షేమ పరిషత్ (ఖమ్మం) వారు ప్రత్యేక దండకారణ్య రాష్ట్రం కావాలని కోరారు. ఇతర రాష్ట్రాలలో షెడ్యూలు తెగలలో లేని సుగాలీ, లంబాడ లాంటి కులాల వారిని షెడ్యూలు తెగలలో చేర్చడం వలన నిజమైన ఆదివాసీ తెగలవారికి అన్యాయం జరిగిందని, ఉద్యోగాలు రాజకీయ పదవులు దక్కడం లేదని, ఆదివాసీ తెగలలోంచి వీరిని తొలగించాలని కోరుతున్నారు. రాజకీయ పార్టీలు ఓట్లకోసం ఈ పని చేశారని అంటున్నారు.

పోలవరం ప్రాజెక్ట్ వలన ఉపాధి కోల్పోతున్న ఆదివాసీల వారు తమకు పునరావకాశాల గురించి గట్టి హామీ కోరుతున్నారు.

**ఓబీసీల మనోభావాలు**

బలమైన నాయకత్వంకోసం, యన్టీ రామారావు తెలంగాణాలో ఎక్కువమంది వెనుకబడిన కులాల వారిని రాజకీయాలలోకి తెచ్చి ప్రోత్సహించారు. ఓబీసీలు ఇప్పుడు తెలంగాణాలో పలుకుబడి కలిగిన పాత్ర పోషిస్తున్నారు. వారంతా ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుతున్నారు. తెలంగాణాలో వృత్తి కళలు, చేనేత బాగా నశించి పోతోందని ప్రత్యేక రాష్ట్రం కావాలని అన్నారు. తెలంగాణా సాధారణ ఓబీసీలలో కోస్తా ఓబీసీలతో పోలిస్తే పేదరికం ఎక్కువగా వుంది.

రాయలసీమ "ఓబీసీ మహాసభ" వారు దామాషా ప్రకారం తమకు అందవలసిన రిజర్వేషన్లు అందకపోవటాన తాము వెనకబడిపోయామని అన్నారు. చిన్న రాష్ట్రాలలో ఓబీసీలకు తగిన ఆర్థిక, సామాజిక రక్షణ తగినంతగా ఉండదని, పెద్ద రాష్ట్రాలలోనే ఎక్కువ స్కాలర్‌షిప్‌లు, ఫీజు రీ ఎంబర్స్‌మెంట్‌లు దక్కే అవకాశం ఉందనీ అభిప్రాయ పడ్డారు.

కోస్తాలో ఓబీసీలు ప్రత్యేక రాష్ట్రవాదనని రాజకీయ శక్తుల కుతంత్రంగా భావించారు. రాష్ట్రం విడిపోతే ఉద్యోగావకాశాలు పడిపోతాయని అన్నారు. ఉత్తర కోస్తాలో ఓబీసీలు తాము మరింతగా వెనకబడి ఉన్నామని, తమకు ప్రత్యేకమైన ఆర్థిక ప్యాకేజీ కావాలని కోరారు. తూర్పు గోదావరిలో ఓబీసీ సంక్షేమ కార్యకర్త ఒకరు చిన్న రాష్ట్రాలతోనే ఓబీసీలకు మేలు కలుగుతుందన్నారు. ప్రకాశం నుంచి శ్రీకాకుళం దాకా ప్రత్యేక రాష్ట్రం కావాలని కోరారు.

ఈ విశ్లేషణలన్నీ పరిశీలిస్తే ఒకే కులంవారు రాష్ట్రవ్యాప్తంగా ఒకే అభిప్రాయం మీద లేరని, మనుషులు కులాల వారిగా కన్నా ప్రాంతాల వారీగా తమ మనోభావాలను వెల్లడించారని అర్థం అవుతోంది. సీమ, కోస్తా ప్రజలు హైదరాబాద్‌తో బంధాల్ని వదులు కోవడానికి సిద్ధంగా లేరని స్పష్టం అవుతోంది. హైదరాబాద్‌తో బంధాల్ని మూడు ప్రాంతాల వారు వదులుకోలేరు. ఆ చిక్కుముడిని సున్నితంగా విడదీయడమే విజ్ఞత !

**అగ్రవర్ణాలవారి మనోభావాలు**

రాష్ట్రం మొత్తం మీద 22 శాతం వున్న ఓపెన్ కేటగిరికి చెందిన అగ్రవర్ణాల వారు ఆర్థికంగానూ, రాజకీయంగానూ, సామాజికంగానూ వెనకబడి వున్నారు. వారంతా తెలంగాణాలో ప్రత్యేక రాష్ట్రవాదాన్ని గట్టిగా సమర్థిస్తున్నా. విడిపోతే తమకు ఉన్నత పదవులు దక్కుతాయని ఆశిస్తున్నారు. ఉద్యమ నాయకత్వం ఈ అగ్రవర్ణాలవారి చేతుల్లోనే వుంది. షెడ్యూలు కులాలు, ఓబీసీలు వారిని అనుసరిస్తున్నారు.

అగ్రవర్ణాలలో రెడ్డి, కమ్మ, వెలమ, కాపుల రాష్ట్రంలో అధికారాన్ని దక్కించుకోవాలని అర్రులు చాస్తున్నారు. బ్రాహ్మణుల సంఖ్య స్వల్పం. రాజకీయంగా వారి పలుకుబడి కూడా తక్కువే! ఆనాడు ఆంధ్ర రాష్ట్రాన్ని సాధించడంలో వారే ప్రధాన పాత్ర పోషించారు. ఇప్పుడు వారు అల్ప సంఖ్యాకులు. అయినప్పటికీ ఆర్థికంగా వెనుకబడినవారిలో చైతన్యాన్ని కల్గించడంలో మేధావి వర్గంలో బ్రాహ్మణులు గణనీయమైన పాత్రనే పోషిస్తున్నారు. తొలినాళ్లలో వామ పక్ష భావ జాలాన్ని వారే రగిలించగా కోస్తాలో కమ్మవారు ప్రధాన మద్దతుదార్లుగా నిలిచారు. కోస్తాలో కమ్మ సామాజిక వర్గానికి చెందిన యన్టీ రామారావు తెలుగుదేశ స్థాపన ద్వారా, రాష్ట్రంలో రెండు పార్టీల వ్యవస్థకు కారకుడయ్యాడు. రెడ్డి,

కమ్మ సామాజిక వర్గాలవారు ఈ రాష్ట్ర భవితవ్యాన్ని నిర్ణయించడంలో ప్రముఖ పాత్ర పోషిస్తున్నారు. పోషిస్తారు కూడా!

అదే సమయంలో వెలమలు, కాపులు రాజ్యాధికారం కోసం తమ వంతుగా పోటీ పడ్తున్నారు. ఈ రాష్ట్ర విభజనాంశం "రెడ్డి, కమ్మ" సామాజిక వర్గాలకు వ్యతిరేకంగా ఇతర అగ్రవర్ణాల వారు, ధనికులైన ఓబీసీలు గట్టి రాజకీయ ప్రయోజనాలను కాంక్షిస్తూ చేపట్టిన ఉద్యమంగా కమిటీ అభిప్రాయపడింది. పంచాయితీ స్థాయి వరకూ లోతైన రాజకీయాలు కమ్ముకోవడాన్ని కమిటీ గుర్తించింది.

**మైనారిటీల మనోభావాలు :**

మతపరమైన మైనారిటీలలో 89%, ముస్లింలు 9.2%, క్రైస్తవులు 1.6% వున్నట్టు 2001 సెన్సస్ జనాభా లెక్కలు తెలుపుతున్నాయి. బౌద్ధులు, జైనులు, సిక్కులు కూడా ఉన్నారు. ముస్లింలు తెలంగాణాలోనూ, రాయలసీమలోనూ ఎక్కువగా వున్నారు. వారిలో 41% హైదరాబాద్‌లోనే వున్నారు. దాని చారిత్రక కారణాలు దానికున్నాయి.

హైదరాబాద్‌కు వెలుపల వున్న తెలంగాణా ముస్లింలు ప్రత్యేక రాష్ట్రాన్నే కోరారు. సమైక్య రాష్ట్రంతో మరింత వెనుకబడతామని భావించారు. ప్రస్తుతం ఓబీసీ కేటగిరిలో ముస్లింలకు 4% రిజర్వేషన్ ఉంది. ఉద్యోగావకాశాలు, ఉర్దూ భాషాభివృద్ధి, ఉర్దూ మీడియంలో చదువు, ఉర్దూ ఉపాధ్యాయులు లేకపోవటం వీటన్నింటి రీత్యా తెలంగాణా ముస్లింలకు సమైక్య రాష్ట్రంలో ప్రయోజనం లేదని వాళ్లు స్పష్టీకరించారు. తాము గల్ఫ్ దేశాలకు బలవంతాన తరలిపోయి, అక్కడ అనేక కష్టాలు ఎదుర్కోవాల్సి వస్తోందని అన్నారు. నిజానికి తెలంగాణాలో హిందువులకు, ముస్లింలకు సాంస్కృతికమైన వ్యత్యాసం పెద్దగా కన్పించదని, ప్రత్యేక రాష్ట్రంలో అయితే కలిసి జీవించగలమని పేర్కొన్నారు.

రాయలసీమ ముస్లింలు విభజన వలన జల వనరులు ఎండిపోతాయని భావించగా, కోస్తా ముస్లింలు హైదరాబాద్‌తో తమకు గల అనుబంధాన్ని వదులుకోవటానికి ఇష్టపడ లేదు. ఒక ముస్లిం సంస్థ మాత్రమే ఇక్కడ ప్రత్యేక తెలంగాణా రాష్ట్రాన్ని కోరుకొంది.

హైదరాబాద్ ముస్లింలు ముఖ్యంగా MIM వారు సమైక్య రాష్ట్రాన్నే గట్టిగా కోరారు. విడగొట్టవలసి వస్తే రాయల తెలంగాణా ఏర్పాటు చేస్తే ముస్లింలకు మంచి అవకాశాలు పెరుగుతాయన్నారు. పెద్ద రాష్ట్రంలోనే ముస్లింలు తాము సురక్షితంగా వుంటామని భావించారు. హైదరాబాద్ ముస్లింలకు పెద్ద మార్కెట్ అవసరం. అది సమైక్య రాష్ట్రంలోనే సాధ్యం. విభజన అనేది తప్పనిసరి అయితే, గ్రేటర్ తెలంగాణా లేదా రాయల్ తెలంగాణా రాష్ట్రానికి వారు ప్రాధాన్యం ఇచ్చారు.

### క్రిస్టియన్ల మనోభావాలు

కోస్తాలో మాల సామాజిక వర్గానికి చెందిన ఎక్కువ మంది క్రైస్తవులుగా వున్నారు. కలిసి వుంటేనే ఎక్కువ లాభం అని వారు భావిస్తున్నారు. ఇతర క్రైస్తవులు కూడా అదే భావన వెలిబుచ్చారు. రాయలసీమలో క్రైస్తవులు తెలుగు ప్రజలంతా కలిసి వుండాలని వాంఛించారు.

### మహిళల మనోభావాలు

మహిళలు ఎక్కువ మానవాభివృద్ధిని, లోక సంక్షేమాన్ని కోరుకున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో మహిళలు సారా ఉద్యమం లాంటి ఉద్యమాలెన్నో నిర్వహించిన ఘనమైన చరిత్ర గల్గిన వారే! కొన్ని జిల్లాల్లో ఫ్లోరోసిస్ వ్యాధి గురించి, కొన్ని జిల్లాల్లో ఆడపిల్లల్ని అమ్ముకోవడం గురించి ఇలా సామాజికాంశాలను వారు కమిటీ ముందుకు తెచ్చారు.

విభజన అనే రాజకీయాంశానికి సంబంధించి మహిళలు తెలంగాణాలోనూ, కోస్తా సీమల్లోనూ భిన్నాభిప్రాయాలు కలిగి ఉన్నారు.

తెలంగాణా మహిళలు తమ పిల్లలు కోస్తా వారి పిల్లలతో పోటీపడగలిగే స్థితిలో లేరన్నారు. ఉద్యమంలో పనిచేస్తున్న ఆడపిల్లలు విద్యారంగంలో పురోభివృద్ధిని సాధించిన వారు గట్టిగా ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుకున్నారు. కులాలు, తరగతులు, తెగలు, మతాలు అనే భేదం లేకుండా ప్రత్యేక రాష్ట్ర వాదాన్ని మహిళలంతా విన్పించారు. అయితే హైదరాబాదు ముస్లిం విద్యార్థినులు ఈ ఉద్యమం అనవసరమైన అశాంతిని, చదువుకు అవరోధాన్ని కల్గిస్తోందని, బైటప్రాంతాలకు చెందిన విద్యార్థులు వచ్చి తమ విద్యాలయాల్ని బలవంతంగా మూయిస్తున్నారని, పరీక్షలు జరగనివ్వడం లేదని కమిటీ దృష్టికి తెచ్చారు.

కోస్తా ఆంధ్రలో మహిళలు సమైక్య రాష్ట్రంలో మూడు ప్రాంతాలలోనూ వెనుకబడిన ప్రాంతాలను ప్రత్యేకంగా అభివృద్ధి పరచడం పైన దృష్టి పెట్టాలని కోరారు. రాయలసీమ మహిళలు కూడా విడిపోతే సీమకు నష్టం జరుగుతుందని భావించారు. కర్నూలులో ముస్లిం మహిళలు గట్టిగా సమైక్యవాదాన్ని విన్పించారు. మూడు ప్రాంతాలకు చెందిన ప్రజల మధ్య వివాహ సంబంధాలు కలుపుకునే వాళ్లం అనీ, ఈ ఉద్యమం కారణంగా తెలంగాణా ప్రజలతో పెళ్లి సంబంధాలు కలుపుకోవడానికి అవరోధం ఏర్పడిందని వాళ్ళు అభిప్రాయపడ్డారు.

### విద్యార్థుల మనోభావాలు

మూడు ప్రాంతాలలోనూ, ప్రత్యేక రాష్ట్రాన్ని కోరినా, సమైక్య రాష్ట్రాన్ని కోరినా విద్యార్థులే ఉద్యమ ప్రేరకులుగా వున్నారు. తెలంగాణా విద్యార్థుల్లో - కుటుంబంలో మొదటిసారిగా ఉన్నత విద్యావకాశాలు పొందిన వాళ్లు ఎక్కువ. ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే

తమకు మరిన్ని అవకాశాలు కలుగుతాయని వాళ్లు గట్టిగా నమ్ముతున్నారు. విద్యా రంగంలో తెలంగాణా వెనకబడివుందని, కొత్త రాష్ట్రంతోనే అది మెరుగు పడ్తుందని తెలంగాణా విద్యార్థులు బలంగా విశ్వసిస్తున్నారు. హిందీ, ఇంగ్లీషు పాస్ మార్కుల విషయంలో కూడా వాళ్లు తమకు అన్యాయం జరుగుతున్నట్లు భావిస్తున్నారు. నవంబర్ 30 - ఫిబ్రవరి 27 మధ్య 313 ఆత్మహత్యలు జరిగాయి. మరణించినవారిలో వరంగల్, కరీంనగర్, మెదక్ జిల్లాల వారే ఎక్కువ. అందులో 60 మంది 18-25 సంవత్సరాల మధ్య వయస్కులు. 158 మంది 25-50 సంవత్సరాల మధ్య వయస్కులు. 8% మహిళలున్నారు. 10% ఆత్మహత్యలకు విఫలయత్నం చేసిన వారున్నారు. 45% షాక్‌కు గురై గుండెపోటుతో మరణించారు. ఉస్మానియాలో జరిగిన మరణాలు ఎక్కువ ప్రచారంలోకి వచ్చాయి. కె.సి.ఆర్ ప్రత్యేక రాష్ట్రంతోనే విద్యార్థుల భవిష్యత్తు బావుంటుందని గట్టిగా నమ్మించగలిగారు.

ఇందుకు భిన్నంగా కోస్తా విద్యార్థులు విభజనను పూర్తిగా వ్యతిరేకిస్తున్నారు. హైదరాబాద్ పరిసర ప్రాంతాలలోని విద్యాసదుపాయాలు తమకు అందకుండా పోతాయని వాళ్లు నమ్ముతున్నారు. రాష్ట్రం విడిపోతే హైదరాబాద్‌లో ఉద్యోగవకాశాల విషయంలో తాము పరాయి వాళ్లమైపోతామని, తమ ప్రాంతానికి తీరని నష్టం జరుగుతుందని వారు భయపడుతున్నారు.

రాయలసీమ విద్యార్థులు కూడా విభజనను వ్యతిరేకించి, హైదరాబాద్‌లో వున్న విద్యా ఉద్యోగ అవకాశాలు రాష్ట్రంలోని అందరికీ సమానంగా అందేలా చర్యలు తీసుకోవాలని కోరారు. విడిపోతే యూనివర్శిటీలకు నిధులు తగ్గిపోతాయన్నారు. ఈ ప్రాంతంలోని ఒక విద్యార్థి ఐక్యకార్యాచరణ సమితి రాష్ట్ర విభజన వలన తిరిగి కులతత్వం, భూస్వామ్య వ్యవస్థ పెచ్చుమీరి, ప్రజాస్వామ్యం దెబ్బతింటుందని అభిప్రాయపడింది.

తెలంగాణాలో వృత్తి విద్యలు కాకుండా ఇతర చదువులు సాధారణ డిగ్రీలు చదివే వారు హైదరాబాద్ లేకపోతే తమకు భవిష్యత్తే వుండదేమోననే భయాందోళనలు వ్యక్తపరిచారు. కోస్తాలో ప్రత్యామ్నాయంగా వ్యవసాయం అయినా ఉంది. తెలంగాణా, రాయలసీమల్లో అది చాలా తక్కువ.

ఈ వివరాలను బట్టి విద్యార్థుల మనోగతాన్ని అర్థం చేసుకోవచ్చు. కెరీర్‌ని కోరుకొంటున్నవారు హైదరాబాద్‌తో ముడిపడి ఆశలు పెంచుకొన్నారు. హైదరాబాద్ అంశమే లేకపోతే, తెలంగాణా విడిపోవటానికి ఎవరికీ అభ్యంతరం ఉన్నట్టు కన్పించదు!

రాష్ట్రం మొత్తం మీద అభివృద్ధి కేవలం హైదరాబాద్‌లోనే కేంద్రీకృతం అయి వుంది. దాన్ని ఇప్పుడు ఒక ప్రాంతానికి ధారదత్తం చేసి, మిగిలిన ప్రాంతాల వారిని అక్కడకు రాకుండా చేయడం వలన జరిగే నష్టం గురించి ఆ ప్రాంతాలవారు ఆందోళన చెందడంలో అర్థం ఉంది. అందుకే పోటీ పరీక్షలలో నెగ్గుకు రాగలిగేలా వెనుకబడిన

వారికి ప్రత్యేక శిక్షణనివ్వడం ఒక్కటే దానికి పరిష్కారంగా కమిటీ అభిప్రాయపడింది. "విద్యలో నాణ్యతా ప్రమాణాలు పెరగాలి-" అని కమిటీ సూచించింది. తక్కువ ప్రమాణాలు వున్నప్పటికీ ఉద్యోగాలు వచ్చేస్తాయనుకోవటం పొరబాటు. ప్రమాణాలు ఎక్కువగానే వున్నప్పుడే పోటీలో నెగ్గుకురాగలుగుతారు. హైదరాబాద్‌లోనే కాదు - దేశంలోనూ, విదేశంలోకూడా నెగ్గుకురాగలిగేలా మన ప్రమాణాలు పెరగడం అవసరం - అదే ముఖ్యం అని కమిటీ నివేదిక సూచిస్తోంది.

**"కులాలు, తెగలు, మతం, ప్రాంతాల పరంగా అభివృద్ధి"**

తెలంగాణా వాదుల అభిప్రాయం ప్రకారం 89 శాతంగా వున్న SC, ST, OBC మైనారిటీలకు ప్రత్యేక రాష్ట్రంలో రిజర్వేషన్లు ఎక్కువగా అందుతాయని! కోస్తా ప్రాంతం వారితో పోటీ పడవలసిన అవసరం వుండదనీ!!

కమిటీ విశ్లేషణ ఈ అంశంపై ఈ విధంగా వుంది.

1) పై గ్రూపు ప్రజలు ఆంధ్రప్రదేశ్‌లో 32% వుండగా తెలంగాణా విడిపోతే 37% మాత్రమే అవుతారు. కానీ, ఈ కులాలు తెగలు, మైనారిటీల సంఖ్య కోస్తా, సీమల్లో 28.4 శాతానికి తగ్గిపోతుంది. ఆ మేరకు వారు కోస్తాసీమల్లో నష్టపోతారు కదా... అని కమిటీ ప్రశ్నించింది.

2) తెలంగాణాలో ఈ అధిక సంఖ్యాకులైన నిమ్న వర్గాల వారు అగ్రవర్ణాలవారిని అవలీలగా అధిగమించవచ్చని, రాజకీయంగా తమకి పెద్ద వాటా లభిస్తుందని ఆశిస్తున్నారు.

3) రాజకీయ విశ్లేషకులు కూడా చెప్పేదేమంటే రాష్ట్రంలో సర్దుబాటు రాజకీయాలు (Politics of accommodation) ఎక్కువగా నడుస్తున్నాయని! అగ్ర వర్ణాలవారు తమకు సంఖ్యాబలం తక్కువే అయినప్పటికీ, పైకొస్తున్న ఇతర కులస్థులతో చేతులు కలిపి, వారికి కొన్ని తాయిలాలు (పదవులు) ఆశ చూపించి, మొత్తం అధికారాన్ని తమ గుప్పెట్లో పెట్టుకొంటూ వుంటారు. రాయలసీమ, కోస్తా ప్రాంతాల రాజకీయ శక్తుల మధ్య ఈ సర్దుబాటు రాజకీయాల ఫలితమే సీమవారి రాజకీయాధిపత్యం, కోస్తావారి ధనాధిపత్యం పెచ్చుపెరగడానికి కారణం. కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల పరంగా ఈ రెండు ప్రాంతాలు కలిసి మొత్తం రాష్ట్రాన్ని గుప్పెట్లో పెట్టుకున్నాయి. అగ్రవర్ణాలవారి కింద నలిగిపోతున్నట్లు తెలంగాణా వారు భావిస్తున్నారు. తెలంగాణా వరకూ ఈ నిమ్న వర్గాల వారికి మేలు జరిగే విషయం అలా వుంచితే, కోస్తా సీమల్లో నిమ్న వర్గాలవారు మరింతగా అణచివేతకు గురి అయ్యేది ఖాయం అని కమిటీ నివేదిక చదివితే అభిప్రాయం ఏర్పడుతుంది.

కమిటీ ప్రస్తావించిన ఈ సర్దుబాటు రాజకీయాల వలన తెలంగాణాలో తిరిగి రాజాధికారం అగ్రవర్ణాల వారికే వెడ్తుంది. ఏ వ్యక్తులు ఇన్నాళ్ళూ తెలంగాణాలో అభివృద్ధిని

ఏకభుక్తంగా అనుభవించి తెలంగాణా వెనుకబాటుతనానికి కారకులయ్యారో వారే రేపు పాలకులౌతారు. పరిస్థితి ఎక్కడ వేసిన గొంగళి అక్కడేనన్నట్లవుతుంది. తెలంగాణాలో నిమ్నవర్గాలవారు తమకు రాజ్యాధికారం ఉన్నప్పుడే తెలంగాణా రాష్ట్ర ఏర్పాటుకు అంగీకరించాలి. లేకపోతే, ఏవో కాసిని తాయిలాలు తప్ప, పెద్దగా తాము లాభపడకపోగా, కోస్తా సీమల్లోని సాటి నిమ్నవర్గాలవారిని బాగా నష్టపరిచే చర్య అవుతుంది. తద్వారా నిమ్న వర్గాలవారు రెంటికీ చెడ్డరేవడి అయ్యే ప్రమాదం ఉందనీ, ఈ విషయాన్ని కూడా దృష్టిలో వుంచుకోవాల్సిన అవసరం వుందనీ కమిటీ విశ్లేషణ స్పష్టీకరిస్తోంది.

## సాంస్కృతికాంశాలు

**Language spoken by regional distribution**

| Region | Telugu | Urdu | Tamil | Marathi | Others |
|---|---|---|---|---|---|
| Andhra Pradesh | 85 | 8 | 1 | 1 | 5 |
| Telangana inc Hyderabad | 77 | 12 | 1 | 2 | 9 |
| Telangana exc Hyderabad | 81 | 8 | 0 | 2 | 8 |
| Hyderabad | 47 | 39 | 2 | 2 | 10 |
| Rayalaseema | 80 | 12 | 4 | 0 | 4 |
| Coastal Andhra | 93 | 4 | 1 | 0 | 2 |

***Source*** : *AP Statistical Abstract 2009, based on Census 1991*
***Note*** : *The figures are in percentages and may not add to 100 due to rounding off*

హైదరాబాద్ మినహా తెలంగాణాలో 81% ప్రజలు తెలుగే మాట్లాడుతున్నారు. సీమలో 80%, కోస్తాలో 93% తెలుగు మాట్లాడేవారున్నారు. తెలంగాణాలో 400 ఏళ్ల ముస్లిం పాలన కారణంగాను, నిజాం కాలంలో మరాఠి, కన్నడ ప్రాంతాలు కూడా నిజాం రాజ్యంలో కలిసి వుండటం చేత ఆయా భాషల ప్రభావం, ఆయా భాషలు మాట్లాడే ప్రజలు కూడా తెలంగాణాలో దాదాపు 10% వరకూ వున్నారు. బ్రిటిష్ పాలనలోనూ, ఇతర విదేశీయుల పాలనలోనూ మూడు వందల ఏళ్లపాటు తమిళ ప్రాంతంలో కలిసి, వుండటం చేత, సీమలో 4%, కోస్తాలో 1% తమిళ భాష మాట్లాడేవారున్నారు. ఇంకా ఇతర ఆదివాసీ భాషల ప్రజలు నివసిస్తున్నారు.

ఈ భాషాపరమైన భిన్నత్వం రెండు ప్రాంతాలలోనూ చారిత్రక కారణాల వలన వుంది. అయితే, ఈ భిన్నత్వం ఆ రెండు ప్రాంతాల మధ్య బంధాన్ని ఏవిధంగా నిరాకరిస్తోందని కమిటీ ప్రశ్నించింది. తెలంగాణా వారు అనేదేమంటే, కోస్తావారు తమది ప్రామాణిక భాష అనీ, తెలంగాణా 'భాష'ని అవహేళనగా మాట్లాడతారనీ, పాఠ్య పుస్తకాలలో తెలంగాణా భాషకు తగిన గుర్తింపు లేకుండా పోయిందనీ, కోస్తావారి భాషలోనే పాఠ్య పుస్తకాలు రాస్తున్నారని, ప్రభుత్వ కార్యాలయాలు, విశ్వవిద్యాలయాలు, కళాశాలల్లో

తెలంగాణ భాషని కించపరుస్తున్నారని, భాషాపరంగా మూడు ప్రజల మధ్య ఐకమత్యం లేదని కమిటీ దృష్టికి తీసుకువచ్చారు.

కోస్తాలోని మేధావులు ఈ వాదనతో ఏకీభవించారు. అయితే మూడు ప్రాంతాల మధ్యా తెలుగే భాషాపరమైన బంధాలు ఏర్పరచిందని, తెలంగాణా యాసేగాని, ప్రత్యేక భాషకాదని, ఇటువంటి మాండలిక వ్యత్యాసాలు రాష్ట్రంలో అనేకం వున్నాయని, కొన్ని పదాలకు ఒక్కో ప్రాంతంలో ఒక్కో అర్థం ఉందనీ, భాషని ఉచ్చరించే తీరు ఆ ప్రాంతాన్ని బట్టి, అక్కడి మనుషులని బట్టి కులాలను బట్టి, ఆ వ్యక్తుల తరగతిని బట్టి వుంటుందని కమిటీ దృష్టికి తీసుకురావడం జరిగింది. విజయవాడలో కమిటీ సమావేశం జరిగినప్పుడు ఈ గ్రంథ రచయితకు మాట్లాడే అవకాశం ఇచ్చారు. కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన రాష్ట్రంలో మాండలిక వ్యత్యాసాలు ఎన్ని రకాలుగా ఉన్నాయో వివరిస్తూ, కోస్తా, సీమల్లో వున్న ఎన్నో రకాల మాండలిక భేదాలను కమిటీ వారి దృష్టికి తీసుకువచ్చి, వాటికి సముచిత గౌరవం కల్పించాలని కోరడం జరిగింది.

ఆ విషయాలను కమిటీ అధ్యయనంచేసి, విశ్లేషించి, మాండలిక భేదాలు ఎన్ని ఉన్నప్పటికి రాష్ట్రం మొత్తం మీద 85% మంది ప్రజలు తెలుగు భాషనే మాట్లాడుతున్నారని అభిప్రాయపడింది. ఈ మాండలిక వ్యత్యాసాలు తెలంగాణాకి మాత్రమే పరిమితమైనవి కావనీ దేశం మొత్తం మీద అన్ని భాషల్లోనూ ఇవి కన్పిస్తాయని, ఈ మాండలికాలకు సాహిత్యంలో ఉన్నత గౌరవం కల్పించబడాలని, అంతకన్నా ముఖ్యం రాష్ట్రంలోని ఆదివాసీల భాషలను ముందుగా సంరక్షించవలసిన అవసరం ఉందనీ కమిటీ సూచనలతో కూడిన నివేదికని అందించింది. మాండలిక వ్యత్యాసాన్ని ప్రత్యేక భాషగా భావించి ప్రత్యేక రాష్ట్రం ఇవ్వడం సాధ్యం కాదని కూడా కమిటీ పేర్కొన్నది.

ఉర్దూ భాషకు ద్వితీయ అధికార భాష హోదాని ముస్లింలు గట్టిగాకోరుతున్నారు. కడుపు చించుకొంటే కాళ్ల మీద పడ్తుందని, మొదటి అధికార భాషగా తెలుగు అమలు గురించే 53 ఏళ్లుగా ఎలాంటి అభివృద్ధినీ పట్టించుకోని ఈ ప్రభుత్వం రెండవ అధికార భాష గురించి పట్టించుకొంటుందనుకోవటం భ్రమ. మైనారిటీ ఓటు బ్యాంక్ రాజకీయాల ప్రభావంతో ఉర్దూ భాషకు న్యాయం చేయడం ప్రభుత్వానికి పెద్ద సమస్యేమీ కాకపోవచ్చు. కానీ, తెలుగు పేరు చెబితేనే మండిపడే ఇంగ్లీషు భాషాభిమానులు మన అధికారుల్లో కూడా ఎక్కువ మందే వున్నారు. వాళ్లు పాలనాభాషగా తెలుగును రానివ్వరు. వారికి తెలంగాణా వాదం ఊతం ఇచ్చినట్లయ్యింది.

ఇతర ప్రాంతాలవారి భాషని, వేషాల్ని, యాసని, సంస్కృతినీ తెలుగు సినిమాలలో ఇష్టారాజ్యంగా చిత్రిస్తున్నారు. ఈ సినిమా వాళ్లలో వారూ వీరూ అని లేదు అన్ని ప్రాంతాల వారూ వున్నారు. తెలంగాణా యాసనీ, కోస్తాలో బ్రాహ్మణుల్ని, ఇతర కులాలను ఫ్యాక్షనిజం పేరుతో రాయలసీమ వాసుల్ని కించపరిచే ఈ ధోరణుల్ని మూడు ప్రాంతాలవారూ

ముక్త కంఠంతో ఖండించాలి. వివక్షతని ప్రదర్శించే సినిమాల్ని, రచనల్ని, ఇతర కళారూపాల్ని బహిష్కరించాలి. ఫ్యాక్షనిష్టులు మూడు ప్రాంతాలలోనూ ఉన్నారు. కానీ, రాయలసీమ ప్రజలంతా ఫ్యాక్షనిష్టులేననే భావాన్ని ప్రచారం చేశారు. దానికి ముగింపు పలకాలి.

తెలంగాణా సంస్థలకు నిధులు ఇవ్వడంలేదని, తెలంగాణా కళారూపాలపట్ల కోస్తా మేధావి వర్గంలో నెగెటివ్ దృక్పథం వుందనీ, బతుకమ్మ, బోనాలు లాంటి తెలంగాణా పండుగలకు రాష్ట్ర గుర్తింపు లేదనీ, తెలంగాణా ప్రజల్ని ఆదివాసీలతో పోల్చి చూస్తారనీ, తెలంగాణా గ్రామ దేవతలని కోస్తావారు నవ్వుతారని, కోస్తావారి పండుగలనే తెలుగు సంస్కృతిగా పాఠాలలో బోధిస్తారని, తెలంగాణా పండుగల్ని పాఠ్యపుస్తకాల్లో ఎక్కడా ప్రస్తావించరని ఐలయ్యగారి పుస్తకంలో అంశాలను కమిటీ ప్రస్తావించి అధ్యయనం చేసింది. మొత్తం మీద తెలంగాణా అంటే కోస్తావారికి నవ్వులాటగా ఉందని తెలంగాణా వారి ఆరోపణ. అంతేకాదు, తెలంగాణా విమోచన జరిగి భారతదేశంలో విలీనం అయిన రోజును ఈ రాష్ట్రంలో ఉత్సవంగా జరుపుకోవడం లేదన్న సంగతిని కూడా కమిటీ గుర్తించింది.

అయితే ఈ ఆరోపణలకు కమిటీ కొంత సమాధానం ఇచ్చేందుకు ప్రయత్నించి నప్పటికీ, తెలంగాణా సంస్కృతికిగల ప్రత్యేకతని, దాని విమోచన దినానికిగల ప్రాముఖ్యతని ప్రభుత్వంగానీ, ఇతర ప్రాంత ప్రజలుగానీ, తగురీతిలో గౌరవించని మాట వాస్తవం. రాష్ట్రం కలిసి వున్నా, విడిపోయినా, తెలంగాణా వారితో తెలుగు భాషాపరంగా వున్న బంధం కాదనుకొంటే తెగేది కాదు. కాబట్టి, భవిష్యత్తులో ఇలాంటి సంఘటనలు జరగకుండా అన్ని ప్రాంతాల వారూ గట్టి మాట తీసుకోవడం అవసరం. ఒక వేళ రాష్ట్రం విభజించబడినా, కోస్తా సీమల ప్రజలు తెలంగాణా విమోచన దినాన్ని జరుపు కోవలసినంత గొప్ప సంఘటన అది !

రాష్ట్రాల పునర్విభజన సంఘం ఆనాడు "భారతదేశం, దేశంలోని రాష్ట్రాలు తమతమ సంస్కృతులను వికసింప చేసుకొని, సంపన్నతని, ప్రత్యేకతని చాటుకునేలా అవకాశం కల్పించాలి" అని చెప్పిన మాటే నేటికీ శిరోధార్యంగా కమిటీ అభివర్ణించింది. ఆత్మవిశ్వాసం ఆత్మగౌరవం మనసు లోపల్నించి పెరగాలేగాని, బైటనుంచి చట్టాల ద్వారా పొందగలిగేది కాదు – అని కమిటీ వ్యాఖ్యానించింది.

తెలంగాణాలో మిశ్రమ సంస్కృతికి, చారిత్రక కారణాలు అనేకం కమిటీ గుర్తించి విశ్లేషించింది. వలసలుగా వచ్చిన వారు నిజామాబాద్, ఖమ్మం, వరంగల్ తదితర జిల్లాలలో గుంటూరు పల్లె, కమ్మగూడెం, తూరుపు కమ్మవాద, కొత్తూరు లాంటి ప్రాంతాలను ఏర్పరచుకున్నారు. ఈ పేర్లే వలసలకు నిదర్శనం. వాళ్లు గర్విష్టులుగా వ్యవహరిస్తున్నట్లు తెలంగాణా వారు ఆరోపించిన విషయాన్ని ప్రస్తావిస్తూ వలస వచ్చిన వారి అభివృద్ధి

అసూయా ద్వేషాలకు గురి అయినట్లు కమిటీ భావించింది. 1969లో అలా వలస వచ్చిన వారిపైన ఈ కారణంగానే తీవ్రమైన దాడులు జరిగాయి. నిజానికి అనేక తరాలుగా అక్కడ స్థిరపడి పోయి, తెలంగాణా వారిగానే జీవిస్తున్న కుటుంబాల పరిస్థితి కూడా కమిటీ గుర్తించింది. ఒకవేళ విభజన జరిగితే వాళ్లకు తగిన రక్షణ కల్పించాల్సి వుంటుందని కమిటీ సూచించింది.

**రాజకీయ ప్రాధాన్యత కల్పించే అంశం**

రాష్ట్ర రాజకీయ నిర్ణయాలలో తెలంగాణా రాజకీయ నాయకులకు ప్రాధాన్యత లేకుండా పోతోందని, అందువలన తెలంగాణా ప్రాంతం నిర్లక్ష్యానికి, వివక్షతకు గురి అవుతోందనేది తెలంగాణా రాజకీయవాదుల అభిప్రాయం. సీమ, కోస్తా ప్రాంతాల వారి ఆధిపత్యం వలన తెలంగాణా అభివృద్ధికి అవరోధం కలుగుతోందని వారంటున్నారు.

రాష్ట్ర విభజన సమయంలో 60 : 40 దామాషాలో మంత్రిపదవులు వుండాలని పెద్ద మనుషుల ఒప్పందం. ముఖ్యమంత్రి ఒక ప్రాంతం వారైతే, ఉపముఖ్యమంత్రి వేరొక ప్రాంతం వారు కావాలనేది మరొక ఒప్పందం.

**Distribution of Important Portfolios**

| | Home | | | Finance | | | Revenue | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | Telangana | Rayala seema | Coastal Andhra | Telangana | Rayala seema | Coastal Andhra | Telangana | Rayala seema | Coastal Andhra |
| Number | 13 | 2 | 8 | 5 | 0 | 15 | 13 | 3 | 11 |
| Duraction | 31 Years | 1.4 Years | 10.8 Years | 9.5 Years | 0 Years | 26.4 Years | 23.10 Years | 4.9 Years | 20.9 Years |

ముఖ్యమైన మంత్రిపదవుల్లో హోంశాఖ ఒకటి. రాష్ట్ర హోం మంత్రులుగా తెలంగాణావారు 13 మంది, 31 సంవత్సరాలపాటు హోంశాఖని నిర్వహించారు. సీమ, కోస్తాలవారు 11 మంది 11 సంవత్సరాలు నిర్వహించారు.

సీమ, కోస్తావారు 15 మంది ఆర్థిక శాఖని 26.5 సంవత్సరాలు నిర్వహించారు. తెలంగాణావారు 5 మంది నిర్వహించారు. తక్కిన సంవత్సరాలు ముఖ్యమంత్రే ఆ పదవిని నిర్వహించారు. ఈ ముఖ్యమంత్రులు సీమవారే కావడంతో సీమవారికి, ఆర్థిక మంత్రులుగా చేసే అవకాశం ఎక్కువ వచ్చింది.

రెవెన్యూ శాఖకు సంబంధించి తెలంగాణా వారు 13 మంది (23 సంవత్సరాలు), కోస్తా, సీమ కలిపి 14 మంది 25 సంవత్సరాలకు పైగా నిర్వహించారు.

మొత్తం మీద 1956-2010 మధ్య కేబినెట్లలో తెలంగాణా మంత్రులు ఒకసారి ఎక్కువ, ఒకసారి తక్కువ కొద్దిపాటి తేడావున్నా మొత్తం మీద 40% కన్నా ఎక్కువమందే తెలంగాణా నుంచి మంత్రి పదవులు పొందారని కమిటీ గుర్తించింది.

నీటిపారుదల మంత్రిత్వశాఖే అన్నింటికన్నా ముఖ్యమైంది. మధ్యతరహా, పెద్దతరహా నీటిపారుదల శాఖలను నిర్వహించిన మంత్రులు తెలంగాణా వారు 20 సంవత్సరాలు, కోస్తావారు 16 సంవత్సరాలు, సీమవారు 6 సంవత్సరాలు నిర్వహించినట్లు కమిటీ అధ్యయనంలో వెల్లడైంది.

కాబట్టి ముఖ్యమైన మంత్రిపదవులు నిర్వహిస్తున్న కాలంలో తెలంగాణా మంత్రులు వివక్షతని ఎందుకు కొనసాగనిచ్చారు అనే ప్రశ్న సహజంగానే ఉత్పన్నమౌతుంది. ముఖ్య మంత్రులు ఎక్కువ మంది కోస్తా, సీమల వారే కాబట్టి, డబ్బు మీద అదుపు వారిదే కాబట్టి, వివక్ష కొనసాగిందని, అవతలి పక్షం వాళ్లు చాలా తేలికగా పదవులను తీసుకున్నారని దానికి సమాధానంగా వాదించవచ్చు. ప్రత్యేక తెలంగాణా వస్తే ఈ ఆధిపత్య వర్గాల బారినుండి తెలంగాణా మంత్రులను కాపాడవచ్చు అని కూడా చెప్పవచ్చు.

కోస్తా, సీమ ప్రాంతాల్లో మంత్రులు రాజకీయ కుటుంబాల నుంచి వచ్చినవారు ఎక్కువ మంది ఉన్నారని, రాజకీయ - వాణిజ్య పరమైన కుటుంబాల వారని, తెలంగాణాలో అలా రాజకీయ నేపథ్యం వున్న కుటుంబాలనుంచి వచ్చినవారు లేరనీ వాదించవచ్చు. 2009 ఎన్నికలో 92% సీమ, కోస్తా పార్లమెంటల్ సభ్యులకు రాజకీయ నేపథ్యం వుండగా తెలంగాణాలో 35% మాత్రమే రాజకీయ నేపథ్యం వున్న కుటుంబాల వారున్నారని, శాసన సభ్యుల్లో 63% కోస్తా సీమల్లోనూ, 20% తెలంగాణాలోనూ రాజకీయ కుటుంబీకులు వున్నారని పేర్కొంటున్నారు.

1983 నుంచి యన్టీ రామారావు, చంద్రబాబునాయుడు, రాజశేఖరరెడ్డి, కోట్ల విజయ భాస్కరరెడ్డి వీళ్లంతా రాజకీయ పరంగా వాళ్లకి అనుకూలమైన తెలంగాణా వారికి పదవులు కట్టబెట్టారు. అదే సమయంలో వీళ్లని ఎదుర్కోగలిగే రాజకీయ కుటుంబాలు అనేవి తెలంగాణాలో లేకపోవడం కూడా ఒక కారణంగా చెప్తున్నారు.

అగ్రవర్ణాలలో రెడ్డి, కమ్మ కులాలవారు, వెనకబడిన కులాలలో కాపు, యాదవ, గౌడ కులాలవారు, రాజకీయ ప్రాముఖ్యత కల్గిన కొంతమంది SC, ST కులాలవారు మాత్రమే తమ ప్రాతినిధ్యాన్ని నిలబెట్టుకోగలిగారు. కొద్దిమంది ముస్లింలు కూడా మంత్రులయ్యారు. తక్కువ వారికి ప్రాధాన్యత లభించనప్పుడు వారు గొంతెత్తడం సహజం. ఎవరైనా ఇలా గొంతెత్తడాన్ని అసూయ ద్వేషాలుగా చిత్రించడం కూడా అన్యాయమే! రాజకీయ నాయకుల్ని దైవాంశ సంభూతులుగా చిత్రించి, వారికి, వారి కుటుంబాల వారికి తరతరాల దాస్యం చేసే మన ప్రజలలోని బలహీనతకి ఈ పరిణామాలు ఒక నిదర్శనం. ఎంతటివాడైనా జీవితంలో మూడోసారి ముఖ్యమంత్రిగాని, మంత్రిగాని చేయకూడదనే నియమం తీసుకురాగలిగితే తప్ప, ఇలాంటి వంశపారంపర్య రాజకీయాలకు విరుగుడు వుండదని కమిటీ నివేదిక చదివితే ఎవరికైనా అన్పిస్తుంది.

తెలంగాణాలో వామపక్ష భావజాలం కల్గినవారు ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే, తెలంగాణాలో నిమ్నవర్గాలవారు అగ్రవర్ణాల వారిని అధిగమించగలరని, అగ్రవర్ణాల ఆధిపత్యానికి చరమగీతం పాడగలరనీ కమిటీ ముందు పేర్కొన్నారు.

ప్రాంతీయ సాధికారత, రాజకీయ అధికారాలను మరింత ప్రాంతీయం చేయటం, నిజాయితీతో కూడిన చర్యలు తీసుకోకపోతే, ఈ సమస్య మరింత పెరుగుతుందే గాని తగ్గదు.

**Socio-Cultural Groups and development, Regions of Andhra Pradesh, 1983 to 2007/8**

| | Monthly per capita consumption, Rs. 2004-5 prices | | | Poverty, Tendulkar line, Head Count ratio | | |
|---|---|---|---|---|---|---|
| | Rs. per capita per month | | Change in% points | % of population | | Change in % points |
| **Regions** | **1983** | **2007** | **1983-2007** | **1983** | **2007** | **1983-2007** |
| **Telangana** | | | | | | |
| SC+ST+Mus | 465 | 731 | 57 | 69 | 21 | -48 |
| Not (SC+ST+Mus) | 557 | 994 | 79 | 55 | 10 | -44 |
| All | 527 | 898 | 71 | 59 | 14 | -45 |
| **Rayalaseema** | | | | | | |
| SC+ST+Mus | 392 | 615 | 57 | 80 | 28 | 52 |
| Not (SC+ST+Mus) | 487 | 789 | 62 | 66 | 28 | -38 |
| All | 463 | 731 | 58 | 70 | 28 | -42 |
| **Coastal Andhra** | | | | | | |
| SC+ST+Mus | 490 | 752 | 54 | 63 | 23 | -41 |
| Not (SC+ST+Mus) | 578 | 973 | 68 | 51 | 12 | -39 |
| All | 559 | 900 | 61 | 53 | 15 | -38 |
| **Andhra Pradesh** | | | | | | |
| SC | 462 | 715 | 55 | 69 | 22 | -47 |
| ST | 440 | 693 | 58 | 77 | 39 | -38 |
| Muslim | 471 | 749 | 59 | 62 | 12 | -50 |
| OBC* | | 791 | 35 | | 19 | -25 |
| Others | 553 | 947 | 71 | 55 | 14 | -41 |
| All | 529 | 868 | 64 | 59 | 17 | -42 |

***Source :*** *NSS consumer expenditure surveys for 1983, 1999 and 2007/8*

***Notes :*** ** for OBC, the column 1983-2007 represents the years 1999-2007*

***Notes:*** *1. Poverty is defined according to the Tendulkar poverty report line which has been updated for 2007/8 using the CPI data for agricultural workers for rural areas and the CPI for industrial workers for urban areas.*

*2. The 1983-07 column is the simple percentage.change of the 2007 value for each category over its 1983 value; because of changes in population composition, it will not be the same as a simple weighted average of the change in the individual components.*

**Socio-Cultural Groups and development, Regions of Andhra Pradesh, 1983 to 2007/8**

| | Literacy, ages >= 8years | | | Youth Literacy, ages 8-24 | | |
|---|---|---|---|---|---|---|
| | | | % Change | | | % Change in |
| **Regions** | **1983** | **2007** | **1983-2007** | **1983** | **2007** | **1983-2007** |
| **Telangana** | | | | | | |
| SC+ST+Mus | 26 | 56 | 114 | 38 | 87 | 127 |
| Not (SC+ST+Mus) | 39 | 65 | 68 | 51 | 91 | 80 |
| All | 34 | 62 | 80 | 46 | 89 | 93 |
| **Rayalaseema** | | | | | | |
| SC+ST+Mus | 29 | 52 | 81 | 40 | 79 | 98 |
| Not (SC+ST+Mus) | 43 | 58 | 35 | 55 | 83 | 51 |
| All | 39 | 56 | 45 | 51 | 82 | 62 |
| **Coastal Andhra** | | | | | | |
| SC+ST+Mus | 34 | 58 | 73 | 46 | 86 | 86 |
| Not (SC+ST+Mus) | 46 | 63 | 36 | 57 | 88 | 56 |
| All | 43 | 62 | 42 | 54 | 88 | 61 |
| **Andhra Pradesh** | | | | | | |
| SC | 25 | 56 | 123 | 39 | 90 | 132 |
| ST | 15 | 42 | 190 | 23 | 70 | 207 |
| Muslim | 50 | 68 | 37 | 59 | 84 | 44 |
| OBC* | | 57 | 21 | | 86 | 24 |
| Others | 43 | 63 | 46 | 54 | 88 | 62 |
| All | 39 | 61 | 55 | 51 | 87 | 72 |

***Source:*** *NSS consumer expenditure surveys for 1983, 1999 and 2007/8*

***Notes :*** *1. Literacy is defined as two or more years of education.*

*2. The 1983-07 column is the simple percentage change of the 2007 value for each category over its 1983 value; because of changes in population composition, it will not be the same as a simple weighted average of the change in the individual components.*

***Notes :*** **forOBC, the column 1983-2007 represents the years 1999-2007.*

**Socio-Cultural Groups and development, Regions of Andhra Pradesh, 1983 to 2007/8**

| | Female to male literacy, ages >= 8, in % of male literacy | | | Female to male literacy, ages 8 -24, in % of male literacy | | |
|---|---|---|---|---|---|---|
| | | | % Change | | | % Change |
| **Regions** | **1983** | **2007** | **1983-2007** | **1983** | **2007** | **1983-2007** |
| **Telangana** | | | | | | |
| SC+ST+Mus | 45 | 68 | 52 | 54 | 87 | 60 |
| Not (SC+ST+Mus) | 45 | 70 | 55 | 56 | 95 | 70 |
| All | 45 | 69 | 54 | 55 | 92 | 67 |
| **Rayalaseema** | | | | | | |
| SC+ST+Mus | 36 | 54 | 51 | 50 | 67 | 33 |
| Not (SC+ST+Mus) | 49 | 72 | 46 | 64 | 85 | 33 |
| All | 47 | 66 | 42 | 61 | 79 | 28 |
| **Coastal Andhra** | | | | | | |
| SC+ST+Mus | 50 | 76 | 52 | 59 | 95 | 62 |
| Not (SC+ST+Mus) | 63 | 78 | 24 | 75 | 89 | 19 |
| All | 60 | 77 | 28 | 71 | 91 | 28 |
| **Andhra Pradesh** | | | | | | |
| SC | 43 | 72 | 68 | 53 | 91 | 71 |
| ST | 19 | 56 | 196 | 21 | 70 | 239 |
| Muslim | 56 | 69 | 22 | 74 | 86 | 16 |
| OBC* | | 69 | 7 | | 87 | 9 |
| Others | 54 | 74 | 35 | 67 | 91 | 36 |
| All | 52 | 72 | 38 | 64 | 89 | 40 |

***Source:*** *NSS consumer expenditure surveys for 1983. 1999 and 2007/8*

***Notes*** *: * for OBC, the column 1983-2007 represents the years 1999-2007*

***Note*** *: 1. Each cell, except percentage change, represents the ratio of female to male achievement, in percent.*

*2. The 1983-07 column is the simple percentage change of the 2007 value for each category over its 1983 value; because of changes in population composition, it will not be the same as a simple weighted average of the change in the individual components.*

**Socio-Cultural Groups and development, Regions of Andhra Pradesh, 1983 to 2007/8**

| | Average years of educational attainment, ages > = 8 years | | | Average years of educational attainment, ages 8 - 24 | | |
|---|---|---|---|---|---|---|
| | Education yrs | | % Change | Education yrs | | % Change |
| **Regions** | **1983** | **2007** | **1983-2007** | **1983** | **2007** | **1983-2007** |
| **Telangana** | | | | | | |
| SC+ST+Mus | 1.4 | 4.3 | 202 | 2.0 | 6.4 | 218 |
| Not (SC+ST+Mus) | 2.5 | 5.6 | 126 | 3.2 | 7.2 | 127 |
| All | 2.1 | 5.2 | 144 | 2.7 | 6.9 | 150 |
| **Rayalaseema** | | | | | | |
| SC+ST+Mus | 1.5 | 3.9 | 150 | 2.1 | 5.8 | 171 |
| Not (SC+ST+Mus) | 2.8 | 4.6 | 64 | 3.5 | 6.2 | 76 |
| All | 2.4 | 4.4 | 80 | 3.1 | 6.1 | 95 |
| **Coastal Andhra** | | | | | | |
| SC+ST+Mus | 1.9 | 4.4 | 132 | 2.6 | 6.3 | 146 |
| Not (SC+ST+Mus) | 2.8 | 5.1 | 80 | 3.4 | 6.6 | 93 |
| All | 2.6 | 4.9 | 87 | 3.2 | 6.5 | 102 |
| **Andhra Pradesh** | | | | | | |
| SC | 1.4 | 4.4 | 219 | 2.1 | 6.7 | 225 |
| ST | 0.7 | 3 | 308 | 1.2 | 4.6 | 300 |
| Muslim | 2.9 | 5.2 | 81 | 3.2 | 6.3 | 93 |
| OBC* | | 4.4 | 40 | | 6.4 | 42 |
| Others | 2.7 | 5.2 | 92 | 3.4 | 6.8 | 101 |
| All | 2.4 | 4.9 | 105 | 3.2 | 6.6 | 117 |

*Source : NSS consumer expenditure surveys for 1983, 1999 and 2007/8*

*Notes : * for OBC, the column 1983-2007 represents the years 1999-2007*

*Note : 1. Years of educational attainment is obtained from NSS data on education enrolment and completion of grade levels.*

*2. The 1983-07 column is the simple percentage change of the 2007 value for each category over its 1983 value; because of changes in population composition, it will not be the same as a simple weighted average of the change in the individual components.*

Socio-Cultural Groups and development, Regions of Andhra Pradesh, 1983 to 2007/8

| | Female to male years of educational attainment, ages >= 8, in % of male education | | | Female to male years of educational attainment, ages 8-24, in % male education | | |
|---|---|---|---|---|---|---|
| | | | % Change | | | % Change |
| **Regions** | **1983** | **2007** | **1983-2007** | **1983** | **2007** | **1983-2007** |
| **Telangana** | | | | | | |
| SC+ST+Mus | 40 | 65 | 65 | 50 | 90 | 81 |
| Not (SC+ST+Mus) | 39 | 65 | 65 | 48 | 89 | 84 |
| All | 39 | 65 | 65 | 48 | 89 | 85 |
| **Rayalaseema** | | | | | | |
| SC+ST+Mus | 34 | 51 | 49 | 47 | 65 | 39 |
| Not (SC+ST+Mus) | 45 | 66 | 47 | 61 | 79 | 30 |
| All | 43 | 61 | 41 | 59 | 75 | 26 |
| **Coastal Andhra** | | | | | | |
| SC+ST+Mus | 46 | 72 | 57 | 54 | 94 | 74 |
| Not (SC+ST+Mus) | 53 | 71 | 33 | 66 | 86 | 29 |
| All | 52 | 71 | 37 | 64 | 88 | 38 |
| **Andhra Pradesh** | | | | | | |
| SC | 42 | 69 | 66 | 51 | 92 | 81 |
| ST | 17 | 54 | 221 | 19 | 62 | 237 |
| Muslim | 47 | 62 | 32 | 64 | 88 | 38 |
| OBC* | | 63 | 9 | | 84 | 11 |
| Others | 47 | 68 | 43 | 59 | 86 | 45 |
| All | 46 | 67 | 45 | 58 | 86 | 50 |

***Source*** : *NSS consumer expenditure surveys for 1983. 1999 and 2007/8*
***Notes*** : ** for OBC, the column 1983-2007 represents the years 1999-2007*
***Note*** : *1. Each cell represents, except percentage change, the ratio of female to male achievement, in percent.*
*2. The 1983-07 column is the simple percentage change of the 2007 value for each category over its 1983 value; because of changes in population composition, it will not be the same as a simple weighted average of the change in the individual components.*

## ఈ అధ్యాయం చివరగా ఒక మాట

ఫలానా ప్రాంతం వారికి మంత్రి పదవులొస్తే ఆ ప్రాంతం దానికదే సస్యశ్యామలం అయిపోతుందని ఆశించడం ఒక భ్రమ అని ఈ కమిటీ నివేదిక చదివితే అర్థం అవుతుంది. ఒక కులంవాడు మంత్రి అయితే ఆ కులానికి ఏదో ఓరుగుతుందనేదికూడా భ్రమే! మాప్రాంతానికి ఎక్కువ పదవులు కావాలని ఆ పదవుల్ని ఆశించేవారు కోరుతారు. అంతేగాని, సామాన్య ప్రజానీకానికి సంబంధించిన అంశం కానేకాదిది. సీమవాళ్లు అన్నేళ్లు ముఖ్య మంత్రులుగా, ఆర్థిక మంత్రులుగా చేసినా సీమ ఈనాటికీ ఎందుకు వెనుకబడిఉంది ? ఈ యాభై ఏళ్లూ ఒక ప్రాంతంవారే ముఖ్యమంత్రిగా ఉన్నప్పటికీ ఆ ప్రాంతం పరిస్థితి ఇప్పటికన్నా బిన్నంగా ఉండేదికాదు. ఆ ప్రాంతం వెనకబడి ఉండటానికి పాలకులలో చిత్తశుద్ధి లేక పోవటమే కారణం. కాబట్టి ఈ భ్రమల్లోంచి మేధావులు, ప్రజలు బైటకువచ్చి వాస్తవికత ఆధారంగా సమస్యలకు పరిష్కారాలు వెదకాలి. రాజకీయ నాయకులు మాట్లాడే ఇంద్రజాల మహేంద్రజాల పదజాలాన్ని మేధావులు ఉపయోగించకూడదు. ఆ చిలకపలుకుల్ని ప్రజలు పలుకకూడదు.

# ఎనిమిదవ అధ్యాయం

## శాంతిభద్రతలు, ఆంతరంగిక భద్రత - పరిమాణాలు

## LAW & ORDER AND INTERNAL SECURITY DIMENSIONS

కమిటీ అధ్యయనాంశాలలో తక్షణం ఏర్పడే శాంతిభద్రతల సమస్యలు, దీర్ఘకాలిక ఆంతరంగిక భద్రత, మావోయిస్ట్ / నక్సల్ కార్యకలాపాలు - వీటన్నింటిని పరిశీలించడం ఒకటి. శాంతిభద్రతలకు సంబంధించిన రాష్ట్ర ఉన్నతాధికారులతో సంప్రదించి, రూపొందించిన అంశాలే 9వ అధ్యాయంలో పొందుపరచడం జరిగింది. ముందడుగు మార్గాల పేరుతో 9వ అధ్యాయంలో ఆ వివరాలన్ని ఉన్నాయని కమిటీ నివేదిక పేర్కొంది.



# తొమ్మిదవ అధ్యాయం

## ముందడుగు మార్గాలు

## THE WAY FORWARD

ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం కావాలనీ, రాష్ట్రాన్ని సమైక్యంగానే ఉంచాలనీ రెండు ప్రధానమైన డిమాండ్ల మీద కమిటీ తీవ్రమైన కసరత్తు చేసింది.

స్థానికమైన, ప్రాంతీయమైన, జాతీయమైన అంశాలను అన్నింటినీ పరిగణనలోకి తీసుకొన్నాక జస్టిస్ శ్రీ కృష్ణకమిటీ ఐదు రకాల పరిష్కారాలను, ప్రత్యామ్నాయాల్ని సూచించింది. వాటి సాధ్యాసాధ్యాలు, వాటివలన కలిగే అపకారాలుకూడా ప్రస్తావించి, చివరి ప్రత్యామ్నాయమే శరణ్యంగా తీర్పుచెప్పింది.

**1. యథాతథ స్థితిని కొనసాగించడం**

వేర్పాటు వాదాన్ని కేవలం రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించే శాంతిభద్రతల సమస్యగానూ, కేంద్ర ప్రభుత్వ జోక్యం అవసరం లేని అంశంగానూ భావిస్తే, ఈ యథాతథ విధానాన్ని అవలంభించవలసి వస్తుంది. గత 54 ఏళ్ల ఆంధ్రప్రదేశ్ చరిత్రలో వేర్పాటువాదం తలెత్తిన ప్రతిసారీ వివిధ గ్రూపు నాయకుల్ని ప్రభుత్వంలోనూ, పార్టీలోనూ ఉన్నత పదవులు ఎరవేయటం ద్వారా, రాజకీయ శక్తుల్ని లోబరుచుకోవటంద్వారా ఈ సమస్యను అప్పటికప్పుడు చల్లార్చే ప్రయత్నాలే జరిగాయన్న వాస్తవాన్ని జస్టిస్ శ్రీ కృష్ణ కమిటీ స్పష్టంగా వేలెత్తి చూపించింది. 'తెలుగు పౌరుషం', ఆత్మాభిమానం లాంటి నినాదాలు ఎంత పనిచేసినా, అవి చల్లారి పోయాయి. కానీ నశించిపోలేదని కమిటీ గుర్తించింది. తెలంగాణా డిమాండ్ లేచిన ప్రతిసారీ అణిచివేయబడిందేగాని (subside) అదృశ్యం (disappear) కాలేదంటుంది కమిటీ నివేదిక.

క్రీ.శ. 2000 తర్వాత తలెత్తిన తాజా తెలంగాణా ఉద్యమాన్ని గురించి విశ్లేషిస్తూ, ఇది కూడా ఎప్పటిలాగే ఆనాటి పెద్ద మనుషుల ఒప్పందాన్ని అమలు చేయాలనీ, 1975 రాష్ట్రపతి ఉత్తర్వుల ప్రకారం ఉద్యోగ నియామకాలు జరపాలని, విద్యా ప్రమాణాలలో కొన్ని ప్రాంతాలలోని వెనుకబాటుతనాన్ని పూరించాలనీ, జలవనరులు వాటా ప్రకారం తమకు సక్రమంగా అందేలా చూడాలని, తెలంగాణాలో అభివృద్ధి మరింతగా ఉండాలని కోరుతూ ఈ డిమాండ్ల సాధనకు తెలంగాణా రాష్ట్ర ఏర్పాటు ఒక్కటే పరిష్కారంగా ఈ దశాబ్దిలో తెలంగాణా ఉద్యమం సాగిందని కమిటీ భావించింది. అన్నింటికన్నా మించి సుదీర్ఘకాలం తెలంగాణా రాష్ట్రం డిమాండ్ సాగుతూ ఉండటంతో ప్రజలలో ఏర్పడిన మానసిక ఉద్వేగాలను (sentiments and emotions) కమిటీ పరిగణనలోకి తీసుకుంది.

ఇక్కడ కమిటీ పేర్కొన్న ఒక వాక్యం చాలా ముఖ్యమైంది. "The Committee did not find any real evidence of any major or neglect by the state Government in matters of overall economic development – నిజానికి ఈ 54 ఏళ్ళలో రాష్ట్ర ప్రభుత్వ పరంగా తెలంగాణా అభివృద్ధి విషయంలో పెద్ద వివక్ష చూపించిన సాక్ష్యం ఏదీ కమిటీ దృష్టికి రాలేదు–" అని ఈ నివేదికలో పేర్కొన్నారు.

అయితే, ఉద్యోగాలు, విద్యావకాశాలు, జలవనరుల్లాంటి విషయాల్లో అసంతృప్తులు సహజం. అసంతృప్తుల ఆధారంగా రాష్ట్రాన్ని విడదీయటం సబబుకానప్పుడు ఈ యథాతథ విధానాన్ని అవలంభించ వలసి ఉంటుంది.

తెలంగాణా రాష్ట్ర ఏర్పాటు విషయం పై ఏ చర్యా తీసుకోకపోతే వెంటనే కొంత అలజడి, అల్లరి, విధ్వంసం చెలరేగి కొన్నాళ్లపాటు కొనసాగే అవకాశాలు లేకపోలేదు. కొన్ని ప్రాంతాల్లో ప్రత్యేకమైన డిమాండ్లతో తీవ్ర విధ్వంసాలు జరిగినా ఆశ్చర్యంలేదు. తెలంగాణా ప్రజా ఫ్రంట్ (గద్దర్) తెరాస వారితో చేరి మరింత తీవ్రమైన ఉద్వేగాల్ని రెచ్చగొట్టవచ్చు. అది ప్రజా జీవితంపైన ఎక్కువ ప్రభావం చూపించవచ్చు. ముఖ్యంగా హైదరాబాద్, దాని పరిసర ప్రాంతాలతో ఈ విధ్వంసం ఎక్కువగా జరిగి, అది హైదరాబాద్ ప్రతిష్టని దెబ్బతీయవచ్చు. అది ఈ నగర ఆర్థికాభివృద్ధిని కూడా దెబ్బతీయవచ్చు. ఇంతకు మునుపులాగానే ఎన్నికైన ప్రజాప్రతినిధులు, శాసన సభ్యులు, శాసన మండలి సభ్యులు, పార్లమెంట్ సభ్యుల మీద రాజీనామాలు చేయాల్సిందిగా వత్తిడి బాగా రావచ్చు. అది తిరిగి రాజకీయ సంక్షోభానికి దారితీయవచ్చు. ఈ దశలో మావోయిస్టులు కూడా విజృంభించి తమ ప్రాబల్యాన్ని పెంచుకొనే ప్రయత్నం చేయవచ్చుననే భయాందోళనలను కమిటీ తన నివేదికలో వ్యక్తపరిచింది మానసికోద్వేగాలను రెచ్చగొట్టే చర్యలు తప్పనిసరిగా జరిగే అవకాశం ఉన్నందున, కమిటీ సభ్యులు ఏకగ్రీవంగా ఒక నిర్ణయానికి వచ్చారు. "ఈ యథాతథ వాదంవలన పరిస్థితి చేజారే ప్రమాదం ఉంది. కాబట్టి, దానికి చిట్టచివరి ప్రాధాన్యత నీయాల్సి ఉంటుంది".

కమిటీ అధ్యయనంలో యథాతథ పరిస్థితి కొనసాగితే 2009 డిసెంబరు, 2010 జనవరి నాటి పరిస్థితులే పునరావృతం అవుతాయనే భావన బలంగా వుంది. కాబట్టి ఈ ప్రత్యామ్నాయాన్ని కమిటీయే తోసిపుచ్చింది. ప్రభుత్వం తెలంగాణా ప్రజల సెంటిమెంట్‌ని కూడా గౌరవించాలనే సూచన ఈ ఒకటవ ప్రత్యామ్నాయంలో అంతర్లీనంగా కనిపిస్తోంది. అది అవసరం కూడా! అయితే, తెలంగాణా ప్రజల మనోభావాలు ఎంత ముఖ్యమో, సీమాంధ్ర ప్రాంత ప్రజల మనోభావాలు కూడా అంతే ముఖ్యం ప్రభుత్వానికి! సమన్వయం చేయగల సమర్థత ఇప్పుడున్న ప్రభుత్వానికి ఉందని నమ్మకం ఇంకా ప్రజలకు కలుగలేదు. కమిటీకి కూడా ఆనమ్మకం ఉన్నట్టులేదు. అందుకే, అల్లర్లను అదుపు చేయలేరు కాబట్టి "యథాతథస్థితి" వద్దని పేర్కొంది.

**2. రెండవ ప్రత్యామ్నాయం :** సీమాంధ్ర, తెలంగాణా రాష్ట్రాలుగా విభజన మరియు హైదరాబాద్ కేంద్రపాలిత ప్రాంతంగా ప్రకటన రెండు రాష్ట్రాలకు రెండు వేర్వేరు రాజధానుల త్వరిత అభివృద్ధి. ఇది రెండవ ప్రత్యామ్నాయ పరిష్కారం!

తెలంగాణా రాష్ట్రం కావాలనడం కేవలం మానసిక ఉద్వేగాలకు సంబంధించిన (సెంటిమెంటు, ఇమోషనల్) అంశమే అయితే, తెలంగాణా రాష్ట్రం ఇచ్చేయడమే మంచిది. కాని, హైదరాబాద్ మాత్రం ఎవరికి కాకుండా కేంద్రపాలిత ప్రాంతంగా ఉండాలి - అనేది ఈ రెండవ ప్రత్యామ్నాయంలో సూచిస్తున్న అంశం. ఈ ప్రత్యామ్నాయాన్ని ఎంచుకుంటే ఒనగూరే లాభనష్టాల గురించి కమిటీ అధ్యయనంచేసింది.

(అ) హైదరాబాద్ నగరం 4 శతాబ్దాల ప్రాచీనత విశిష్టతల్ని, దాని ఆర్థికాభివృద్ధిని, ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో దాని ప్రాముఖ్యతని దృష్టిలో పెట్టుకొని ఈ ప్రత్యామ్నాయ సూచన చేసినట్లు కన్పిస్తోంది. ఈ రోజున హైదరాబాద్ మహానగరం ప్రజల ఆర్థిక వ్యవస్థకు ఇంజన్ అనదగిన స్థితిలో ఉంది. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, దాని అనుబంధ పరిశ్రమలకు ముఖ్య కూడలిగా హైదరాబాద్ ఎదిగింది. జాతీయ స్థాయి పారిశ్రామికవేత్తలు, స్థానిక పారిశ్రామిక వేత్తలు ఈ నగరంలో పారిశ్రామికంగా ప్రధాన పాత్ర వహిస్తున్నారు. సమీపంలోని రంగారెడ్డి జిల్లాలో పెద్ద పెద్ద పరిశ్రమలు ఏర్పడటానికి కోస్తా ఆంధ్ర, రాయలసీమ ప్రాంతంవారు, రాష్ట్రం వెలుపల నుంచి కూడా అనేకమంది పారిశ్రామికవేత్తలు ముందుకు వచ్చారు. అనేక పబ్లిక్ సెక్టార్ సంస్థలు, జాతీయ సంస్థలు, పౌర మరియు మిలిటరీ సంస్థలు - హైదరాబాద్ స్థావరంగా నెలకొని ఉన్నాయి.

అనేక సంవత్సరాలుగా రాజధాని నగరానికి జరుగుతూ వచ్చిన ఈ వలసల కారణంగా నగర స్వరూప స్వభావాలే మారిపోయాయి. రాజధాని మహానగరంలో మూడవ

వంతు ప్రజలు బైటవారే నివసిస్తున్నారు– అనే విషయాన్ని గుర్తిస్తూ కమిటీ తన నివేదికలో, ఆర్థికపరమైన అభివృద్ధి ఉద్యోగావకాశాలను మెరుగుపరుస్తుంది. హైదరబాద్ ఇతర ప్రాంతాలతో ఆర్థికపరమైన అంతఃసంబంధాలు (Current economic inter-linkages of Hyderabad with other regions) మెరుగుపడవలసిన అవసరాన్ని కూడా కమిటీ నొక్కి చెప్పింది. స్థిరమైన వాణిజ్య వాతావరణం నెలకొనడానికి ఇది అవసరం అంటూ బెల్జియంలో జరిగిన సంఘటనని ఉదహరించింది.

**కమిటీ చెప్పిన బెల్జియం కథ**

హైదరాబాద్‌లో ఈనాడు నెలకొన్న పరిస్థితే 1968లో బెల్జియంలోని బ్రస్సెల్స్ మహా నగరంలో ఏర్పడింది. ఆనాడు బ్రస్సెల్స్ మీద ఆధిపత్యం కోసం మూడు రకాల భాషలు మాట్లాడే ప్రజల మధ్య తీవ్రమైన అశాంతి ఏర్పడింది. అప్పుడు బెల్జియం దేశాన్ని రెండు రకాల సంస్కృతులు మూడు రకాల భాషలు కలిగిన దేశంగా ప్రకటించ వలసివచ్చింది. ఆనాడు బెల్జియం జనాభా 10 మిలియన్లు. వారిలో 6 మిలియన్లు బెల్జియం ఉత్తర భూభాగంలో ఫ్లెమిష్‌భాష మాట్లాడే వారుగా ఉన్నారు. 4 మిలియన్ల మంది దక్షిణ బెల్జియంలో ఫ్రెంచి మాట్లాడేవాళ్ళున్నారు. కొద్దిమంది జర్మనీ మాట్లాడేవాళ్ళు కూడా ఆ దేశంలో ఉన్నారు. ఈ మూడు తరహా ప్రజలు బ్రస్సెల్స్ మహానగరంలో ఉండటం కారణంగా ఈ వివాదం ఏర్పడింది. అందుకని బెల్జియంని మూడు భాషల ఫెడరేషన్‌గా ప్రకటించి, రాజధాని బ్రస్సెల్స్ నగరాన్ని ప్రత్యేకంగా రెండు భాషల నగరంగానూ, స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన నగరంగానూ ఏర్పాటు చేశారు.

శ్రీకృష్ణ కమిటీ ఈ కథని ప్రస్తావించి, 54 ఏళ్ల క్రితం ఆంధ్రప్రదేశ్‌కు అంతో ఇంతో సమానమైన భాషా సంస్కృతులు కలిగి, భాషాప్రయుక్త రాష్ట్రాలలో తొలిరాష్ట్రంగా ఏర్పడిన వైనాన్ని కూడా ప్రస్తావించి, మన దేశంలో కేంద్రపాలిత ప్రాంతాల పాలనా వ్యవస్థ ఆచారంగా ఉంది కాబట్టి హైదరాబాద్‌ని కూడా కేంద్రపాలిత ప్రాంతంగా చేయడం గురించి కమిటీ తన రెండవ ప్రత్యామ్నాయంలో ప్రస్తావించింది. నిజానికి బెల్జియం సంఘటనతో రాష్ట్ర పరిస్థితికి పోలిక లేదు. అది మూడు రకాల భాషా జాతుల మధ్య సమస్య. ఇది ఒకే భాషా జాతికి సంబంధించిన మూడు ప్రాంతాల మధ్య సమస్య. అయినప్పటికీ ఈ పరిష్కార సూత్రాన్ని అన్వయిస్తే ఎలా ఉంటుందనే పరిశీలన జరిగింది.

రాష్ట్రాన్ని విభజించడమే అనివార్యం అయితే, ఎలా విభజించాలనే ప్రశ్నకు సమాధానాలు అన్వేషించే ప్రయత్నంలో కమిటీ ముందుకు వచ్చిన ప్రత్యామ్నాయంలో ఇది రెండవ ప్రత్యామ్నాయం.... !

తెలంగాణా ఒక రాష్ట్రంగానూ, తక్కిన రెండు ప్రాంతాలూ ఒక రాష్ట్రంగానూ ఏర్పడితే, హైదరాబాద్ తప్పనిసరిగా కేంద్ర పాలితం కావాలి. రెండు రాష్ట్రాలకూ తాత్కాలికంగా

ఉమ్మడి రాజధానిగా హైదరాబాద్‌ని కొనసాగించి, వీలువెంట స్వంత రాజధాని నగరాలనూ రెండు రాష్ట్రాలూ వేర్వేరుగా ఏర్పాటు చేసుకోవాల్సి వుంటుందనేది ఈ రెండవ ప్రత్యామ్నాయం సారాంశం. అంటే, ఆ తర్వాత తెలంగాణా రాష్ట్రానికి కూడా హైదరాబాద్ రాజధానిగా ఉండజాలదన్నమాట !

కేంద్రపాలిత ప్రాంతంగా హైదరాబాద్ అయినప్పుడు ఆ నగర రాబడి యావత్తూ కేంద్ర ప్రభుత్వానికి చెందుతుంది. కాబట్టి, ఈ ఆదాయం హైదరాబాద్, తెలంగాణా, సీమాంధ్ర ప్రాంతాలకు పంపకం చేసేందుకు చట్టబద్ధమై ఒక ఒప్పందం అవసరం కావచ్చునని కమిటీ భావించింది.

"ఒకవేళ ఈ ప్రత్యామ్నాయాన్ని అనుసరించే పరిస్థితి వస్తే అది కోస్తా, సీమ ప్రజలకు కొంత ఆమోద యోగ్యమే కావచ్చు. ఎందుకంటే, హైదరాబాద్‌లో తమ ఆర్థిక ప్రయోజనాలు కేంద్రపాలిత ప్రాంతంలో సురక్షితంగా ఉంటాయి కాబట్టి ! అయితే, సీమ ప్రజలు, కోస్తా ప్రజలు హైదరాబాద్ ఎవ్వరికి దక్కకుండా అది కేంద్రానికి పోవాలని కోరుకోవడం లేదు. వారు మనసా వాచా కర్మణా తెలుగు ప్రజలంతా సమైక్యంగా ఉండాలనే కోరుకొంటున్నారు. సమైక్యాంధ్రతోనే ఉమ్మడి అభివృద్ధి వుంటుందని భావిస్తున్నారు. ఉమ్మడి రాష్ట్రానికి హైదరాబాద్ రాజధానిగా ఉండాలనేదే సీమ, కోస్తా ప్రజల ఆకాంక్షగా కమిటీ ఈ సందర్భంగా నొక్కి చెప్పింది. ఈ ప్రత్యామ్నాయం అమలు జరిపితే ఏర్పడే ప్రమాదాల గురించి కమిటీ తీవ్రంగానే హెచ్చరిస్తోంది...

1) తెలంగాణా వాదులు హైదరాబాద్ కావాలంటూ సృష్టించే అల్లర్ల కారణంగా కేంద్రపాలిత ప్రాంతంగా హైదరాబాద్‌ని కొనసాగించడం కష్టసాధ్యం కావచ్చు.
2) భౌగోళికంగా కేంద్రపాలిత హైదరాబాద్ రాష్ట్రానికీ, సీమ, కోస్తా ప్రాంతాలకు మధ్య సంబంధాలు నడపడం కష్టం కావచ్చు.
3) కోస్తా ఆంధ్ర వైపు నల్గొండ, రాయలసీమ వైపు మహబూబ్‌నగర్ జిల్లాలు సీమాంధ్ర ప్రజలు హైదరాబాద్ చేరకుండా అడ్డుగా నిలిచే అవకాశం వుంది.
4) ఉద్యమకారులు ఈ రెండు జిల్లాల సరిహద్దుల్ని మూసేసి హైదరాబాద్‌ని దిగ్బంధంచేసే ప్రమాదం కూడా వుంది.
5) ఈ ప్రత్యామ్నాయాన్ని అనుసరించడం వలన ఒనగూరే ప్రయోజనాలు పెద్దగా ఏమీ లేకపోగా, తెలంగాణా ప్రజల ప్రత్యేక రాష్ట్ర సెంటిమెంటుగానీ, సీమాంధ్ర ప్రజల సమైక్య రాష్ట్ర సెంటిమెంటుగానీ ఏదీ నెరవేరకుండా పోతుంది. చివరికి రెంటికీ చెడ్డరేవడి చందం అవుతుంది తెలుగు వాళ్ల పరిస్థితి.
6) ఎల్లకాలం హైదరాబాద్ అంశం ఒక తలనొప్పిగానే కేంద్రానికి పరిణమించే అవకాశం వుంది.

7) ఒకటో ప్రత్యామ్నాయంలో తలెత్తే పరిస్థితులు ఈ రెండో ప్రత్యామ్నాయం వలన కూడా తెలంగాణాలో తలెత్తే అవకాశం వుంది.

ఈ ప్రమాద హెచ్చరికలన్నీ చూసి, కమిటీ చివరిగా ఇలా తేల్చి చెప్పింది – "అన్ని విధాలా అనర్థదాయకమే కాబట్టి ఈ రెండవ ప్రత్యామ్నాయం ఆచరణ సాధ్యంకాదు" అని!

ఇక్కడ సున్నితమైన విషయాలను నిష్పాక్షికులు ఆలోచించాల్సింది ఏమిటంటే–

తెలంగాణాలో బస్సులు తగలబెట్టి, షాపులు పగలగొట్టి విధ్వంసం సృష్టిస్తారు కాబట్టి ఒక నిర్ణయం తీసుకోవడం మంచిది కాదనడం సబబేనా ? పగలగొట్టి, తగలబెట్టి విధ్వంసం సృష్టించేది ప్రజలు కాదు – కొందరు కిరాయి మూక! వాటిని ముఖ్యంగా ఎలక్ట్రానిక్ మీడియావారు ప్రజల ఆగ్రహంగా చిత్రించి చూపించడం విచిత్రమే ! అల్లర్లను అదుపులో పెట్టగల సమర్థత మన పాలనా వ్యవస్థకి లేదు కాబట్టే, అల్లర్ల సాకు చూపి ప్రత్యామ్నాయాలు 'అసాధ్యం' అనే నిర్ణయం చేసినట్లు కన్పిస్తోంది. భిన్నాభిప్రాయాలు తలెత్తినప్పుడు మన పాలనా యంత్రాంగం దృఢచిత్తంతో వ్యవహరించకుండా పారిపోయి తీరుతుందని కమిటీ విశ్వసించినట్లు ఈ తీర్పుని బట్టి అర్థం అవుతోంది. గతానుభవాలు మనకి అవే కాబట్టి !

సీమ, కోస్తా ప్రజలు తమకు దక్కనిది ఎవరికీ దక్కకూడదని కోరుకునే అల్ప సంస్కృతి కల్గిన వారు కానేకాదు– అయితే తమ రాజధాని నగరానికి తరలివచ్చిన ఇతర ప్రాంతాల ప్రజలను కించపరుస్తూ తూలనాడుతూ అవమానించే తెలంగాణా వాదుల ధోరణిని కమిటీ ఎక్కడా తప్పుబట్టలేదు – కానీ, అలాంటి వారికి భయపడి, ప్రభుత్వాన్ని భయపెట్టడం మాత్రం విచిత్రంగానే అన్పిస్తోంది. దీనికంతటికీ కారణం, బస్సులు తగలబెట్టి, షాపులు పగలగొడితేనే "ఉద్యమం" అనే భావన బలంగా ఉండటమే ! చేసేవారికి, చూసే వారిక్కూడా అదే అభిప్రాయం వుంది ! మన మీడియా దాన్ని సొమ్ము చేసుకొనే ప్రయత్నంలో మరింత ఎగదోస్తోంది. సీమ, కోస్తా ప్రజలు రాష్ట్రం సమైక్యంగా ఉండాలనీ, హైదరాబాద్ రాజధానిగా ఉండాలని రాష్ట్రంలో అన్ని ప్రాంతాలూ ఎలాంటి వివక్షకూ గురి కాకుండా సమానంగా అభివృద్ధి చెందాలని, అభివృద్ధి ఫలాలు అందరికి సమానంగా అందాలనే కోరుకుంటున్నారు. కాబట్టి, హైదరాబాద్ ఎవరికి దక్కకుండా కేంద్రపాలిత ప్రాంతంగా ఉండాలని కోస్తావారు గానీ, సీమవారుగానీ కోరుకోవటం లేదు. అలా చెయ్యాలని ఎవ్వరూ డిమాండ్ చెయ్యలేదు. అటువంటి చర్యలు అనవసరంగా ఎలక్ట్రానిక్ మీడియాలోనే జరిగాయి.

**3) మూడవ ప్రత్యామ్నాయం :** రాష్ట్రాన్ని రాయల తెలంగాణా, కోస్తా ఆంధ్రాగా రెండుగా విభజించి, హైదరాబాద్‌ని రాయల తెలంగాణాగాకే ఉంచేయడం. మూడవ ప్రత్యాయంగా కమిటీ పరిశీలన చేసింది.!

రాయలసీమలోని కొందరు వ్యక్తులు ఈ సూచనను కమిటీ ముందు ఉంచారని, తమ మొదటి లక్ష్యం సమైక్యాంధ్రేగాని, రాష్ట్రాన్ని విభజించే పరిస్థితి వస్తే తెలంగాణాలో రాయలసీమని కలపాలని వారు కోరారని ఈ నివేదికలో చెప్పుకున్నారు.

"AIMIM" వారు కూడా ముస్లిం మైనారిటీ ప్రజల ప్రయోజనాల రీత్యా తెలంగాణా, రాయలసీమలను ఏకంగా వుంచడమే మంచిదని అభిప్రాయపడినట్లు పేర్కొన్నారు.

హైద్రాబాద్‌ని మినహాయిస్తే తెలంగాణాలో కేవలం 8% ముస్లింలు మాత్రమే ఉన్నారని, రాయలసీమలో 12% ముస్లింలు వున్నారు కాబట్టి ఈ రెండు ప్రాంతాలను కలిపితే ముస్లింల ప్రయోజనాలు మెరుగుపడతాయనేది AIMIM వారి వాదన.

ఈ రెండు ప్రాంతాల్ని కలపాలనడంలో మరో ఆర్థికపరమైన అంశం కూడా ఉంది. రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని విశ్లేషిస్తే తెలంగాణా, కోస్తాకన్నా, రాయలసీమ ఎక్కువ వెనకబడి వుంది కాబట్టి ! త్రాగునీరు, సాగునీరు విషయంలో రాయలసీమ తెలంగాణా మీదుగా ప్రవహించే కృష్ణానదిపైన ఆధారపడి వుంది. ఉద్యోగాలు, విద్య విషయంలో హైదరాబాద్‌పైన ఎక్కువ ఆధారపడవలసి వస్తోంది. సామాజికంగాకూడా సీమతో హైద్రబాద్‌కు సాన్నిహిత్యం ఎక్కువ. అందుకని, రాయలసీమ ప్రజలు తెలంగాణాతో కలవడానికి ఎక్కువ సుముఖత చూపించారని జస్టిస్ కృష్ణ కమిటీ విశ్లేషించింది. పై ప్రతిపాదనల కన్నా ఒక విధంగా ఈ మూడవ ప్రత్యామ్నాయం కొంత మెరుగైనదిగా కమిటీ అభిప్రాయపడింది.

అయితే, ఈ ప్రత్యామ్నాయాన్ని తెలంగాణాలోని రాజకీయ పక్షాలన్నీ ఖచ్చితంగా వ్యతిరేకిస్తాయి. రాయలసీమలోని రాజకీయ నాయకత్వమే తమ వెనుకబాటుతనానికి కారణం అనీ, తమ ప్రాంతాలలోని వనరులను స్వార్థానికి తరలించుకుపోయింది సీమ వారేననే అభిప్రాయం తెలంగాణా వారిలో బలంగా ఉందని కమిటీ గుర్తించింది.

నిజానికి, ఈ ప్రతిపాదనని కృష్ణ కమిటీ సభ్యులు తెలంగాణాలో చాలా సందర్భాల్లో చాలా మందితో చర్చించారు. ఏ ఒక్కరూ ఈ ప్రతిపాదనకు అంగీకారం తెలపకపోగా తీవ్ర వ్యతిరేకతని వ్యక్తపరిచారని కూడా కమిటీ తన నివేదికలో తెలిపింది.

ఏ విధంగా చూసినా ఈ ప్రతిపాదన అటు తెలంగాణా వాదులకుగాని, ఇటు సమైక్య వాదులకుగాని ఎట్టి పరిస్థితులలోనూ ఆమోదయోగ్య పరిష్కారం కాదు. దీని వలన ఫండమెంటలిస్ట్ శక్తులు రాజకీయ పక్షంలో చేరిపోయే ప్రమాదం వుందని కూడా కమిటీ ఊహించింది. మూడు ప్రాంతాల్లోనూ ఈ ప్రతివాదన ఎవరినీ సంతృప్తి పరచదని కమిటీ తన అపనమ్మకాన్ని వెలిబుచ్చింది.

ఇక్కడకూడా మనం గట్టిగా మాట్లాడాల్సిన అంశం ఒకటి ఉంది. హైదరాబాద్ నగరానికి సీమ ప్రాంతం దగ్గరగా ఉంది, ముఖ్యంగా కర్నూలు జిల్లానుంచి ఎక్కువ

మంది రాజధాని మహానగరంపైన ఆధారపడి జీవిస్తున్నారు. వీరంతా రాజధాని నగరంతోపాటు రాష్ట్రంకూడా సమైక్యంగా వుండాలనే కోరుకొంటున్నారు. విడదీయాల్సి వస్తే, "హైదరాబాద్"తో ముడిపడిన జీవితాలకు దెబ్బతగలకుండా చూడవలసిన బాధ్యత కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల మీద వుందని వారు భావిస్తున్నారు.

కాబట్టి, మూడవ ప్రత్యామ్నాయం ఏమాత్రం ప్రయోజనకరం కాదని కొత్త సమస్యలకు దారితీస్తుందనీ కమిటీ భావించి, ఈ ప్రతిపాదనని తానే త్రోసిపుచ్చింది !

**4) నాల్గవ ప్రత్యామ్నాయం :** రాష్ట్రాన్ని తెలంగాణా, సీమాంధ్రలుగా విభజిస్తూ హైదరాబాద్‌ని నల్గొండ – మెహబూబ్‌నగర్ జిల్లాలతో కలిపి మరింత పెద్ద కేంద్రపాలిత ప్రాంతంగా చేయడం.

ఇది మరొక రకం విచిత్ర ఆలోచన. రాష్ట్రాన్ని మూడు భాగాలుగా విడదీయడం అనివార్యం అయినప్పుడు, మొదట గ్రేటర్ హైదరాబాద్‌తో నల్గొండని కలిపితే గుంటూరు కృష్ణాజిల్లా సరిహద్దులకు దగ్గరగా వుండి కోస్తా ప్రజలు హైదరాబాద్‌లోకి అడుగు పెట్టడానికి తెలంగాణా అడ్డురాకుండా వుంటుంది. అలాగే మెహబూబ్‌నగర్ జిల్లాని హైదరాబాద్‌తో కలిపితే రాయలసీమకు నేరుగా సంబంధాలు ఏర్పడతాయి. భవిష్యత్తులో తెలంగాణా వారివలన సీమ ప్రాంతీయులకు ఎలాంటి ఇబ్బందులూ వుండవు. తెలంగాణా రాష్ట్రం, సీమాంధ్రరాష్ట్రం, నల్గొండ మెహబూబ్ నగరాలు కలిసిన హైదరాబాద్ కేంద్ర పాలిత రాష్ట్రం ఇలా మూడుగా విభజించాలనేది ఈ నాలుగో ప్రత్యామ్నాయంలో కన్పించే ముఖ్య అంశం.

ఈ ప్రతిపాదన రెండవ ప్రత్యామ్నాయాన్ని కొద్దిగా మెరుగుపరిచి చేసిన ప్రతిపాదన. హైదరాబాద్ అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతున్న నగరం కాబట్టి, 175 చదరపు కిలోమీటర్ల నుంచి 652 చదరపు కిలోమీటర్లకు జంట నగరాలను విస్తృతపరిచి గ్రేటర్ హైదరాబాద్ నగరంగా అభివృద్ధి చేయటం జరిగింది కాబట్టి, పూర్వపు HUDA (హైదరాబాద్ పట్టణాభివృద్ధి సంస్థ) స్థానంలో HMDA (హైదరాబాద్ మహానగర అభివృద్ధి సంస్థ) ముఖ్యమంత్రి అధ్యక్షతన, 7073 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం కలిగిన ప్రాంతంగా రూపుకట్టుకొంది కాబట్టి, గోవా రాష్ట్రానికన్నా రెండు రెట్లు పెద్దదిగా అవతరిస్తుంది కాబట్టి, ఈ విధంగా రెండు జిల్లాలను కలిపి 12వేల చదరపు కి.మీ. రాష్ట్రంగా తీర్చిదిద్దవచ్చునని కమిటీ తన నివేదికలో మ్యాపు ఆధారంగా విశ్లేషించి చూపించింది.

ఈ ప్రతిపాదిత హైదరాబాద్ కేంద్రపాలిత రాష్ట్రంలో 67 మండలాలు, 1330 గ్రామాలు, 12430 చదరపు కి.మీ. వైశాల్యం వుంటాయని ఆ నివేదికలో వెల్లడించింది.

కమిటీ జరిపిన అధ్యయనంలో హైదరాబాద్ ఆర్థిక పరిస్థితి (GDP) ఆధునిక సంస్థలు, రవాణా రంగంమీదే ఎక్కువ ఆధారడి వున్నాయని తేలింది. 2005-06లో

హైదరాబాద్ GDP లో 58% వీటినుంచే వచ్చినట్లు తేలింది. 1999-2000లలో ఇది 43% మాత్రమే!

సాఫ్ట్‌వేర్ రంగంలో హైదరాబాద్ ముఖ్యమైన నగరం కాబట్టి, GDP లో 15% ఈ రంగంలోంచే వస్తోంది. ఇతర వాణిజ్యానుకూల అంశాలు, రియల్ ఎస్టేట్ వ్యాపారం కూడా హైదరాబాద్ అభివృద్ధికి కారణాలు. ఈ నగరానికి రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలతో ఎక్కువ సామాజిక సంబంధాలు ఉన్నాయి. ముఖ్యంగా రవాణా వ్యవస్థపైన దీని ప్రభావం ఎక్కువ. రాజధాని నగరానికి వలసలు కూడా ఇదే కారణంగా ఎక్కువగా వుంటాయన్న విషయాన్ని కమిటీ ప్రస్తావించింది ! తెలంగాణాలోని ఇతర జిల్లాల నుంచి హైదరాబాద్‌కు వచ్చినట్టే, రాజధాని నగరానికి సీమ, కోస్తాలనుంచి ప్రజలు పొట్టకూటికోసం తరలి రావడం సహజం ! దాన్ని "వలస"గానూ, ఇతర ప్రాంతాలవారి దురాక్రమణగానూ మాట్లాడటం మన రాష్ట్రంలోనే జరుగుతోంది. 'వలస' అనే పదాన్ని మరింత జాగ్రత్తగా ఉపయోగించవలసి ఉంటుందనుకుంటాను.

ప్రభుత్వం సబ్సిడీలిచ్చి, ప్రోత్సాహకాలిచ్చి రాష్ట్రంలో ఇతర ప్రాంతాలలో నెలకొనవలసిన వివిధ పరిశ్రమల్ని బలవంతంగా హైదరాబాద్‌కు తరలింపచేసిన వాస్తవాన్ని ఈ కమిటీ బలంగా గుర్తించలేదనే అనుకోవాలి. ప్రచురణ రంగం, పత్రికా రంగం, సినిమారంగం లాంటివన్ని విజయవాడనుంచి హైదరాబాద్‌కు పట్టు బలవంతాన తరలించ బడ్డాయి. ఆఖరికి సునామీ పరిశోధనా సంస్థ, చేపల పరిశ్రమ అభివృద్ధి సంస్థల్లాంటి వాటిని కూడా సముద్ర తీర ప్రాంతాలలో కూడా హైదరాబాద్‌లో నెలకొల్పి ప్రజలు తప్పనిసరిగా రాజధానికి తరలివచ్చే పరిస్థితులు కల్పించింది ప్రభుత్వం. దానికి "ప్రజల వలస" అని పేరు పెట్టడం ఆశ్చర్యకరం ! అభ్యంతరకరం !!

ఈ వలసలవి మొదట్లో కర్నాటక, మహారాష్ట్ర నుంచే వుండేవని కమిటీ పేర్కొంది. నైజాం రాజ్యంలో కర్నాటక, మహారాష్ట్ర భూభాగాలకూ హైదరాబాదే రాజధానిగా వుందనే విషయాన్ని గమనించాలి. అలాగే, పొట్టకూటికోసం తెలంగాణా ప్రజలు కూడా రాష్ట్రంలో అన్ని జిల్లాల్లోనూ ఉన్నారు. వాళ్లని వలస వాదులనటం కన్నా దౌర్భాగ్యం ఇంకొకటి వుండదు. అలాగే హైదరాబాద్‌లో వున్న సీమ, కోస్తా ప్రజల్ని మైగ్రెంట్స్ అనడం కన్నా గౌరవనీయమైన పదం ఉపయోగిస్తే మంచిది.

కమిటీ తన నివేదికలో "ఇప్పుడు హైదరాబాద్‌కు ఉత్తరాది ప్రజలు కూడా ఎక్కువమంది తరలి వస్తున్నా"రని పేర్కొంది. దానికి కారణం ఇక్కడ కేంద్రీకృతమైన అభివృద్ధి. అది కర్నూలులో జరిగినా విశాఖపట్నంలో జరిగినా, వరంగల్‌లో జరిగినా ఇలాగే ప్రజలు తరలి వస్తారు. వాళ్లలో ఉద్యోగులు ఉంటారు. అనుబంధ పరిశ్రమల

వాళ్లుంటారు. ఆధారిత వ్యాపారులుంటారు. వాళ్లందరినీ దోపిడీదారులని ముద్రవేయడాన్ని కమిటీ గట్టిగా అభ్యంతరం చెప్పి ఉండాల్సింది.

జాతీయ ఆర్థిక వ్యవస్థకు హైదరాబాద్ కీలకమైన నగరం ఉన్నతమైన ఎన్నో సంస్థలు ఇక్కడ నెలకొని ఉన్నాయి. ఈ సంస్థలు దేశవ్యాప్తంగా వున్న ప్రతిభావంతుల్ని పోషిస్తున్నాయి. జాతీయపరమైన సంరక్షణలో ఇది ముఖ్యమైన నగరంగా కమిటీ విశ్లేషణ చేసింది. దీని అభివృద్ధిలో అన్ని ప్రాంతాలవారి పాత్ర కూడా వుందనే విషయాన్ని మాత్రం స్పష్టంగా నొక్కి చెప్పలేదు. కొన్ని వాస్తవాలను కప్పదాట్లు వెయ్యడం వలన భవిష్యత్తులో ఇలాంటి పరిస్థితులు తిరిగి చోటుచేసుకొనే అవకాశం కల్పించినట్లయ్యింది. దేశంలో ఏ రాజధాని నగరం అయినా ఇలానే రాష్ట్ర ప్రజల పాత్రతో అభివృద్ధి చెందుతుంది. ఇందులో ప్రత్యేకత ఏమీ లేదు. ప్రత్యేకత ఒక్కటే ఢిల్లీ, ముంబాయి, చెన్నైలతో సమానమైన నగరంగా హైదరాబాద్ ఎదగడంలో రాష్ట్ర ప్రజలందరి సమైక్య పాత్ర వుంది! దాన్ని ఈ కమిటీ గుర్తించింది! ఆ అభివృద్ధి రాష్ట్రం మొత్తానికి సమానంగా అందాల్సిందే!

కమిటీ అధ్యయనంలో హైదరాబాద్ ప్రాంతం రాష్ట్ర ఆర్థికాభివృద్ధికి జాతీయ ఆర్థికాభివృద్ధికి చాలా ముఖ్యమైనదిగా వెల్లడైంది. కాబట్టి ఈ నగరాన్ని మరింత విస్తరించ వలసిన అవసరం వుంది. అందుకని "నల్గొండ, మెహబూబ్ నగరాలతో కలిసిన హైదరాబాద్" ప్రస్తావనని కమిటీ ఒక ప్రత్యామ్నాయ ఆలోచనగా పరిశీలించవలసి వచ్చిందని నివేదికలో పేర్కొన్నారు.

నల్గొండ, మెహబూబ్‌నగర్ జిల్లాలు కోస్తా, రాయలసీమ ప్రాంతాలను భౌగోళికంగా హైదరాబాద్‌తో కలుపుతూ వుండటం ఈ ప్రతిపాదనకు ముఖ్య కారణం. చండీఘర్ పద్ధతిలో రెండు రాష్ట్రాల రాజధానిగా ఏర్పాటు చేయడానికి హైదరాబాద్‌కు అనుకూల పరిస్థితులను ఈ రెండు జిల్లాలే కల్గిస్తాయి. ఈ రెండు జిల్లాలు కలిపిన హైదరాబాద్‌ని ప్రత్యేక యూనియన్ టెరిటరీ (కేంద్రపాలిత రాష్ట్రం)గా చేసినప్పుడే ఈ రెండు రాజధానుల ఆలోచన సఫలీకృతం అవుతుందని కమిటీ అభిప్రాయపడింది.

ప్రతిపాదిత విశాల హైదరాబాద్ రాష్ట్రానికి పాలనాపరంగానూ, శాంతిభద్రతల పరంగానూ అధికారుల్ని, ఉద్యోగుల్ని, సీమ, కోస్తా, తెలంగాణా ప్రాంతాల నుంచి తెప్పించుకోవచ్చు. పాలనావ్యవస్థ పాలనా యంత్రాంగం కోసం విశాలమైన భూభాగం వుంది. కాబట్టి ఆ పరంగా ఎంతైనా అభివృద్ధిని సాధించవచ్చు. ఇలా హైదరాబాద్ రాష్ట్రం ఏర్పడితే దాని జనాభా 10 మిలియన్లు పైగా వుంటుంది. ఇది చండీఘర్, ఢిల్లీ కేంద్రపాలిత ప్రాంతాల మిశ్రమ లక్షణాలు కలిగి, స్వంత అసెంబ్లీని ఏర్పాటు చేసకోగలిగే స్థితి వుంటుంది.

చండీఘుర్ విషయంలో దాని పరిసర నగరాలైన మోహాలి, దేరబస్సి, పంచ్‌కూలా, పర్వానూ మొదలైన పంజాబ్, హర్యానా, హిమాచల్ ప్రదేశ్ రాష్ట్రాలకు చెందిన ప్రాంతాలు కూడా చక్కని అభివృద్ధిని, పెరుగుదలను సాధించిన వైనాన్ని కమిటీ ఇక్కడ గుర్తు చేస్తోంది.

ఢిల్లీ పరిసర నగరాలైన గుర్గం, సోనేపట్, ఫరీదాబాద్, (హర్యానా) ఘజియాబాద్, నోయిడా (ఉత్తర ప్రదేశ్) కూడా ఇలానే చాలా గొప్ప వృద్ధిరేటును సాధించాయని కమిటీ తెలిపింది.

ఇదేవిధంగా, హైదరాబాద్ నల్గొండ, మెహబూబ్‌నగర్‌లతో కలిసిన విశాల కేంద్ర పాలిత ప్రాంతం ఏర్పడితే తెలంగాణా కోస్తా, రాయలసీమ ప్రాంతాల్లోని ఇతర ప్రాంతాలు హైదరాబాద్ అనే ఇంజన్‌తో కలిసి అభివృద్ధి చెందుతాయని, ఉద్యోగావకాశాలు ముమ్మరం అవుతాయని కమిటీ అభిప్రాయపడింది. మూడు ప్రాంతాల వారిని ఈ ప్రత్యామ్నాయానికి ఒప్పించవచ్చనే ఆశాభావాన్ని కమిటీ వ్యక్తం చేసింది.

తెలంగాణా ఉద్యమం మొదలైనప్పుడు ప్రత్యేక రాయలసీమ రాష్ట్రం కోసం కూడా ఉద్యమం తలెత్తిన సంగతిని కమిటీ ప్రస్తావించి, భవిష్యత్తులో రామలసీమ రాష్ట్రం ఏర్పడినా దాని రాజధాని నగరాన్నికూడా ఈ విశాల హైదరాబాద్ కేంద్రపాలిత రాష్ట్రంలోనే ఏర్పాటు చేసుకునేంత అవకాశం ఉంటుంది. అని పేర్కొంది. ఈ వ్యాక్య వ్యంగ్యంగాను కొంచెం ఇబ్బందికరంగానూ ఉంది. ఈ 54 ఏళ్ల ఆంధ్రప్రదేశ్ పాలనలో కోస్తా, రాయలసీమ ప్రజలు భవిష్యత్తులో తమకంటూ ఒక రాజధాని నగరాన్ని ఏర్పాటు చేసుకోలేని బలహీన స్థితిలో ఉన్నారనీ, ఎప్పటికైనా వాళ్లు హైదరాబాద్ మీదే ఆధారపడవలసి వుంటుందనే భావన కమిటీకి దృఢంగా కల్గిందని, దాని ఫలితమే ఈ సూచనలని అనిపిస్తుంది.

అన్యాయం తెలంగాణాతోపాటు సీమ, కోస్తా ప్రజలకూ జరిగిందని, హైదరాబాద్‌ని మినహాయిస్తే రాష్ట్రంలో తగిన అభివృద్ధి జరగనేలేదని కమిటీ అంగీకరించినట్లే భావించాలి. అయితే ఆ విషయాన్ని పైకి దృఢంగా ప్రకటించి ఉంటే అన్యాయాన్ని సరిచేయడానికి కావలసిన ప్రజా చైతన్యాన్ని సమకూర్చినట్లయ్యేది.

ప్రతిపాదిత విశాల హైదరాబాద్ రాష్ట్ర ఆదాయాన్ని కేంద్ర ప్రభుత్వం ఒక రాజీ ఫార్ములా ఆధారంగా మూడు ప్రాంతాల మధ్య పంపకం చేయవచ్చునంటుంది కమిటీ.

అయితే ఈ ప్రత్యామ్నాయం ఆచరణలోకి వస్తే ఎదురయ్యే పరిస్థితిని కమిటీ ఈ విధంగా అంచనా వేసింది.

1) హైదరాబాద్ అనేది తెలంగాణాలో ఒక భాగం. దాన్ని కోల్పోవటానికి తెలంగాణా ప్రజలు ఆమోదించగలిగే అవకాశం లేదు.
2) ఒక వేళ తెలంగాణాకే హైదరాబాద్ దక్కినా, ఉమ్మడి రాజధానిగా దాన్ని చేయడాన్ని కూడా తెలంగాణా ప్రజలు ఆమోదించలేరు.

3) హైదరాబాద్‌తో కలిసి కేంద్రపాలిత ప్రాంతంగా చేస్తే నల్గొండ, మెహబూబ్ నగర్ జిల్లాలకు దీర్ఘకాల ప్రయోజనాలు ఉన్నప్పటికీ తక్కిన తెలంగాణా వారు దాన్ని ఆమోదించడం కష్టం.

4) ప్రజల మనోభావాలే కాదు, రాజకీయ ప్రయోజనాలు కూడా ఇందులో ముఖ్యమైనవి. హైదరాబాద్‌ను వదిలి తెలంగాణా ప్రత్యేక రాష్ట్రం సాధించుకొని వాళ్లు రాజకీయలబ్ధి పొందేదేమీ వుండనేది నిర్వివాదం. అందువలన తెలంగాణాలో సృష్టించే విధ్వంసం ఎక్కువగా వుండే అవకాశం వుంది.

5) ఇక్కడ అన్నింటికన్నా ముఖ్యంగా చూడవలసింది హైదరాబాద్ కలిసి ఉన్నా లేకపోయినా మావోయిస్టు కార్యకలాపాలు తెలంగాణాలో మితిమీరుతాయి.

ఈ కారణాల రీత్యా కమిటీ వారు ఈ నాల్గవ ప్రతిపాదన ఆచరణ సాధ్యంకాక పోవచ్చని భావించి త్రోసిపుచ్చారు.

**5) ఐదవ ప్రత్యామ్నాయం :** రాష్ట్రాన్ని తెలంగాణా, సీమాంధ్రగా విభజించి హైదరాబాద్‌ని తెలంగాణాకి వదిలేసి, సీమలోనో, కోస్తాలోనో కొత్త రాజధానిని ఏర్పరచి రెండవ రాష్ట్రంగా ప్రకటించడం.

ఈ ప్రత్యామ్నాయంలో ఆంధ్రప్రదేశ్‌ని రెండుగా విభజించి హైదరాబాద్ సహా తెలంగాణాని ఒక రాష్ట్రంగానూ, రాయలసీమ, కోస్తా ప్రాంతాలను ఒక రాష్ట్రంగానూ ఏర్పరిచే అంశాన్ని చర్చించారు. అప్పుడు సీమాంధ్రకు కొత్త రాజధాని అవసరం అవుతుంది. దాన్ని అటు రాయలసీమలోనో, ఇటు కోస్తాలోనో ఏర్పాటు చేయవలసి వుంటుంది. అంతవరకూ హైదరాబాద్‌ని ఉమ్మడి రాజధానిగా వాడుకోవచ్చు.

కొత్త రాజధాని నిర్మాణానికి చాలా ఖర్చు చేయాల్సి వస్తుంది. ఈ కొత్త రాజధాని ఖర్చుని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఉమ్మడిగా భరించాలి.

ఈ ప్రత్యామ్నాయం తెలంగాణా ప్రజల మనోగతాన్ని సంతృప్తి పరచవచ్చు. తమ పట్ల వివక్ష జరుగుతోందన్న అపనమ్మకానికి ఇది విరుగుడు కావచ్చు.

కమిటీ తెలంగాణాలో విస్తృతంగా పర్యటించినప్పుడు ఎక్కువమంది స్వరాష్ట్రాన్ని కోరగా, చెప్పుకోతగ్గ సంఖ్యలో తెలంగాణా ప్రజలు మధ్యే మార్గాన్ని అనుసరించారు. కొద్దిమంది వేర్పాటువాదాన్ని వ్యతిరేకించిన వారు కూడా ఉన్నారు.

1) గట్టి తెలంగాణా వాదులు వరంగల్, పశ్చిమ ఖమ్మం, నిజామాబాద్, కరీంనగర్, దక్షిణ ఆదిలాబాద్, సిద్ధిపేట నల్గొండలో కొంత భాగం, మెహబూబ్‌నగర్‌లో కొంత భాగం, రంగారెడ్డి జిల్లాలో కొంత భాగాలలో కన్పించారు. విద్యార్థులు ఎక్కువ ఆవేశ పూరితంగా వ్యవహరించారు. ఉస్మానియా, కాకతీయ విద్యార్థులు నిరుద్యోగ యువకులు, నాన్ గెజిటెడ్ ఉద్యోగుల్లో ఈ ధోరణి ఎక్కువగా ఉంది.

2) తటస్థ వైఖరిని ప్రదర్శించిన వారిలో AIMIM మజ్లీస్ పక్షంవారు, కర్నాటక, మహారాష్ట్ర – చత్తీస్‌ఘడ్, కోస్తాఆంధ్ర, రాయలసీమ సరిహద్దు ప్రాంతాలవారు, తెలంగాణా ఉద్యమ ఆయువుపట్టు ప్రాంతాలైన ఖమ్మం, కరీంనగర్, నిజామాబాద్ జిల్లాల్లో కోస్తా, రాయలసీమ ప్రజలు ఎక్కువగా నివసించే ప్రాంతాలలోని వారు ఎక్కువగా కన్పించారు. హైదరాబాద్ HMDA ప్రాంతంలోని సీమాంధ్ర ప్రజలు కూడా తటస్థంగానే ఉన్నారు.

3) ఇదిలావుండగా ఆదివాసీలలో చాలా ఎక్కువ మంది ముఖ్యంగా ఉత్తర తెలంగాణాలోని అటవీ ప్రాంతాలలోని కొండ ప్రజలు 'మన్యసీమ' పేరుతో తమకు ప్రత్యేక రాష్ట్రం కావాలనే ప్రగాఢ వాంఛను వెలిబుచ్చుతున్నారు.

తెలంగాణా, చత్తీస్‌ఘడ్, ఒరిస్సా, మహారాష్ట్ర ఈ నాలుగు ప్రాంతాలలోని మన్య ప్రజలు "మన్యసీమ" రాష్ట్రాన్ని గట్టిగా కోరుతున్నారు.

4) ఎస్.సీ.లు, బి.సి.లు మైనారిటీలు తమవంతు రాజకీయ ప్రాబల్యాన్ని ఆర్థికాభివృద్ధినీ, రిజర్వేషన్లను కోరుకొంటున్నారు.

ఈ నేపథ్యంలో ఈ ఐదవ ప్రత్యామ్నాయాన్ని పరిశీలించవలసి వుంది.

ఈ ప్రత్యామ్నాయాన్ని అమలు జరిపితే అది కోస్తా రాయలసీమలలో తీవ్ర హింసాత్మక ఉద్యమాలకు దారి తీస్తుందని కమిటీ అభిప్రాయపడింది.

అ) హైదరాబాద్ అంశమూ, త్రాగు నీటి పంపకాలు, సాగునీటి వనరుల విభజన ఇవన్నీ ముఖ్య విషయాలౌతాయి.

ఆ) గతంలో లాగానే సీమాంధ్ర ప్రజాప్రతినిధులపైన రాజీనామా వత్తిడి అధికమౌతుంది.

ఇ) కోస్తా ఆంధ్ర నుంచి రాయలసీమను కూడా వేరుచేసి ప్రత్యేక రాష్ట్రంగా చేయాలనే ఉద్యమం రూపుదిద్దుకొంటుంది.

ఈ) జలవనరుల వినియోగం సమస్యని నిపుణుల కమిటీలు పరిష్కరించినా, రాయలసీమ, కోస్తా ప్రజల మధ్య విద్వేషాలు పెరిగే అవకాశం ఉంది.

ఉ) నక్సలిజం రెక్కలు విచ్చుకునే అవకాశాలు పెరుగుతాయి.

ఊ) ఆంధ్రప్రదేశ్‌లోనే కాదు, దేశంలోని ఇతర ప్రాంతాలలో కూడా దీని ప్రభావంతో వేర్పాటు వాద ఉద్యమాలు చెలరేగే అవకాశం వుంది.

ఎ) భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడిన తరువాత, రాజకీయ వత్తిడికి తలొగ్గి ఒక భాష మాట్లాడే ప్రజల్ని రెండు లేదా మూడు ముక్కలు చేసే తొలి ప్రయత్నం ఇదే అవుతుంది.

ఏ) రాష్ట్రాన్ని విభజించే అంశం చాలా ప్రశాంతంగా కూర్చుని ఆలోచించి తీసుకోవాల్సిన నిర్ణయం. దేశంలో సెంటిమెంటు పేరుతో ఒక ప్రాంతం ఇలా తన ఇష్టా రాజ్యంగా విడిపోతాననే ధోరణిని అంగీకరించడం వలన, అనేక చిన్న రాష్ట్రాల డిమాండ్లు తలెత్తుకొస్తాయి. అందువలన రాష్ట్రాల మధ్య సమన్వయం కష్టసాధ్యం అవుతుంది.

ఐ) ఆర్థికపరంగా ప్రపంచవ్యాప్తంగా ఒక ప్రత్యేకమైన పరిస్థితి నడుస్తోంది. ఎక్కడికక్కడ ఆర్థిక ప్రాంతాలు (economic Blocks) ఏర్పడుతున్నాయి. అనేక దేశాలు కలిసి ఒక బ్లాక్‌గా ఏర్పడి ఆర్థిక సత్వరాభివృద్ధికి అవకాశాలు అన్వేషిస్తున్నాయి. కొత్తమార్కెట్లు, ఉద్యోగావకాశాల మీద దృష్టి పెడుతున్నాయి. ఈ దశలో చిన్న రాష్ట్రాల ఏర్పాటువలన అంతర్రాష్ట్ర పరంగానూ, రాష్ట్ర పరంగాకూడా వాణిజ్యం, సరుకు రవాణా సేవలకు ఇబ్బందే కలుగుతుంది. స్థానిక పన్నులు పెరుగుతాయి. వాణిజ్యం ఖరీదైన దౌతుంది. రేట్లు పెరుగుతాయి. స్థానిక చట్టాలు ఎక్కడికక్కడ సరకు రవాణాను అడ్డుకొనేవిధంగా ఉంటాయి. ఈ విధమైన భయం కోస్తా, సీమ ప్రజలలో ఎక్కువగా ఉంది.

ఒ) ఇప్పటివరకూ హైదరాబాద్ మార్కెటింగ్ కేంద్రంగా ఉంది. సరుకు ఉత్పత్తి, సరఫరాలకు అనుకూలంగా అది అభివృద్ధిచెందింది. తెలంగాణా ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడితే, హైదరాబాద్ చాలా దూరపు సరిహద్దు అవుతుంది. అందులో కోస్తా ఆంధ్రకు వాణిజ్య పరంగా చాలా నష్టం కలిగే అవకాశం ఉంది. అంత జనాభా, అంత గొప్ప వ్యాపారం, మార్కెటింగ్ సౌకర్యాలు కల్గిన ప్రాంతాన్ని కోస్తా ఆంధ్ర కోల్పోయి తీవ్రంగా నష్టపోతుంది.

ఓ) ఈ స్థితిలో ప్రత్యేక సీమాంధ్ర రాష్ట్రం ఒక నెగెటివ్ అంశంగా మారి రాష్ట్ర అభివృద్ధి బాగా దెబ్బతింటుంది.

ఔ) ఆర్థికంగా ప్రతిపాదిత తెలంగాణా రాష్ట్రంకూడా సముద్రజలాల ద్వారా జరిగే వాణిజ్య కార్యకలాపాలకు దూరం అవుతుంది. విశాఖపట్టణం ఓడరేవులాంటి అనేక ఓడరేవులు తెలంగాణా వాణిజ్యానికి సహకరిస్తున్న వాటిని ఆ రాష్ట్రం కోల్పోతుంది. ఆయిల్, గ్యాస్ వంటి భూగర్భవనరులు ప్రతిపాదిత తెలంగాణా రాష్ట్రానికి దొరక్కుండా పోతాయి. సమైక్య ఆర్థిక వనరులే మొత్తం తెలుగు ప్రజల ప్రాంత అభివృద్ధికి దోహదపడుతాయి. "Integrated economy is likely to benefit to people of both regions optimally, rather than through separation by formation of Telengana State" అని వ్యాఖ్యానించింది జస్టిస్ శ్రీకృష్ణకమిటి.

"అయితే, పూర్తిగా అభివృద్ధి చెందిన హైదరాబాద్ తెలంగాణాకు మాత్రమే దక్కినందువలన 'GDP' ఈ ప్రతిపాదిత తెలంగాణా రాష్ట్రంలో తక్కిన రాష్ట్రాలకన్నా ఎక్కువగా ఉండే అవకాశం ఉంది" అని కూడా కమిటీ తన అధ్యయన నివేదికలో పేర్కొంది.

ప్రత్యేక తెలంగాణా ఉద్యమానికి సుదీర్ఘ చరిత్ర ఉంది. తీవ్రమైన భావోద్వేగాలు నడుస్తున్నాయి. వాటిని సమర్థవంతంగా ఎదుర్కొనే సత్తా పాలనావ్యవస్థలో కొరవడినప్పుడు తెలంగాణావాదానికి తలొగ్గకతప్పదు.

1956 పెద్దమనుషుల ఒప్పందం, వ్యవసాయం సాగునీరులకు సంబంధించిన పథకాలు, తెలంగాణావారికి ఉద్యోగావకాశాల విషయంలో రాష్ట్రపతి ఉత్తర్వులు – ఇవన్నీ సక్రమంగా అమలుజరగకపోవడం వలన ప్రత్యేక రాష్ట్ర వాదానికి మనోభావాలు, భావోద్వేగాలు లాంటి అంశాలు తోడైనాయి. వాస్తవానికి ప్రత్యేక తెలంగాణా కోరడంలో న్యాయం వుందని కమిటీ అభిప్రాయపడింది.

కాబట్టి, ప్రత్యేక తెలంగాణా రాష్ట్రాన్ని హైదరాబాద్‌తో సహా ఇవ్వడం అనే ఈ ప్రత్యామ్నాయాన్ని అంగీకరించవలసి ఉంది.

అయితే కోస్తా, రాయలసీమ మరియు హైదరాబాద్‌లో నివసించే ప్రజల మనోభావాలు, భావోద్వేగాలు, అలాగే సమైక్యాన్ని కోరుకొంటున్న తెలంగాణాలోని ప్రజల మనోభావాలు – వారి వ్యాపార ప్రయోజనాలు, వారి ఆస్తులు, వాళ్ల పెట్టుబడులు, వాళ్ళ జీవనాధారాలు, వారి ఉద్యోగావకాశాలు – వాటన్నింటికీ ప్రాముఖ్యతనిచ్చి ఈ ప్రత్యామ్నాయాన్ని పరిశీలించవలసి ఉంటుంది. వారి ప్రయోజనాలను కాపాడగలమనీ, రక్షణ కల్పించ గలమనే నమ్మకాన్ని వారిలో కల్గించగలగాలి. అందుకు అందరికి ఆమోద యోగ్యమైన ఏకాభిప్రాయాన్ని సాధించగలగాలి. ఏకాభిప్రాయంతో తెలంగాణా రాష్ట్రాన్ని ఇచ్చే పరిస్థితి ఏనాడో చేదాటిపోయింది. దాన్ని సాధించగలగడం భగీరథ ప్రయత్నమే అవుతుంది.

ఈ విషయాలన్నీ దృష్టిలో పెట్టుకొని కమిటీ ఈ ప్రత్యామ్నాయం మీద తన అభిప్రాయాన్ని ఈ విధంగా పేర్కొంది.

అ) ఈ ప్రత్యేక తెలంగాణా ఏర్పాటు ప్రత్యామ్నాయం ఆ ప్రాంతంలోని ఎక్కువమందిని సంతోషపెట్టవచ్చు కానీ, అనేక కొత్త జాతీయ సమస్యలకు తెరతీసే ప్రమాదం ఉంది.

ఆ) రాష్ట్రంలోని మిగిలిన రెండు ప్రాంతాలలో చోటు చేసుకోబోయే పరిణామాలను విస్మరించకూడదు.

లాభనష్టాలు రెండింటినీ బేరీజు వేసుకొని ఆలోచించిన తర్వాత జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ ఈ ప్రత్యామ్నాయానికి రెండవస్థానాన్ని మాత్రమే ఇచ్చింది. అయితే మిగిలిన నాలుగు ప్రతిపాదనల్లా త్రోసి పుచ్చలేదు. విభజన అనేది తప్పనిసరి స్థితిలో తీసుకోవాల్సిన నిర్ణయమే. గాని అదే ప్రధాన నిర్ణయం కాకూడదని కమిటీ అభిప్రాయపడింది. మూడు ప్రాంతాలవారి మనోభావాలను పరిగణనలోకి తీసుకొని అందరికీ ఆమోద యోగ్యంగా విభజనకు తలపడవలసి ఉంటుందని పేర్కొంది.

జస్టిస్ శ్రీకృష్ణకమిటీ నివేదికలో ప్రత్యేక తెలంగాణా ఏర్పాటుకు ద్వితీయ ప్రాధాన్యత రావడానికి కొంత బాధ్యతని తెలంగాణా రాష్ట్ర వాదులుకూడా తీసుకోవాలి. రాష్ట్ర విభజన తప్ప మరొక గత్యంతరం లేదని వాదించారేగాని, అందుకు తగిన నిరూపణలు కమిటీకి వారు అందించలేక పోయారు. సమైక్య రాష్ట్రంకోరుతున్న వారిలో విభజన వలన తమకు నష్టాలు ఎక్కువ అనే అభిప్రాయం బలంగా ఉంది. ఆ నష్టాలను నివారించేందుకు తగిన చర్యల్నీ కమిటీ ముందుంచడంలో తెలంగాణ వాదులు విఫలం అయ్యారు. తాము అడిగింది అడిగినట్లు ఇవ్వటానికి కమిటీకి తగురీతిలో సహకరించాలనే అంశాన్ని విస్మరించారు. అనర్థాలన్ని దేశం భరించాలని, తాము అడిగింది మాత్రం ఇచ్చేయాలని, అవతలివారి నష్టంతో తమకు నిమిత్తం లేదన్నట్లు వ్యవహరించారు. భిన్నాభిప్రాయం ఉన్నవారిని ద్రోహులుగా ముద్రవేయడమేతప్ప పరిష్కార మార్గాలు అన్వేషించే ప్రయత్నం చేయలేదు. పైగా భిన్నాభిప్రాయం ఉన్నవారి నోరు నొక్కే ప్రయత్నంచేశారు.

సమస్యను పరిష్కరించడం అంటే సమైక్యంగా రాష్ట్రాన్ని ఉంచడం అని మాత్రమే అర్థంకాదు. ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే కలిగే నష్టాలను నివారించడం అనే అర్థంకూడా ఉంది అందుకుకూడా చర్చలు జరపవలసిన అవసరం లేదన్నట్లు తెలంగాణావారు వ్యవహరించారు. ఉద్యమాలలో ఇలాంటి ధోరణులు సహజమే ! వాటిని అర్థం చేసుకోవచ్చు. కానీ, అదే తెలంగాణాని సాధించకుండా అవరోధంగా ఉండకూడదు.

కమిటి నివేదికలో కూడా కొన్ని అంశాలకు సమాధానం వెదికే ప్రయత్నం జరుగలేదు.

1) ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం ఏర్పడితే, తెలంగాణాలో ఎన్ని ప్రభుత్వోద్యోగాలు కొత్తగా కల్పించే అవకాశం ఉంది ? వాటి వివరాలు పొందుపరచలేదు.

2) కోస్తా వారితో పోలిస్తే ప్రతిభలో వెనకబడి ఉన్నామని, కాబట్టి తెలంగాణా రాష్ట్రం కావాలనే డిమాండ్ వచ్చినప్పుడు ఇదే సూత్రం ఆధారంగా ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే తక్కువ ప్రతిభావంతులలో ప్రభుత్వోద్యోగాలు నింపేస్తారా ? ప్రతిభ తక్కువగా ఉన్నవారికి ప్రైవేటు రంగంలో ఉద్యోగాలు ఎన్ని సమకూరే అవకాశం ఉంది ? ప్రైవేటు ఉద్యోగాలలోకి

తెలంగాణా యేతరుల్లోంచి ప్రతిభావంతుల్ని ఎంపిక చేసుకోకుండా ఎలా నిరోధించగలరు ? తెలంగాణా వాదులు రోజూ మీడియాలో చెప్తున్న ఈ అంశాలకు తగిన ఆధారాలను కమిటీ తన నివేదికలో ప్రస్తావించలేదు.

3) తెలంగాణా లోని వనరుల్ని ఇతరులకు ఎగుమతి చెయ్యకుండా, ఇతరులనుంచి దిగుమతి చేసుకోకుండా తెలంగాణా చుట్టూ గోడని కట్టి తెలంగాణాని ఎలా అభివృద్ధి చేయగలరో పేర్కొనలేదు.

4) హైదరాబాద్ మార్కెట్ రెక్కలు విరిచి తెలంగాణా అభివృద్ధి సాధించగలరా అనే ప్రశ్నకు సమాధానం లేదు.

జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ తెలంగాణా వాదులు చెప్పే ఈ విషయాల మీద దృష్టి పెట్టలేదన్నది స్పష్టం ! ప్రజల్ని రెచ్చగొట్టి ఉద్యమోన్ముఖుల్ని చేసేందుకు చెప్పే మాటలేగాని, వాటికి ఎక్కువ ప్రాధాన్యత నివ్వవలసిన అవసరం లేనివిగా భావించినట్లు ఈ నివేదిక చదివితే అర్థం అవుతోంది. తాము చెప్పే మాటలకు తగిన ఉపపత్తిని తెలంగాణా వాదులు స్పష్టీకరిస్తే తటస్థవాదుల నుంచి అనుకూల స్పందన సాధించుకున్నవారౌతారు. జాతీయ స్థాయిలో మద్దతు సాధించుకున్నవారు కూడా అవుతారు.

తెలంగాణా యువతరం తక్కువ ప్రతిభా సంపన్నులని ఎవరూ అనుకోవడం లేదు. విదేశాలలోని తెలంగాణా ఎన్.ఆర్.ఐ.లు, దేశవ్యాప్తంగా ఎన్నో ఉన్నతోద్యోగాలలో ఉన్న తెలంగాణా బిడ్డల్ని తక్కువ ప్రతిభావంతులుగా అవమానించడం ఎంత ఉద్యమం కోసం అయినా తగదు. ప్రతిభను మరింతగా పెంచుకొనే మార్గాలు వెదకాలనీ, ప్రత్యేక శిక్షణనిచ్చే ఏర్పాట్లు చేయాలనీ నాణ్యమైన విద్యనందించే చర్యలు చేపట్టాలనీ కమిటీ సూచిస్తోంది. సానుకూలంగా స్పందించడం అందరిబాధ్యత ! లీలావతి గణితం లాంటి మహాశాస్త్ర గ్రంథాలు పుట్టిన నేల అది !

**6) ఆరవ ప్రత్యామ్నాయం**

రాష్ట్రాన్ని సమైక్యంగా ఉంచటం – తెలంగాణా ప్రాంత సామాజిక, ఆర్థికాభివృద్ధికి, రాజకీయ సాధికారికతకు చట్టపరమైన చర్యలు తీసుకోవటం, తగిన అధికారాలతో తెలంగాణా ప్రాంతీయ అభివృద్ధి మండలి ఏర్పాటు చేయడటం.

ఈ ప్రత్యామ్నాయ పరిష్కారం 1వ సూచన "రాష్ట్రాన్ని యధాతధంగా ఉంచటం" అనే దానికి కొనసాగింపు. ఈ సూచనలో తెలంగాణా ప్రాంతీయ అభివృద్ధి మండలిని ఏర్పాటు చేయటం అనే అంశం అదనంగా చేర్చబడింది. కమిటీ చేసిన ప్రత్యామ్నాయ పరిష్కారాలలో ఇది ఆఖరిది.

పైన పేర్కొన్న అనేక అంశాల దృష్ట్యా, జస్టిస్ శ్రీ కృష్ణ కమిటీ మూడు ప్రాంతాల సంక్షేమానికి "అభివృద్ధి" ఒక్కటే తారక మంత్రంగా భావించింది. ఆర్థిక, రాజకీయ

పరమైన వికేంద్రీకరణ వలననే సమతుల్యతని సాధించగలుగుతామని కమిటీ స్పష్టం చేసింది.

రెండు ప్రాంతాలకూ ఒకే శాఖకు వేర్వేరు మంత్రులు, అసెంబ్లీలు, రాజధానులు, కోర్టులు, సంస్థలు, పాలనా యంత్రాంగం ఇవన్నీ అక్కడ ఇక్కడా సమానంగా ఉంచడం లాంటి చర్యల వలన పెద్ద ప్రయోజనం ఏమీ ఉండదని కూడా కమిటీ భావించింది.

రాష్ట్ర సమైక్యత అనేది మూడు ప్రాంతాల సమాన అభివృద్ధిని కాంక్షించేదిగా ఉండాలని కమిటీ ఆకాంక్షించింది. మొదట పాలనా వ్యవస్థకు చిత్తశుద్ధి ఉండాలన్నది.

చిత్త శుద్ధి లేదనడానికి అనేక సాక్ష్యాలు కన్పిస్తున్నాయి.

1. అకాడమీలను రద్దుచేసి, తెలుగు విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేయడంవలన ముఖ్యంగా సాహితీవేత్తలకు తీరని అన్యాయం జరిగింది. తెలంగాణా రచయితలు బాగా నష్టపోయారు.

2. అమరజీవి పొట్టిశ్రీరాములు ప్రాతః స్మరణీయుడే ! కానీ, హైదరాబాదులో తెలుగు విశ్వవిద్యాలయం నెలకొల్ప దల్చినప్పుడు విద్యా సాహిత్య సాంస్కృతిక రంగాలకు సంబంధంలేని పొట్టి శ్రీరాములు పేరు దానికి పెట్టడం వానమామవైవరదాచార్యులు లేదా సురవరం ప్రతాపరెడ్డి లాంటి సాహితీ వేత్తలని విస్మరించటం ఎవరికైనా బాధ కలిగించే అంశం. పొట్టి శ్రీరాములు పేరే పెట్టదలిచినప్పుడు దానిని నెల్లూరు జిల్లాలో నెలకొల్పి ఉండాల్సింది.

3. తెలంగాణా విమోచన దినాన్ని తెలుగు ప్రజలందరూ జరుపుకునేలా ఎలాంటి చర్యా తీసుకోలేదు. తెలంగాణా ప్రజలతో మమేకమయ్యేలా కోస్తా, సీమ ప్రాంత మేధావులు కూడా ఆ దిశలో ఎలాంటి ప్రయత్నము చేయలేదు. అది అవతలి వారికి ఆధిపత్య భావనగాను, అహంకారంగాను కన్పించడంలో ఆశ్చర్యంలేదు.

4. తెలంగాణాలో రోడ్లు అధ్వాన్నం. బస్సులు అధ్వాన్నం. కోస్తాలో తిరిగే మఫిషియల్ బస్సులు ఇలా ఉన్నాయా ? ఎందుకు ఈ తేడా ?

5. ప్రతాపరుద్రుడు, రాణిరుద్రమ్మలాంటి చారిత్రక పురుషులను తలుచుకునే అవకాశం తెలుగు ప్రజలందరికీ కల్పించలేదు.

6. గుండేరావుహర్కార్, రాయ్‌మెహబూబ్ నారాయణ్ లాంటి మేధావుల్ని రాష్ట్ర వ్యాప్తంగా తెలుగు ప్రజలంతా గుర్తించారా ?

7. సీతారామరాజు, కన్నెగంటి హనుమంతులతో పాటు కొమరం భీముని, సర్వపాపడిని తలుచుకుంటున్నారా ?

8. సమ్మక్క సారక్కల మెమోరియల్ ఏదైనా కట్టారా ? కొత్వాల్ వెంకటరామారెడ్డి పేరుని పోలీసు అకాడమీకి ఎందుకు పెట్టలేకపోయారు ?

9. తెలంగాణా సంస్కృతిలోని ప్రత్యేకతని తెలుగు ప్రజలందరికి పరిచయం చేసి గౌరవించేలా ఏ చిన్న ప్రయత్నం అయినా జరిగిందా ?

10. పొన్నగంటి తెలగనార్యుడిలాంటి కవులకు ఇబ్రహిం కులీ కుతుబ్‌షా మొదలైన నవాబుల ఆస్థాన కవులకు తగిన గౌరవస్థానం కల్పించారా ?

ఇలా తవ్వుకుంటూ వెళ్ళితే చాలా విషయాలు పాలకుల నిర్లక్ష్యాన్ని, సీమ, కోస్తాలోని మేధావుల అలసత్వాన్ని సూచించేవి ఉన్నాయి. అవి తెలంగాణా హృదయాల్ని గాయపరచి బాధిస్తాయి. అందుకు సీమ, కోస్తా ప్రజలు విచారం వెలిబుచ్చకపోవడం, ఈ తప్పుని సవరించుకునే నిర్ణయం తీసుకోకపోవడం అమానుషమే అవుతుంది. ఇవి చేయకుండా సమైక్యవాదాన్ని ప్రబోధించడం ఆత్మస్తుతి, పరవంచన కూడా !

కమిటీ వారు ఇలాంటి అంశాలను వేలెత్తి చూపించి, పాలనా వ్యవస్థని మేధావుల్ని ఆత్మ పరిశీలన చేసుకోవాలని ఒక చురక అంటించి ఉండాల్సింది.

**తెలంగాణా ప్రాంతీయ అభివృద్ధి మండలి**

ఆఖరి ప్రత్యామ్నాయ పరిష్కార సూత్రంలో శ్రీకృష్ణకమిటీవారు గట్టి అధికారాలు కలిగిన తెలంగాణా ప్రాంతీయ అభివృద్ధి మండలిని ఏర్పరచడాన్ని ఒక పరిష్కార మార్గంగా సూచించారు.

చట్టప్రకారం ఏర్పడిన "తెలంగాణా ప్రాంతీయ మండలి" అనే సాధికారిక సంస్థకు తగినన్ని నిధులు కేటాయించి, విధులు నిర్ణయించి కార్యకలాపాలను నిర్దేశించడం అవసరం అని కమిటీ సూచించింది. ఈ కార్యకలాపాలు 1956 పెద్ద మనుషుల ఒప్పందానికి అనుగుణంగా Legislative Consultative Mechanism (చట్టబద్ధమైన సంప్రదింపులు చేయగల) అవకాశం ఇవ్వాలని కమిటీ పేర్కొంది.

శాసనసభలో ఈ మేరకుప్రతిపాదన పెట్టి, చర్చలు జరిపి శాసనమండలి సలహాలు సూచనలు పొందడంలాంటి విధానాల ద్వారా ఈ తెలంగాణా ప్రాంతీయ మండలిని చట్టబద్ధంగా ఏర్పరచాలని కమిటీ సూచించింది.

ఒక వేళ ఎప్పుడైనా రాష్ట్రప్రభుత్వం లేదా అసెంబ్లీకి, ఈ ప్రాంతీయ మండలికీ అభిప్రాయ భేదాలు తలెత్తిన పరిస్థితిలో గవర్నర్ నేతృత్వంలోని ఒక ఉన్నత సంఘం ఆవివాదాన్ని పరిష్కరించే అవకాశం కల్పించాలని, గవర్నర్‌తో కూడిన కమిటీలో ముఖ్య మంత్రి, ప్రతిపాదిత తెలంగాణా ప్రాంతీయ మండలి అధ్యక్షులు, ఉపముఖ్యమంత్రి, స్పీకర్, శాసనమండలి చైర్మన్, పేరొందిన, ఆ వివాదాస్పద అంశంపైన అనుభవం కలిగిన ఒక న్యాయమూర్తి, అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకుడు, కౌన్సిల్‌లో ప్రతిపక్ష నాయకుడు

వీరంతా సభ్యులుగా ఉండాలని ఈ ఉన్నత స్థాయి కమిటీ సమస్యను పరిష్కరించి నిర్ణయం చేయవలసి ఉంటుందనీ సూచించింది.

- ప్రణాళిక, ఆర్థికాభివృద్ధి, హైదరాబాద్ – HMDA తప్ప తక్కిన తెలంగాణా ప్రాంత అభివృద్ధి ఇవన్నీ రాష్ట్ర ప్రణాళికలో తగు పాళ్లలో ఉండేలా చూడాలి.
- సాగునీరు, త్రాగునీటి సౌకర్యాలు
- ప్రాథమిక మాధ్యమిక విద్య, ప్రావీణ్యత, వృత్తి విద్యలు
- స్థానిక పరిపాలనా వ్యవస్థ (PRI, ULB (HMDA తప్ప)
- ప్రజారోగ్యం (జిల్లా ఆస్పత్రులు, మెడికల్ కాలేజీలు, స్పెషాలిటీ ఆస్పత్రులు తప్ప తక్కినవి)

ఇవి మచ్చుకు కొన్ని సూచనలు. ప్రాంతీయమైన, సామాజికమైన, ఆర్థికమైన, సాంస్కృతికమైన అంశాలను కూడా ఈ ప్రతిపాదిత తెలంగాణా ప్రాంతీయ మండలి పరిధిలోని అంశాలుగా ఉంచాలని కూడా సూచించింది.

దీని చైర్మన్‌గా ఉన్న వ్యక్తి శాసన సభ్యుడై, కేబినెట్ మంత్రి కూడా అయి ఉండాలని నిర్దేశించింది. నిధుల వినియోగం, విధులు, విధానాలన్నీ మండలి స్వతంత్రంగా నిర్దేశించుకొనేలా స్వేచ్ఛ ఉండాలని పేర్కొంది. ఈ మండలి కార్యనిర్వాహణ కూడా స్వతంత్రంగా ఉండాలని, అడిషినల్ చీఫ్ సెక్రటరీ స్థాయి వ్యక్తి చైర్మన్‌కు బాధ్యుడై వ్యవహరించాలని, శాసన సభ్యులు, శాసనమండలి సభ్యులు ఇందులో నిర్దేశిత సంఖ్యలో సభ్యులుగా ఉండాలన్నది. విషయ నిపుణులను కూడా ఓటింగ్ హక్కులేని సభ్యులుగా కో-ఆప్ట్ చేసుకోవచ్చని పేర్కొంది. అలాగే మండలి సెక్రటేరియట్‌లోని అధికారులు ఇతర ఉద్యోగుల సంఖ్య కూడా పనిభారాన్ని బట్టి పెంచుకోవచ్చు. రోజువారీ కార్యకలాపాల వ్యయానికి GFR ఉంటుంది. విశ్వసనీయతని పెంచే విధంగా, తెలంగాణాకు తగిన రాజకీయ ప్రాధాన్యతని, ముఖ్యమంత్రి లేదా ఉపముఖ్య మంత్రి వంటి కీలక పదవులను అందుకోగలిగే అవకాశాలు, మంత్రి పదవుల వంటివి సమతూకంగా దక్కేలాగా ఈ మండలి కృషి చేయవలసి ఉంటుంది. తెలంగాణా ప్రజల్లో విశ్వాసాన్ని నింపే బాధ్యత ఈ మండలిదే !

కేంద్ర ప్రభుత్వ ప్రణాళికా సంఘంతో చర్చలు జరిపేటప్పుడు, ఆర్థిక మంత్రితోనూ, ప్లానింగ్ కమీషన్ డెప్యూటీ చైర్మన్‌తోనూ, ఫైనాన్స్ కమీషన్ చైర్మన్‌తోనూ చర్చలు జరిపే సమయంలో ముఖ్యమంత్రితో పాటు ఉపముఖ్యమంత్రి కూడా ఉండాలని కమిటీ నిర్దేశించింది.

పెద్దమనుషుల ఒప్పందాన్ని సక్రమంగా అమలుచేయనందువలననే ప్రత్యేక తెలంగాణా వాదం పుట్టుకొచ్చిందని కమిటీ అభిప్రాయపడింది. ఈప్రాంతీయ అభివృద్ధి మండలి ఏర్పాటుతో అలాంటి చర్యలకు అవకాశం ఉండదని, తెలంగాణాకు న్యాయం జరుగుతుందనీ భావించింది. ఉప ప్రణాళిక నిధులు పునర్వినియోగం చేయాల్సి వచ్చినప్పుడు ప్రాంతీయ మండలి సిఫార్సుల ప్రాతిపదికన జరగాలని పేర్కొంది.

ఆంధ్రప్రదేశ్‌ని సమైక్యంగా ఉంచడం అనే పరిష్కారాన్ని అందరి సంక్షేమం, జాతీయ ప్రయోజనాలు దృష్టిలో పెట్టుకొని తీసుకున్నదని కమటీ చెప్పుకున్నది. హైదరాబాద్ విషయంలో ఎలాంటి సందిగ్ధతకూ అవకాశం లేకుండా విద్య, వాణిజ్య, పారిశ్రామిక, సాంకేతిక పరమైన అభివృద్ధిని అది సాధించేందుకు దీనివలన అవకాశం ఏర్పడుతుందని కమిటీ భావించింది.

జలవనరుల విషయంలో అసమానతలను పరిష్కరించేందుకు, Water Management Board, Irrigation Project Development Corporation లాంటివి విస్తృత ప్రాతిపదికన ఏర్పాటు చేయవలసి ఉంటుందనీ, తెలంగాణా వాదులు లేవనెత్తిన అనేక సమస్యలకు ఈ ప్రాంతీయ మండలి ఒక పరిష్కారంగా ఉంటుందని కమిటీ భరోసా ఇస్తోంది.

"ఇలా అనగానే మొదట వ్యతిరేకతని వ్యక్తపరచడం సహజం. తెలంగాణా రాజకీయ వేత్తలు, మేధావులు, పోరాట సంస్థలు, ప్రజలు కూడా ఇలాకుదరదనీ, తాము కోరినట్లు తెలంగాణా రాష్ట్రమే కావాలని అంటారు. తమ డిమాండ్ చేసినట్లు జరగలేదని ఆగ్రహిస్తారు. విద్యార్థులు, చిరుద్యోగులు, నిరుద్యోగులు, న్యాయవాదులు, రైతులు కూడా అసంతృప్తిని వ్యక్తం చేస్తారు. నిరసనలకు దిగే ప్రయత్నం చేస్తారు. మామూలుగానే ప్రజా ప్రతినిధుల పైన రాజకీయ వత్తిడి తెచ్చి రాజీనామాలను చేయించాలని చూస్తారు. కొంతకాలంపాటు విధ్వంసం జరగవచ్చు కూడా ! ప్రాంతీయ మండలి సాధికారికంగా ఏర్పడి, ఒకసారి తనప్రభావాన్ని చాటడం మొదలుపెట్టగానే ఈ ఆవేశకావేశాలన్నీ చల్లబడతాయి. అప్పుడు రాష్ట్రాన్ని తిరిగి అభివృద్ధి దిశకు నడుపుకు పోయేందుకు అవకాశం ఏర్పడుతుంది" అని పేర్కొంది.

ఇదేవిధంగా, అందరికన్నా వెనుకబడిన రాయలసీమలోనూ, బాగా వెనుకబడిన ప్రాంతాలున్న కోస్తా ప్రాంతంలో కూడా ఇలాంటి అభివృద్ధి మండళ్ల ఏర్పాటుకు సంబంధించిన డిమాండ్లు వస్తాయి. ఉత్తర సరిహద్దుల్లోని మన్య ప్రాంతాల్లోనూ ఇలాంటివి అవసరం అవుతాయి.

అయినప్పటికీ రాయలసీమ, హైదరాబాద్‌లోని మెజారిటీ ప్రజలు ఈ ప్రతిపాదనని స్వాగతించే అవకాశం ఉందని కమిటీ ఆశాభావం వ్యక్తపరిచింది !

ఈ ప్రతిపాదనని అమలులో కొన్ని సమస్యలు ఉండవచ్చని కమిటీ గుర్తించింది. అయితే, ఉన్న పరిస్థితుల్లో ఇంతకన్నా మెరుగైన ప్రత్యామ్నాయం లేదని కమిటీ భావించింది.

సామాజిక ఆర్థిక ప్రగతి, ఉన్నత పరిపాలన అనే అంశాలను జాతీయ ప్రయోజనాల దృష్ట్యా పరిగణలోకి తీసుకొని ఈ ప్రతిపాదన చేసినట్లు కమిటీ పేర్కొన్నది. దేశంలో ఇతర ప్రాంతాలలో చెలరేగే వేర్పాటు వాదాలకు కూడా ఇదే సమాధానం అవుతుందని కమిటీ అభిప్రాయ పడింది.

ఈ అభిప్రాయాలన్నీ పరిశీలించిన తర్వాత కలిసి ఉండటమే ఉత్తమం అని, విడిపోవడం ద్వారా అభివృద్ధి సాధించడం అపోహ అనీ, శ్రీ కృష్ణ కమిటీ బలంగా విశ్వసించినట్లు అర్థం అవుతుంది.

"అభివృద్ధి" అనేది బలమైన నాయకత్వం, సమర్థమైన పాలన ఉన్నప్పుడే సాధ్యం అవుతుందని, అంతేగాని రాష్ట్రాలు చిన్నవిగా ఉంటేనే అభివృద్ధి అనుకోవడం పొరబాటనీ, చిన్న రాష్ట్రమైనా బలహీన నాయకత్వం ఉంటే చతికిలబడ్తుందనీ కమిటీ సుద్దులు చెప్పింది. అలాగని పెద్ద రాష్ట్రం అయితే ఏదో ఒరగబెడ్తుందనుకోవడం పొరబాటు, సమర్థవంతమైన పాలన ఉంటే ఏ సైజు రాష్ట్రం అయినా అభివృద్ధి చెందుతుందని భావించింది.

ఒక పార్టీ గాని, ఒక పాలకుడుగాని అసమర్థంగా పాలించినప్పుడు బుద్ధిచెప్పి, పదవిలో నించి దింపి మరొకరికి పట్టంగట్టి అందలం ఎక్కించగలిగే శక్తి ప్రజలకుంది. కానీ, అందరూ అంతంత మాత్రమే అయి, బలమైన నాయకత్వ పటిమ, దృఢ సంకల్ప శుద్ధి, సమర్థతలున్న వ్యక్తులు కనుచూపుమేరలో కానరాని స్థితిలో రాష్ట్రం ఉన్నప్పుడు 'ఓటు' అనే ఆయుధం ద్వారా ప్రజలు చేయగలిగింది ఏమీలేక ఉన్న మొగుడితోనే సరిపెట్టుకున్నట్లయే అవకాశాలున్నాయి.

జస్టిస్ శ్రీకృష్ణకమిటీ తన ప్రతిపాదనల్లో పాలనాపరంగా మూడు ప్రాంతాలకు అభివృద్ధిని సమానంగా పంచే యంత్రాంగాన్ని ఏర్పాటు చేసుకోవాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పి ఉంటే బావుండేది. అభివృద్ధి సూచనలను తెలంగాణాకే పరిమితం చేసింది.

భవిష్యత్తులో రాయలసీమలోనూ, కోస్తా ప్రాంతంలోనూ బస్సులు తగలబెట్టి, షాపులు పగలగొట్టినప్పుడు ఆ ప్రాంతాలకు అభివృద్ధి మండళ్లు పెట్టవచ్చనే అభిప్రాయం కలగకుండా, మూడు సాధికారిక మండళ్లను సూచించి ఉంటే మెరుగైన నివేదిక అయిఉండేది.

'ఏడ్చేదాని మొగుడు' సామెతలాగా, తెలంగాణాకి ఏదైన ఇస్తే కోస్తా సీమలక్కూడా వస్తుందనే ఆశతో ఎదురుచూసే దుస్థితి రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలకు పట్టకుండా ముందు జాగ్రత్త చర్యలు సూచించి ఉంటే ఎక్కువ సంతృప్తికరంగా ఉండేది. జస్టిస్

శ్రీకృష్ణ కమిటీ నిజానికి, ఆంధ్రప్రదేశ్‌లో నెలకొన్న పరిస్థితి మీద వేసిన కమిటీయే గాని, తెలంగాణా గురించి మాత్రమే అధ్యయనం చేయడానికి ఆదేశించింది కాదుగదా ! మరి, తెలంగాణాకు మాత్రమే అభివృద్ధి తారక మంత్రాన్ని ఉదేశించి, అంతకన్న వెనుకబడినవిగా కమిటీయే గుర్తించిన సీమ, ఉత్తర కోస్తా ప్రాంతాల అభివృద్ధి గురించి మౌనం దాల్చడం ఆశ్చర్యం కల్గించింది.

ప్రాంతీయ ఆర్థిక సమానత్వం సూత్రం పునాదులమీద కొత్తపాలనా వ్యవస్థను ఈ కమిటీ ఆవిష్కరిస్తుందని ఆశించిన వారికి ఈ నివేదిక కొంత అసంతృప్తినే కల్గించింది. ముఖ్యంగా విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలోని వెనుకబాటు తనానికి తగిన పరిష్కారాలు కమిటీ పరిశీలనలో లేకుండా పోయాయి. ఆమేరకు ఈ జిల్లాలకు పెద్ద అన్యాయమే జరిగింది.

1) ఈ మండళ్ల చైర్మన్, సభ్యులు వీళ్లంతా ముఖ్యమంత్రి సహచరులే నామినేట్ అయినప్పుడు ఎంత చట్టబద్ధ సంస్థ అయినా ఒనగూరే ప్రయోజనం ఏమీ ఉండదు. 'ప్రాంతీయ మండలి' ఒకటి కాదు మూడు ఏర్పడాలి. వాటి అధ్యక్షులు ప్రత్యక్ష ఎన్నికల ద్వారా గెలిచి సత్తా చూపించగలవాళ్లుగా ఉండాలి. అప్పుడు కూడా తైనాతీవే గెలిచే ప్రమాదం ఉన్నప్పటికీ, నామినేట్ అయినవాడికన్న మెరుగే కదా !

2) ముఖ్యమంత్రి లేదా మంత్రులు లేదా అధికారుల చర్యలను ప్రశ్నించగలిగే దమ్మున్న నాయకత్వం ప్రాంతీయ మండలికి ఉండే విధంగా నిర్మాణం జరిగే సూచనలను కమిటీ మరింత ఆలోచించి చేసివుండాల్సింది !

3) ఇలాంటి సంస్థలవలన మరొక అధికార కేంద్రం ఉంటుందని ముఖ్యమంత్రులు వాటిని జేబులోకి దూర్చుకొనే ప్రయత్నాలు తప్పక చేస్తారు. ప్రజలే వాటిని వమ్ము చేయాలి.

4) రాష్ట్రానికి సాధించిన ప్రాజెక్టులు, పరిశ్రమలు, విద్యాసంస్థలు, ఉద్యోగ ఉపాధులను కల్పించే సంస్థలు ఇకనుంచి మూడు ప్రాంతాలకూ సమపాళ్లుగా అందేట్లు చట్టపరమైన హక్కు కల్పించాలి. వివక్ష జరిగితే ప్రభుత్వాన్ని నిలదీసే అధికారం అవకాశం ప్రజలకు ఉండాలి. శ్రీకృష్ణ కమిటీ ఇలాంటి సిఫారసులుచేసి ఉంటే, ఇతర రాష్ట్రాలు కూడా ఈ నివేదికని భగవద్గీతగా భావించి ఉండేవి.

5) మొత్తం రాష్ట్రానిదంతా ఒకే భాష, ఒకే సంస్కృతి, ఒకే జీవన విధానం. ఒకే ప్రజలు నివసిస్తున్న ప్రాచీనమైన, విశిష్టమైన, నాగరికమైన, సంపన్నమైన భూమి మనది. మధ్యయుగాలలో రాజులు చిన్న చిన్న రాజ్యాలుగా ఈ భూమిని విడదీసి కానుకలుగా విదేశీయులకి అప్పజెప్పినందు వలన వందల సంవత్సరాల ఎడబాటు కలిగింది. కానీ, తెలంగాణా, సీమ కోస్తా ప్రాంతాల మధ్య, ప్రజల మధ్య, జాతుల మధ్య, సంస్కృతుల

మధ్య బలవంతపు సయోధ్యని కుదిర్చినట్టు వారు వేర్వేరు జాతులైనట్లు ప్రచారం జరిగింది! మీడియా ఈ ప్రచారంలో ఒక భాగం అయ్యింది. ఇది దురదృష్టకరం జాతిని జాగృతం చేయాల్సిన తన కర్తవ్యానికే మీడియా కట్టుబడాలని కమిటీ తన నివేదికలో ప్రస్తావించి ఉండల్సింది. రాష్ట్ర ప్రభుత్వం తనకున్న చట్టపరమైన, రాజ్యాంగపరమైన అధికారాలు ఉపయోగించుకొని ఉత్తర తెలంగాణాలో ఒక మెడికల్ కాలేజీ లేక విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయాలని కమిటీ ఒక చక్కని సూచన చేసింది.

జిల్లాకొక విశ్వవిద్యాలయం ఏర్పరచిన ప్రభుత్వం, మరొక వైద్య విశ్వవిద్యాలయాన్ని ఉత్తర తెలంగాణాలో ఏర్పాటు చేయటం అవసరమే ! రాయలసీమలో కూడా మరొక వైద్య విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేయడం గురించి కూడా ప్రభుత్వం ఆలోచించవలసి ఉంటుందని ప్రతి ఒక్కరికి అనిపిస్తుంది. ఉత్తరాంధ్రాలో కూడా ఐ.ఐ.టి.లాంటి సంస్థ ఏర్పాటు జరిగితే మంచిదని సూచించి ఉంటే ఎంతో బావుండేది. ఉత్తరాంధ్ర సమస్యల్ని కమిటీ వారు ఓపికగా విన్నారుకదా ! వాటిగురించి తగినంతగా స్పందిచకపోవడం, ఆ ప్రాంత ప్రజల మనోభావాలను దెబ్బతీస్తుంది కదా !

ఏదిఏమైనప్పటికి తెలుగువాడి బాగు గురించి శ్రీకృష్ణ కమిటీ అమితంగా తపనపడిన మాట వాస్తవం ! ఏడాది పాటు కాళ్ళకు బలపం కట్టుకుని రాష్ట్రం అంతా తిరిగిన మాటకూడా వాస్తవం. అన్ని విషయాలనూ అర్థం చేసుకునే ప్రయత్నం చేసింది. చాలా మంది పెద్ద రాజకీయ వేత్తలకు కూడా రాష్ట్రంలో ఇతర ప్రాంతాల్లోని ప్రజల సామాజిక సమస్యలు తెలియవు. కానీ, జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ అన్ని ప్రాంతాల్లోనూ లోతైన అధ్యయనం చేసే ప్రయత్నం చేసింది.

దాని ఆరవ ప్రతిపాదనే అసలు ప్రతిపాదన. ఇదొక్కటే శరణోపాయం అని స్పష్టం చేసింది. ఈ ప్రతిపాదన కొత్తదికాదని, కొండను తవ్వి ఎలికను పట్టిన చందంగా ఉందనీ అనే వ్యక్తులు మిగిలిన ఐదు ప్రతిపాదనల్లో ఆచరణసాధ్యంకాని అంశాలను కమిటీ ఎత్తిచూపించి నప్పుడు వాటిని ఆచరణ సాధ్యమేనని నిరూపించే ప్రయత్నం చేయకపోవడం గమనార్హం. "నా మాటే చెల్లాలి" అనే ధోరణి, కొన్నాళ్లే నిలుస్తుందని కమిటీ తన నివేదికలో చక్కగానే చెప్పింది. "ప్రాంతీయ సాధికారికతతో కూడిన సమైక్య రాష్ట్రం" అనేది జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ ఇచ్చిన తీర్పు !!

## ఉపసంహారం

నిర్ణయం తీసుకునే హక్కు ప్రభుత్వానిదే ! కమిటీ కొన్ని సూచనలు మాత్రమే చేసింది. ఏ నిర్ణయం తీసుకున్నా లాభనష్టాలను నిష్పక్షపాతంగా వివరించే ప్రయత్నంచేసింది. ప్రభుత్వ నిర్ణయం ఏదైనా, కమిటీ చేసిన సూచనలను, హెచ్చరికలను

పరిగణనలోకి తీసుకోవటం తప్పనిసరి. మంచిపాలన, మూడు ప్రాంతాల మధ్య ఆర్థిక సమానత్వం అనే రెండు అంశాలను జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ ముఖ్య లక్ష్యంగా చేసుకొని అధ్యయనం చేసింది.

కమిటీని కాలయాపన చేసేందుకే వేశారనే అంశంమీద కూడా కమిటీ దృష్టి పెట్టింది. నిర్దేశిత కాలప్రమాణం పెట్టుకొని నిర్ణయాలు తీసుకోకుండా సాచివేత ధోరణిని అవలంభించినందుల్ల కొత్త సమస్యలు, కొత్త ఉద్యమాలు పుట్టకొచ్చి అభివృద్ధి మరింత కుంటుపడే ప్రమాదం ఉందని ప్రభుత్వాన్ని తీవ్రంగానే హెచ్చరించింది. సకాలంలో సరి అయిన నిర్ణయం తీసుకోగలిగితే ప్రజల మనోభావాలను భావోద్వేగాలను గుర్తించి, గౌరవించి, సంతృప్తి పరచినట్లవు తుంది. ఆ విధంగా ప్రభుత్వం స్పందిస్తుందని ఆశాభావం వ్యక్తపరచింది.

**జలవనరుల వినియోగ సంఘం (Water Management Board) ఏర్పాటు :**

కమిటీ చేసిన సూచనల్లో జలవనరుల వినియోగం గురించి చేసినవే ముఖ్యమైనవి. ఎగువ రాష్ట్రాలవారు ఒక వైపు తమ నీటిని బిగిస్తున్న తీరుని ఖండిస్తూనే, తెలంగాణా రాష్ట్రం వస్తే దిగువ ప్రాంతాలైన రాయలసీమ కోస్తాలకు నీరు అందకుండా బిగించేస్తామని వేర్పాటువాదులు అత్యుత్సాహంగా మాట్లాడటాన్ని కమిటీ ప్రస్తావించింది. తెలంగాణా ఉద్యమానికి చేటుచేసిన స్వయంకృత అపరాధాల్లో ఇది ఒకటి ! ఉద్యమకారులు ఇలా వ్యవహరించి ఉండాల్సింది కాదు.

రాష్ట్రాన్ని సమైక్యంగా ఉంచే నిర్ణయమే తీసుకున్నట్లయితే, 'జలవనరుల వినియోగ సంఘం' నీటి విడుదలపైన మూడు ప్రాంతాల చట్టపరమైన హక్కుని సంరక్షిస్తూ వివాదాలు పరిష్కరించగలుగుతుందని కమిటీ భావించింది. స్కీములు, ప్రాజెక్టులు, జలయజ్ఞానికి సంబంధించిన బడ్జెట్ సూచనలు అన్నీ ఈ బోర్డు నిర్ణయానికి వదలాలని కమిటీ భావించింది. అది తెలంగాణాకు, తక్కిన ప్రాంతాలవారికి మేలు చేస్తుందని ప్రకటించింది.

ఈ జలవనరుల వినియోగ సంఘాన్ని రాష్ట్రంలోని చట్టాల ప్రకారం ఏర్పరచాలని, కేంద్ర ప్రభుత్వంతో అవగాహన కుదుర్చుకొని దానిని ప్రకటించాలని, కేంద్ర ప్రభుత్వంలోని ఒక ఉన్నతాధికారిని ఈ సంఘం అధ్యక్షులుగా నియమించాలని కమిటీ ప్రతిపాదించింది.

ఒకవేళ రాష్ట్రాన్ని విభజించడమే అనివార్యం అయితే, అది రెండు ముక్కలు చేసినా, మూడు ముక్కలు చేసినా ఆ కొత్త రాష్ట్రాల పునర్నిర్మాణ సమయంలో తీసుకోవాల్సిన చట్టపరమైన జాగ్రత్తలను కమిటీ ప్రస్తావించింది. భాక్రా బియాస్ మేనేజ్‌మెంట్ బోర్డు, తుంగభద్ర బోర్డు మొదలైనవి ఆయా నదులు ప్రవహించే వివిధ రాష్ట్రాల మధ్య సమన్వయాన్ని సాధించి, వివాదాలు పరిష్కరిస్తున్న తీరును ఇందుకు ఉదాహరణగా

చూపించారు. కేంద్ర ప్రభుత్వానికి ఇలాంటి సంఘాలు నియమించే విచక్షణాధికారాన్ని ఇక్కడ కమిటీ గుర్తు చేసింది. ముందుగానే కమిటీని నియమిస్తే, అది రాష్ట్రాన్ని విభజించే క్రమంలో న్యాయమైన నీటివాటాలను గుర్తించగలుగుతుందని భావించింది !

రాష్ట్రంలోని ఇప్పటికే ఉన్న ఇరిగేషన్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ పాత్రని, పరిధిని విస్తరించాలని కమిటీ ప్రతిపాదించింది. మహారాష్ట్రలో అనుసరిస్తున్న విధానాన్ని ఆదర్శంగా తీసుకోవాలని కూడా సూచించింది. ఇంకా ఇతర రాష్ట్రాల్లో అమలౌతున్న తీరుని పరిశీలించ వచ్చన్నారు.

తెలంగాణా ప్రాంతీయ అభివృద్ధి సాధికారిక మండలి (Telangana Regional Development Council) గురించి మరొకసారి ప్రస్తావిస్తూ భారత రాజ్యాంగం 371 ప్రకారం దానిని ఏర్పాటు చేయవచ్చని ప్రతిపాదించారు.

తెలంగాణాకి సంబంధించినంత వరకూ ప్రభుత్వపరంగా అభివృద్ధికి సంబంధించిన ప్రణాళికా నిర్మాణంలో ఈ అభివృద్ధి మండలి తన పూర్తి అధికారాన్ని వినియోగించ గలిగేదిగా ఉండాలని కమిటీ ఆకాంక్షించింది. నిధులు, విధులు, విధానాలు స్వతంత్రంగా ఈ మండలి నిర్ణయించుకునేలా ఉండాలన్నారు. అయితే 'హైదరాబాద్' మాత్రం ఈ మండలి పరిధిలో ఉండదని, ఇప్పటికే ముఖ్యమంత్రి అధ్యక్షతన ఒక కమిటీ ఆ బాధ్యతల్ని నిర్వహిస్తోందని గుర్తుచేశారు. గ్రేటర్ హైదరాబాద్ మినహా తక్కిన తెలంగాణా ఈ తెలంగాణా అభివృద్ధి మండలి పరిధిలో ఉంటుందని పేర్కొన్నారు.

అభివృద్ధి మండలి వార్షిక నివేదికని అసెంబ్లీలో పెట్టి చర్చించాలని కూడా సూచించారు. మండలిని అసెంబ్లీకి జవాబుదారీ చేయడం బాగుంది. ప్రాంతీయ మండలి సాధికారికత అనేది వాస్తవికంగా ఉండాలని కూడా ఆకాంక్షించారు. మన రాజకీయ నాయకులు ఇలాంటి వ్యవస్థల్ని జేబు సంస్థలుగా మార్చటంలో సిద్ధహస్తులు కాబట్టే, శ్రీకృష్ణ కమిటీ ఇన్ని హెచ్చరికలు, జాగ్రత్తలు, మార్గనిర్దేశక సూత్రాలను ప్రస్తావించవలసి వచ్చింది.

ప్రజలలో ప్రభుత్వంపట్ల, పాలనావ్యవస్థ పట్ల విశ్వసనీయత ఇందులో ముఖ్యమైంది. భారత రాజ్యాంగం 371 డి (10) ప్రకారం రీజియన్ కౌన్సిల్‌కు చట్టపరమైన సాధికారికతని కల్గించవచ్చునన్నారు. ప్రజా విశ్వాసాన్ని తద్వారా ప్రోదిచేయవచ్చునన్నారు.

ఆరవ ప్రత్యామ్నాయాన్ని తీర్పుగా ప్రకటించినంత మాత్రాన జస్టిస్ శ్రీకృష్ణకమిటి నివేదిక తెలంగాణాకు వ్యతిరేకంగా ఉందనడం అపోహ. తెలంగాణాకు ఈ 50 ఏళ్ళలో అన్యాయం జరిగిందని నిరూపించే అనేక వాస్తవాల్ని ఈ నివేదిక బహిర్గతం చేసింది. అది సీమ, కోస్తావారి ఆలోచనల్ని అనుకూలంగా ప్రభావితం చేసే అంశమే!

నిజానికి శ్రీకృష్ణ కమిటీ తన నివేదికలో మరో షట్సూత్ర పథకాన్ని సూచిస్తుందని, ఎక్కువమంది ఊహించారు. అయితే, కమిటీ తన నివేదికలో ఆరు అభివృద్ధి సూత్రాలకు బదులుగా ఒకే అభివృద్ధి సూత్రాన్ని ప్రతిపాదించింది. అది అన్ని రకాల అభివృద్ధులనూ పర్యవేక్షించగలిగే చట్టపరమైన సాధికారిక వ్యవస్థ ఏర్పాటు !

ముఖ్యమంత్రి ఏ ప్రాంతంవాడయినా, ఈ తెలంగాణా ప్రాంతీయ అభివృద్ధి మండలికి తెలంగాణా వారే బాధ్యులుగా ఉంటారు. ఆశించిన స్థాయిలో ఈ మండలి పనితీరు ఉన్నా, లేకపోయినా దానికి బాధ్యులు తెలంగాణా వారే అవుతారు.

ముఖ్యమంత్రిని అధికార కేంద్రంగా మార్చిన మన పాలనా వ్యవస్థ మారాలి. వివిధ రంగాలలో అభివృద్ధికి బాధ్యత వహించే ప్రత్యామ్నాయ వ్యవస్థలు ఏర్పడాలి. "నేను"లోంచి "మనం" లోకి పరిపాలన మారాలి. ముఖ్యమంత్రి నామినేట్ చేసే పద్ధతిలో ఈ మండలి ఉంటే మాత్రం అది జేబు సంస్థగా మారక తప్పదు.

**చివరిగా ఒక మాట**

'నిజమైన సమైక్యత' ఎలా ఉండాలో ఈ కమిటీ నివేదిక ఒక దృశ్యాన్ని మనకి అందిస్తోంది. తెలుగు ప్రజలకోసం, వారి భాషా సంస్కృతుల పరిరక్షణ కోసం, వారి వనరుల సద్వినియోగం కోసం, వారి వెనుకబాటు తనానికి చికిత్సకోసం, ఇంతగా ఆలోచించిన సంఘటన ఇంతవరకూ జరగలేదు. ఈ నివేదికని వ్యక్తిగత రాగద్వేషాలకు అతీతంగా పరిశీలించడం విజ్ఞత అనిపించుకొంటుంది. ఈ నివేదిక ముందడుగుకోసం ఒక మార్గం వేయడానికి కోసం చేసిన ఒక గొప్ప ప్రయత్నం. ఉన్నతపాలన అందించాలనే సత్సంకల్పం రాజకీయ వ్యవస్థకి ఉన్నట్లయితే వాళ్లకు ఈ నివేదిక పవిత్ర గ్రంథమే అవుతుంది ! దాన్ని మరింత పదును పెట్టి గొప్ప ఆయుధాన్నిచేసి అభివృద్ధి నిరోధకత పైన ప్రయోగించడానికి పెద్ద మనసుకావాలి.

పదవులకోసం తప్ప, స్వచ్ఛమైన పాలనకోసం ఆరాటపడని వాళ్లనుంచి మనం ఎక్కువ ఆశించడం పొరబాటే అయినప్పటికీ ఉన్నంతలో ఈ మార్గదర్శక సూత్రాలు ఒక వంతైనా వంటబట్టించుకో గలిగితే జాతికి మేలు జరిగినట్టే ! తెలుగు ప్రజలు జస్టిస్ శ్రీకృష్ణ కమిటీకి ధన్యవాదాలు చెప్పుకోవాలి. మన గురించి మనవాళ్లుకాని వ్యక్తులు ఇంతగా చేసిన ఆలోచనకు అనుకూలంగా స్పందించడం మనుషులుగా మన బాధ్యత !

2011 జనవరి, 6న కమిటీ నివేదికని కేంద్ర ప్రభుత్వం ఇంటర్నెట్ ద్వారా ప్రజలకు అందించిన కేవలం ఏడు రోజులలోనే ఈ పుస్తకం పూర్తయ్యింది. అప్పటికి, వివిధ ప్రాంతాలలోని మేధావులు, ప్రజాప్రతినిధులు, ప్రజారంగ ప్రముఖులు ఈ నివేదికపై తమ అభిప్రాయాలను ఇంకా వెలువరించడం ప్రారంభించలేదు. ఎవరి మనసులోని మాటా ఇంకా బైటకు రాలేదు. కమిటీ అంశాలవారిగా తన అధ్యయన వివరాలను ఈ

నివేదికలో పొందుపరిచినప్పుడు ఒక పాఠకుడిగా, వాస్తవాలు తెలుసుకోగోరే పరిశోధకుడిగా, మూడు ప్రాంతాలకూ మంచి జరగాలని కోరుకునే తటస్థవాదిగా వాటిని చదువుతున్నప్పుడు కలిగిన ఆలోచనలే ఈ విశ్లేషణగా వెలువడుతున్నాయి.

**మొదట తెలంగాణాకు మంచి జరగాలి. అది సీమ కోస్తాలకు అపకారం చేసేదిగా ఉండకూడదు. సీమ కోస్తాల మధ్య, అలాగే కోస్తాలోనే ఉత్తర కోస్తా దక్షిణ కోస్తా వారి మధ్య భవిష్యత్తులో వివాదాలు చెలరేగకుండా ఉండాలి.** ఇదీ తటస్థ వాదులు కోరుకునే అంశం ! ఇలా కోరుకోవడం కూడా సమైక్యవాదమేనని కొందరు అనవచ్చు. కానీ, ఇది జాతీయ సమైక్యవాదంలో ఒక భాగమేనని భావిస్తూ, ఈ నివేదికని అధ్యయనం చేయడం జరిగింది. సామాన్య ప్రజలు కూడా దీని గురించి మనసు పెట్టి ఆలోచించాలనే లక్ష్యంతో తేటతెలుగులో దీనిని విశ్లేషించి అందించడమూ జరుగుతోంది.

మూడు ప్రాంతాలలో ఎవరూ ఓడిపోని రీతిలో, చివరికి ప్రజలదే గెలుపు అయ్యేలా కేంద్ర ప్రభుత్వం ఆలోచించి, విజ్ఞతతో వ్యవహరిస్తుందని లోకం ఎదురు చూస్తోంది !

**" తరవో పి హి జీవంతి**
**జీవంతి మృగ పక్షిణః**
**సజీవతి మనో యస్య**
**మననేవ హి జీవతి (యోగవాసిష్ఠం)**

**చెట్లు బతుకుతాయి. మృగాలు, పక్షులు కూడా బతుకుతాయి. కానీ, మనసుతో ఆలోచించి బతికేవారిదే అసలైన బతుకు !"**



జస్టిస్ శ్రీ కృష్ణ కమిటి నివేదిక

# ఏం చెప్పింది ? ఎందుకు చెప్పింది ?



డా॥ జి.వి. పూర్ణచందు ప్రసిద్ధ సాహితీవేత్త, పరిశోధకులు, విమర్శకులు. వందకు పైగా పుస్తకాలు వెలువరించారు. పరిశోధనా రంగంలో వీరి కృషికి తెలుగు విశ్వ విద్యాలయం ఇటీవల పురస్కారం ఇచ్చి గౌరవించింది. తొలి ప్రపంచ తెలుగు రచయితల మహా సభలను అనితర సాధ్యంగా నిర్వహించారు. కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రధాన కార్యదర్శిగా, తెలుగు భాషోద్యమ ప్రముఖుడిగా తెలుగు భాషా సంస్కృతుల పరిరక్షణ కోసం కృషిచేస్తున్నారు. వృత్తిరీత్యా వైద్యులు. ప్రవృత్తి పరిశోధన, విశ్లేషణ.

## గెలుపు ప్రజలందరిదీ కావాలి !!

తెలంగాణాలో అగ్రకులాల్లో మాత్రమే ఆర్థిక సమానత్వం సిద్ధించగా, కోస్తాలోని వెనుకబడిన కులాల్లోనూ, రాయలసీమలోని అన్ని వర్గాల ప్రజల్లోనూ ఆర్థిక అసమానత్వమే తాండవిస్తోందని "కొరాడోగినీ" అంతర్జాతీయ ఆర్థిక నిపుణతా విధానం "గినీ కోఎఫిషియెంట్" ఆధారంగా, జస్టిస్ శ్రీకృష్ణకమిటీ నివేదిక విశ్లేషిస్తోంది.

తెలంగాణా అభివృద్ధిని దిగువ వర్గాల ప్రజలకు అందకుండా ఈ అధిపత్య వర్గమే కైంకర్యం చేసిందని కూడా ఈ నివేదిక వెల్లడించింది. ఆ కారణంగానే తెలంగాణాలో వెనుకబాటుతనం యథాతథంగా నిలబడి ఉంది.

ఈ "లోపలి దొంగల" ఆటకట్టించడం ఎలా ? తెలంగాణాతోపాటు సీమ, కోస్తాలలోని వెనుకబాటుతనానికి విరుగుడు ఏమిటీ ? మేధావులైన ప్రజలే సమాధానాలు రాబట్టాలి.

మూడు ప్రాంతాలలో నెలకొన్న పరిస్థితులకు కొన్ని ప్రత్యామ్నాయ పరిష్కార మార్గాల్ని కమిటీ తన నివేదికలో సూచించింది. వాటి కన్నా మెరుగైన పరిష్కారాలు కనుగొని అన్ని ప్రాంతాల ప్రజలమనోభావాలనూ గౌరవించే అవకాశం ప్రజలముందు ఉంది.

మనసుపెట్టి ఆలోచించే వారికి ఈ పుస్తకం ఒక సహాయకారి అవుతుంది. ఆలోచిద్దాం రండి ! గెలుపు ప్రజలందరిదీ కావాలి !!

వెల : ₹ 40.00




విక్టరీ పబ్లిషర్స్
# 11-16-32, సింగరాజువారి వీధి, కొత్తపేట,
విజయవాడ - 520 001. ఫోన్ : 6465533

